# ప్రథమ దైవ గ్రంథము
# భగవద్గీత




రచయిత: త్రిమత ఏకైక గురువు

ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త

ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**



*www.thraithashakam.org*







# ప్రథమ

# దైవ గ్రంథము

# భగవద్గీత

ఇందూ (హిందూ) ధర్మప్రదాత,

సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త

**శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు**





<u>ప్రచురించిన వారు</u>

**ఇందూ జ్ఞానవేదిక**

(Regd.No. : 168/2004)

త్రైత శకము–35    ప్రథమ ముద్రణ : సం॥ 2014

ప్రతులు : 1000    **వెల : 70/-**

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక రచనలు

## ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు

1) త్రైత సిద్ధాంత భగవద్గీత.
2) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
3) ధర్మము-అధర్మము.
4) ఇందుత్వమును కాపాడుదాం.
5) యజ్ఞములు (నిజమా-అబద్దమా?).
6) దయ్యాల-భూతాల యదార్థసంఘటనలు.
7) సత్యాన్వేషి కథ.
8) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా)
9) శ్రీకృష్ణుడు దేవుడా, భగవంతుడా.
10) గీతా పరిచయము (తెలుగు,ఇంగ్లీషు)
11) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
12) జనన మరణ సిద్ధాంతము.
13) మరణ రహస్యము.
14) పునర్జన్మ రహస్యము.
15) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా)
16) కథల జ్ఞానము.
17) సామెతల జ్ఞానము.
18) పొడుపు కథల జ్ఞానము.
19) తత్త్వముల జ్ఞానము.
20) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
21) గీతం-గీత (పాటల జ్ఞానము).
22) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
23) దేవాలయ రహస్యములు. (తెలుగు,ఇంగ్లీషు,కన్నడ)
24) ఇందూ సాంప్రదాయములు.
25) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా).
26) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?)
27) వాస్తు శాస్త్రము (సత్యమా-అసత్యమా).
28) తల్లి తండ్రి.
29) గురు ప్రార్థనామంజరి.
30) త్రైతారాధన.
31) సమాధి.
32) ప్రబోధ.
33) సుబోధ.
34) ప్రసిద్ధి బోధ.
35) సుప్రసిద్ధి బోధ.
36) సిలువ దేవుడా?
37) మతాతీత దేవుని మార్గము.
38) సృష్ఠికర్తకోడ్-963.
39) మతము-పథము.
40) ప్రబోధానందం నాటికలు.
41) ఇందువు క్రైస్తవుడా?
42) త్రిత్వమా? ద్విత్వమా?
43) నిగూఢ తత్త్వార్థ బోధిని.
44) ఆత్మలింగార్థము.
45) నాస్తికులు-ఆస్తికులు.
46) హేతువాదము-ప్రతివాదము.
47) గుత్తా.
48) ప్రబోధ తరంగాలు.
49) త్రైత సిద్ధాంతము.
50) రూపము మారిన గీత.
51) ఉపనిషత్‌లలో లోపాలు.
52) బైబిల్‌లో (ఇందు) పవిత్ర వాక్యాలు.
53) ఖురాన్‌లో (ఇందు) పవిత్ర వాక్యాలు.
54) ద్రావిడ బ్రాహ్మణ.
55) తీర్పు.
56) కర్మ పత్రము.
57) ప్రవక్తలు ఎవరు?
58) ప్రథమ దైవ గ్రంథము భగవద్గీత.

## యోగీశ్వరుల వారి సంచలనాత్మక ప్రసంగాలు
**DVD'S**

01. సంతకము.
02. సాంప్రదాయము.
03. త్రైతశకము.
04. కోడిపుంజు-పాదరసము.
05. యుగము-యోగము
06. నైజం-సహజం.
07. ఆత్మకు వెంట్రుక గుర్తు.
08. పైత్యం-సైత్యం.
09. శైవము-వైష్ణవము.
10. ఇందూమహాసముద్రము.
11. సృష్ఠి-సృష్ఠికర్త.
12. కాయ-పండు-కాయ.
13. జ్ఞానము-విజ్ఞానము.
14. వార-మాస-వత్సర.
15. సేకూవలి-కూలిసేవా.
16. ధర్మము-అధర్మము.
17. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
18. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
19. బట్టతల.
20. భగవంతుడు.
21. ద్రావిడులు-ఆర్యులు.
22. ప్రభువు-ప్రభుత్వం.
23. భూతం-మహాభూతం.
24. ప్రభు-ప్రజ.
25. యాదవ్.
26. పుస్తకము-గ్రంథము.
27. వెలుగుబంటు.
28. ప్రకృతి-వికృతి.
29. మాట-మందు.
30. ఏకత-ఏకాగ్రత.
31. హరికాలు-హరచేయి.
32. పుట్టగోసి-మొలత్రాడు.
33. 1 2 3 గురుపౌర్ణమి.
34. చమత్కార ఆత్మ.
35. క్షమించరాని పాపము.
36. మాయకుడు-అమాయకుడు.
37. మరణము-శరీరము
38. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
39. ద్వితీయుడు-అద్వితీయుడు
40. బయటి సమాజం-లోపలి సమాజం.
41. సేవా శాతము.
42. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
43. శ్రీకృష్ణాష్టమి.
44. దేవునిజ్ఞానము-మాయమహత్యము
45. తల్లి తండ్రి.
46. తల్లి తండ్రి-గురువు దైవము.
47. సమాధి.
48. మతము-పథము.
49. కలియుగము
50. దివ్యఖురాన్-హదీసు.

# యోగీశ్వరుల వారి సంచలనాత్మక ప్రసంగాలు

DVD'S

51. పుట్టుట-గిట్టుట.
52. తల్లి.
53. గోరు-గురు.
54. కర్మ మర్మము.
55. ఆత్మ.
56. తాత.
57. గురుపౌర్ణమి.
58. ఇందువు-హిందువు.
59. శ్రీకృష్ణజన్మ మధుర.
60. ఆత్మపని.
61. కర్మ లేని కృష్ణుడు-
    కర్మ ఉన్న కృష్ణుడు.
62. త్రైత సిద్ధాంతము
63. సహజ మరణం-
    తాత్కాలిక మరణం.
64. స్త్రీ-పు / లింగము
65. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
66. దేశం మోసం-దేహం మోహం
67. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
68. జీర్ణ+ఆశయము
69. మేఘం ఒకభూతం-
    రోగం ఒకభూతం.
70. దేవునికి మతమున్నదా?
71. ఇచ్ఛాధీన కార్యములు-
    అనిచ్ఛాధీన కార్యములు.
72. ఏది ధర్మము
73. అధర్మ ఆరాధనలు.
74. మూడు పుట్టుకలు-రెండు జాగాలు
75. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
76. నిదర్శ - నిరూప
77. నటించే ఆత్మ
78. సంచిత కర్మ
79. గురువు ఎవరు?
80. శ్రీకృష్ణుడు ఎవరు?
81. సుఖము-ఆనందము
82. టక్కుటమారా, ఇంద్రజాల
    మహేంద్రజాల, గజకర్ణ గోకర్ణ.
83. దశ-దిశలు.
84. ఆడించే ఆత్మ
85. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం)
86. ఆడ-అసూయ, మగ-ఆశ.



యు ట్యూబ్ వీడియోలు
http://www.youtube.com/channel/UCkrD6R8nEU0-O7gNn46Ktfw

# ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు లభించు చిరునామా



## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 9866512667, 9951675081, 9948191506, Fax : 08558-225966.

**ఇందూ జ్ఞానవేదిక**

**(రాష్ట్రకార్యాలయము)** Fax : 040-24146006.
శ్రీదేవికాంప్లెక్స్, ప్రభాత్‌నగర్,
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్
9848057951, 9491877239, 9848590172.

*****

**పి. నాగయ్య** (ప్ర.సభ్యుడు)

ఇ.నెం. 76/97/29, కోట్లనగర్ ప్రక్కన,
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు (జిల్లా).
Cell : 9440244598, 9849303902,

*****

**బాలం లక్ష్మీనరసింహులు** (ప్రెసిడెంట్)

కదిరి రోడ్డు, రాజానగర్, నీరుగట్టువారి
పల్లి, మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

*****

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)

ధన్వంతరి హెల్త్ కేర్ సెంటర్,
హుజూర్‌నగర్, నల్లగొండ (జిల్లా)
Cell : 9848574803, 9502932941.

*****

**టి. ఆదినారాయణ** (ప్ర.సభ్యుడు)

భాగ్యనగర్ ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥),
హిందూపురం (తా), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**కె.లక్ష్మినారాయణాచారి** (ప్రెసిడెంట్)

బ్యాటరీషాప్, నియర్ ఎస్.ఐ.యు చర్చి,
మార్కెట్‌స్ట్రీట్, ధర్మవరం, అనంతపురం (జి)
Cell :9440556968, 9290012413,
9440601136.

*****

**అనమల మహేశ్వర్** (ప్రెసిడెంట్)

చవటపాల్యం (గ్రా), గూడూరు (మం),
నెల్లూరు జిల్లా. Cell : 9494631664,
9490809081,8106065300.

*****

**డా॥యం. వెంకటేశ్వర రావు** (ప్రెసిడెంట్)
MD (acu)

డోర్ నెం. 24-4-178, గోవింద నిలయం,
శాంతినగర్, నెల్లూరు జిల్లా - 524003.,
Cell : 9440615064, 9246770277.

*****

**టి. వీరనారాయణ రెడ్డి** (ప్ర.సభ్యుడు)

బట్టేపాడు గ్రా॥ ఆత్మకూరు మం॥,
నెల్లూరు (జిల్లా)., Pin : 523322.
Cell : 9494618322, 8374923363

*****

**బి. ఆదిశేషయ్య** (టీచర్) (ప్రెసిడెంట్)

రామానుజం స్కూల్ దగ్గర, ఉప్పరవీధి,
గుత్తి, అనంతపురం (జిల్లా)
Cell : 9491362448, 7382986963.

## ఇందూ జ్ఞానవేదిక ప్రచురణలు లభించు చిరునామా

**డా॥బి.ధర్మలింగాచారి** (ప్ర.సభ్యుడు)

శ్రీ కనక మహాలక్ష్మి క్లినిక్,
Opp. R.T.C బస్టాండ్ Out Gate,
విశాఖ రోడ్, శృంగవరపు కోట
(S కోట), విజయనగరము (జిల్లా).
Cell: 08966-275208, 9704911737

*****

**బి.శాంతరాజు** (ప్ర.సభ్యుడు)

ఇంటి నెం.20-18/1-22, ప్లాట్ నెం.43,
క్రిష్ణరాజపురము, విజయనగరము (జిల్లా).
Cell : 9640526520, 9573335559

*****

**ఎ. నాగేంద్ర** (ప్రెసిడెంట్)

కమ్మపాలెం వీధి, క్రొత్త చెరువు (గ్రా),(మం)
అనంతపురం జిల్లా. Cell : 9493622669,
9959316410, 9949995090.

*****

**రౌతు శ్రీనివాసరావు** (ప్రెసిడెంట్)

ఇంటి నెం.19-10-17, ఏటుకూడు రోడ్,
దర్గామాన్యం, గుంటూరు జిల్లా.
Cell : 9948014366, 9052870853

*****

**డి. బాలాజీ** (వైస్ ప్రెసిడెంట్)

ఇంటి నెం.2-23, నెహ్రూవీధి, బంగారు
పాళ్యం (గ్రా, మం), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**మంగం చంటి** (ప్ర.సభ్యుడు)

డోర్ నెం.50-93-2/22, శ్రీనివాస
రెసిడెన్సి, సీతమ్మపేట, గురుద్వార
జంక్షన్, సాయిబాబా గుడిప్రక్కన,
శాంతిపురం, విశాఖపట్నము.
Cell : 9948663149, 9440134499

*****

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)

మెయిన్ రోడ్డు, బొద్దాం (గ్రా),
రాజాం (మం), శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

*****

**టి. ఉదయకుమార్** (ప్రెసిడెంట్)

మోటుపల్లివారి వీధి, బుధవారము
మార్కెట్, భీమవరం-1, పశ్చిమగోదావరి.
Cell : 9948275984, 7386433834.

*****

**టి.వి. రమణ** (ప్రెసిడెంట్)

విశ్వభారతి స్కూల్ దగ్గర,
ముదిగుబ్బ (గ్రా, మం), కదిరి (తా),
అనంతపురం జిల్లా-515511.
Cell : 9440980066, 8185020272.

*****

**వి. రామక్రిష్ణన్** (వైస్ ప్రెసిడెంట్)

నిరంజన్ టైమ్స్, తహశీల్దార్ ఆఫీస్
ఎదురుగా, నేతాజిరోడ్డు కుప్పం,
చిత్తూరు జిల్లా., Cell : 9652755110.
: 9440305700

**www.thraithashakam.org | Email : info@thraithashakam.org**

# ప్రథమ దైవ గ్రంథము భగవద్గీత

సృష్ఠికి పూర్వము నేడున్న శూన్యముగానీ, గాలిగానీ, అగ్ని, నీరు, భూమిగానీ ఏమీ లేవు. అది ఎవరి ఊహకూ, ఎవరి మేధస్సుకు అందని స్థితి. ఏదీలేని ఆ స్థితిని ఎవరూ పోల్చుకోలేరు. అప్పుడున్నదంతా దైవమే. దైవమును ఎవరుగానీ ఇట్లున్నదని చెప్పలేరు. ఏమీకాని స్థితిని దేవుడని మీరెందుకు చెప్పుచున్నారు? అని ఎవరైన నన్ను ప్రశ్నించవచ్చును. సృష్ఠికి ముందు దేవుడని చెప్పుటకు మీకు ఒక్క ఆధారమైనగలదా? అని అడుగ వచ్చును. దానికి మా జవాబు ఏమనగా! సృష్ఠిలేని అగమ్యగోచర స్థితినే దేవుడని చెప్పుటకు కొంత ఆధారము కలదు. సృష్ఠి తర్వాత ఆకారములేని దేవునికి సృష్ఠికి పూర్వము ఆకారము ఉండెడిది. ఎవరూ ఊహించలేని స్థితియే అప్పుడు దేవుని ఆకారముగా ఉండేది. సృష్ఠి తర్వాత పేరులేని దేవునికి సృష్ఠికి పూర్వము తెలియని స్థితియే పేరుగా ఉండేది. అలాగే సృష్ఠి తర్వాత పనిలేని క్రియారహితునికి తెలియని స్థితిలో దేవుని భావములు దేవుని క్రియగా ఉండేవి. సృష్ఠి తర్వాత కూడా దేవుడున్నాడు. అయితే సృష్ఠి తర్వాత యున్న విధానానికి వ్యతిరేఖముగా సృష్ఠిలేని స్థితిలో ఉండేవాడు. ఇక్కడే దేవుని గురించిన ఆధారము సంపూర్ణముగా లభించుచున్నది. అదేమనగా! ఇప్పుడు అనగా సృష్ఠి తర్వాత ఉన్నదానికి భిన్నముగా సృష్ఠి పూర్వము దేవుడుండెడివాడు. ఇప్పుడు ఏదయితే దేవునికి ముఖ్యధర్మముగా ఉన్నదో, దానికి పూర్తి వ్యతిరేఖముగా లేక భిన్నముగా సృష్ఠి పూర్వము దేవుడుండెడివాడు.

సృష్ఠి తర్వాత దేవునికి ముఖ్యముగా మూడు ధర్మములు కలవు. ఆ మూడిటిని వరుసగా కలిపి చెప్పితే రూప, నామ, క్రియా రహితుడని చెప్పవచ్చును. ఇప్పుడు సృష్ఠి ఉన్నంతకాలము దేవునికి రూపము లేదు,

పేరు లేదు, పనియూ లేదు. అందువలన ఈ మూడు ధర్మములకు విభిన్నముగా సృష్టి పూర్వము దేవుడున్నాడంటే, అప్పుడు ఆయనకు రూపము ఉంది, పేరు ఉంది, పని ఉందని చెప్పవచ్చును. అందువలన సృష్టికి ముందు దేవుడు రూప, నామ, క్రియా సహితుడని చెప్పవచ్చును. అప్పుడు మూడింటికి సహితుడయితే, ఇప్పుడు మూడింటికి రహితుడుగా ఉన్నాడు. అప్పుడు రూప, నామ క్రియా సహితుడని చెప్పుటకు, చూపుటకు ఆధారమేమైనా ఉన్నదా అంటే! ఉన్నదనియే చెప్పవచ్చును. ఆనాడు ఆయనకు (దేవునికి) క్రియ (పని) ఉన్నదని చెప్పుటకు ఈనాడు మనందరికి కనిపించు ప్రపంచమే సాక్ష్యము. ఆనాడు లేని దానిని సృష్టించి ఉంచడము పనియే కదా! దేవుని చేత సృష్టించబడిన ప్రపంచమే దేవుని క్రియకు ప్రతి రూపమని చెప్పవచ్చును. ఒక పని జరుగుటకు ముందు దానికి సంబంధించిన యోచన రావలెను. ఒక ఆలోచన వచ్చిన తర్వాత దాని ప్రకారము పథకము వేయబడి, పథకము ప్రకారము పనిని చేయవలసి యుండును. ఒక పథకము ఉంది అని అంటే దానిని రచించు బుద్ధి ఉండాలి. బుద్ధి వుంటే దానిని క్రియారూపము చేయుటకు ఆ విషయమును బయటికి తెచ్చు మనస్సు కూడా ఉండాలి. సృష్టికి పూర్వమున్న దేవునికి మనస్సు బుద్ధి కూడా ఉండేది. ఈ విషయము మనకు తెలియుటకు భగవద్గీతలో విభూతి యోగము అను అధ్యాయములో ఆరవ శ్లోకమందు ఈ విధముగా చెప్పాడు చూడండి...

శ్లో॥ మహర్షయ స్సప్త పూర్వే చత్వారో మనవస్తథా ।
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః॥

ఈ శ్లోకమునందు లోకములోని ప్రజలెల్ల నాయొక్క మనోభావము చేత పుట్టారని చెప్పడము జరిగినది. దీనినిబట్టి దేవునికి మనస్సు, బుద్ధి

మొదలగు సూక్ష్మ శరీరముండేదని, అది సూక్ష్మము కాబట్టి ఎవరికీ తెలియదని చెప్పవచ్చును. సృష్టికి పూర్వము రూప, నామ, క్రియలుగల దేవుడు, సృష్టి తర్వాత రూప, నామ, క్రియలు లేనివాడైపోయాడు. సృష్టికి ముందున్న దేవుని ధర్మములు సృష్టి తర్వాత భిన్నముగా ఉండుటకు దేవుడే నిర్ణయించు కొన్నాడు. అందువలన భగవద్గీతలో తనను (దేవున్ని) అవ్యక్తుడని చెప్పుకొన్నాడు. అన్ని విధముల అవ్యక్తుడుగా ఉండుటకు తనకు రూప, నామ, క్రియలు లేకుండా చేసుకొన్నాడు. అందువలన ప్రపంచములో ఎవరైనా దేవున్ని రూప, నామ, క్రియారహితుడని చెప్పవలెను. అదియే నిజమైన దేవుని ధర్మము.

ఇక్కడ కొందరికి మరియొక ప్రశ్న రావచ్చును. అదేమనగా! దేవుడు సృష్టికి పూర్వము సూక్ష్మముగాయుండి ఆకారము, పేరు, పని కల్గియున్నాడని చెప్పారు. దేవుడు అన్ని విధముల సూక్ష్మముగా ఉండుట వలన ఆయన ఎవరికీ తెలియుటకు వీలులేదు. సృష్టికి పూర్వము మనుషులే లేరు, కావున ఆయనను (దేవున్ని) ఎవరూ చూడలేదు. ఒకవేళ ఇప్పుడు ఎవరైనా తెలియుటకు ఇప్పుడు ఆకారముగానీ, పేరుగానీ, పనిగానీ లేదు. అందువలన ఆయనను ఎవరూ తెలియలేరు. దేవునికి రూప నామ క్రియలు ఉన్నప్పుడు మనుషులు లేరు. మనుషులున్నప్పుడు దేవునికి రూప నామ క్రియలు లేవు. అందువలన మనిషి అనబడు ఎవడుగానీ దేవున్ని తెలియలేడు. దేవుని విషయము ఏమాత్రము మనిషికి తెలియదు. దీనిప్రకారము దేవుని గురించిన విషయముగానీ, దేవుని జ్ఞానమునుగానీ మనిషి అయినవాడు ఎవడూ చెప్పలేడని తెలియుచున్నది. సందర్భాను సారము చెప్పుకొంటే దేవుని విషయము దేవునికి తప్ప, ఏ మనిషికీ తెలియదని ఒక మూల గ్రంథములో చెప్పబడినది. అంతిమ దైవగ్రంథము

ఖుర్‌ఆన్‌లో మూడవ సూరాయందు, ఏడవ ఆయత్ "దేవుని జ్ఞానము దేవునికి తప్ప మరి ఏ మానవునికీ తెలియదు" అని కలదు. దేవుడు సృష్టి పూర్వము ఆకారముతోయున్నా సూక్ష్మముగా ఉన్నవాడే, ఇప్పుడు ఆకారము లేకున్నా సూక్ష్మముగాయుండువాడే. అందువలన ఏ మనిషికీ దేవుడు గానీ, దేవుని పూర్తి సమాచారముగానీ తెలియదనియే చెప్పవచ్చును. అటువంటపుడు ఒక మనిషి అయిన శ్రీకృష్ణుడు "దేవునికి మనస్సు, బుద్ధి ఉందనీ, ఆయన సంకల్పము చేతనే జగతిని సృష్టించాడని" చెప్పితే దానిని నిజమని మనమెలా నమ్మాలి? ఆయన చెప్పిన భగవద్గీతను నిజమని ఎలా విశ్వసించాలి? దేవుని సమాచారమైన దేవుని జ్ఞానముగానీ, దేవుని ధర్మములుగానీ దేవునికి తప్ప ఇతర ఏ మానవునికి తెలియదని దేవుడే చెప్పినప్పుడు, మనిషి అయిన కృష్ణుడు చెప్పిన దానిని ఎందుకు నమ్మాలి? అని ప్రశ్నించవచ్చును.

దానికి మా సమాధానము ఏమనగా! మీరు అడిగిన ప్రశ్న చాలా గొప్పది. అది ఎంత గొప్పదో దానికి సమాధానము కూడా అంతే గొప్పగ ఉన్నది చూడండి. దేవుని మాటయే శాసనము. అందువలన ఆయన మాట పూర్తి సత్యము. ఆయన సృష్టి పూర్వము రూప నామ క్రియలుగల వాడనీ, తర్వాత రూప నామ క్రియలు లేవని చెప్పిన వారు మనిషే. దేవుడు నేను ఇటువంటి వాడనని ఎవరితోనూ చెప్పలేదు. ఆయనను గురించి మనకు సమాచారమిచ్చినది మొదట భగవద్గీత. ఆ భగవద్గీతను చెప్పినవాడు శ్రీకృష్ణుడు. శ్రీకృష్ణుడు ఒక మనిషి అయినందున దేవుని విషయము దేవునికి తప్ప ఏ మనిషికీ తెలియదను వాక్యమునుబట్టి కృష్ణుని మాటను ఎందుకు నమ్మాలి? భగవద్గీతలో నిజమైన దేవుని జ్ఞానమున్నదా? అని అనుమానము రాకతప్పదు. కృష్ణుడు మనిషి అయినందున ఆయన

మాటలను విశ్వసించకూడదు అని, కొందరు వాదించుటకు అవకాశము కలదు. ఈ విషయమై నన్ను అడిగితే నేను ఏమి చెప్పుచున్నానంటే! కృష్ణుడు మనిషి అయితే ఆయన మాటలన్నీ అసత్యమే అగును. ఒకవేళ కృష్ణుడు మనిషి కాకపోతే ఆయన మాటలను పూర్తిగా నమ్మవచ్చును. అయితే మొత్తము ప్రపంచమునకంతటికీ తెలుసు కృష్ణుడు ఒక మనిషియని. అతను కూడా ఒక తల్లికి పుట్టిన బిడ్డయనీ, అందరివలె నిద్ర, మెలుకువ, మైథునము (మిథునము లేక స్త్రీ సాంగత్యము) గల మనిషి అని అందరూ చెప్పగలరు. దేవుని విషయము దేవునికి తప్ప ఏ మనిషికీ లేక మనిషి అయినవానికి ఎవనికీ తెలియదను వాక్యమునననుసరించి, దేవుని విషయమును (జ్ఞానమును) దేవుడే చెప్పాలి తప్ప, ఎవరూ చెప్పలేరని తెలియు చున్నది. అయితే ఇక్కడ ఒక చిక్కు వచ్చిపడినది. అది ఏమనగా! దేవుడు స్వయముగా ఎవరితోనూ మాట్లాడడు. దేవుడు నేరుగా ఎవరితోనూ మాట్లాడడు అను విషయము అంతిమ దైవ గ్రంథమైన ఖుర్ఆన్ గ్రంథములో 42వ సూరా, 51వ ఆయత్‌లో చెప్పబడినది.

దేవుడు ఎవరితోనూ మాట్లాడక, తన విషయము చెప్పనప్పుడు, ఏ మనిషికీ దేవుని విషయము తెలియనప్పుడు, దేవుని విషయము మానవులకు తెలిసే అవకాశమే లేకుండా పోవును. అయితే నా విషయము నాకు తప్ప ఎవరికీ తెలియదని చెప్పిన దేవుడే భగవద్గీతయందు జ్ఞానయోగమను అధ్యాయములో 7,8వ శ్లోకములందు ఎప్పుడు నా విషయము భూమిమీద తెలియదో, అప్పుడు నేను వచ్చి నా జ్ఞానమును తెలియజేస్తానని చెప్పాడు. అంతేకాకుండా ఏ యుగములోగానీ నా ధర్మములు భూమిమీద తెలియకుండాపోతే, అప్పుడు వచ్చి తెలియజేస్తానని రెండు శ్లోకముల రూపములో చెప్పడము జరిగినది. భూమిమీద అనేక

ప్రాంతములలో మనుషులున్నారు. ఒక్కొక్క ప్రాంతములో ఒక్కొక్క భాష ఉండడము మనకు తెలిసిన విషయమే. ఏ భాష తెలిసిన మనుషులకు ఆ భాషలోనే మాట్లాడితే వారికి విషయము అర్థమవుతుంది. ఒక భాష తెలిసిన వానికి మరియొక భాషలో ఏమి చెప్పినా అతనికి అర్థముకాదు. అందువలన దేవుడు వచ్చి తన విషయమిది యని చెప్పదలుచుకున్నా, వినేవానికి తెలిసిన భాషలోనే చెప్పవలసియుండును. అంతేకాక వినేవాడు మనిషి అయినందున చెప్పేవాడు కూడా మనిషే అయివుండాలి. అలా కాకుండా దేవుడు ఏదో రూపములో వచ్చి ఏదో భాషలో చెప్పితే, మనిషికి ఏమీ తెలియకుండా పోవును. చెప్పిన విషయము అతనివరకూ చేరదు. అందువలన చెప్పేవాడు మనిషై ఉండాలి, చెప్పే భాష కూడా వినేవానికి తెలిసినదై ఉండాలి.

ఇదంతయు చూస్తే దేవుని జ్ఞానము దేవునికే తెలిసినా, ఏ మనిషి చెప్పలేకున్నా, దేవుడు దేవునిగా రాకుండా మనిషివలె మారువేషములో వచ్చి చెప్పిపోవచ్చును కదా! అలా చెప్పితే దేవుడు దేవునిగా ఎవరితోనూ నేరుగా మాట్లాడక మనిషి ఆకారములో మాట్లాడినట్లగును. అంతేకాక తన విషయము ఏ మనిషీ చెప్పలేడు గనుక తానే చెప్పినట్లగును. దేవుడు మారువేషములో మనిషివలె వస్తే ఆయన ధర్మమునకు ఎటువంటి భంగము కలుగకుండా తానే స్వయముగా చెప్పినట్లగును. తాను తానుగా చెప్పనన్నాడుగానీ, మనిషి వలె మారువేషములో కూడా చెప్పనని ఎక్కడా లేదు. ఖుర్ఆన్ గ్రంథములో మూడవ సూరా (ఆలీ ఇమ్రాన్‌లో) ఏడవ ఆయత్‌నందు **"శ్రద్ధ, బుద్ధి జ్ఞానముకలవాడు నా జ్ఞానమును గ్రహించు కుంటాడు"** అని చెప్పాడు. శ్రద్ధ వున్నవాడు గ్రహించుకుంటాడు అన్నప్పుడు దేవుడు ఏదో ఒక రూపములో తన జ్ఞానమును తానే తెలిపాడనేగా అర్థము.

దేవుని జ్ఞానము భూమిమీద మనుషులకు మూడు రకములుగా తెలియ జేయబడును అని ఖుర్‌ఆన్ గ్రంథములోనే 42వ సురా, 51వ ఆయత్‌నందు కలదు. అందులో ఒకటి శబ్ధము ద్వారా, రెండు తెర వెనుక నుండి చెప్పించడము, మూడు స్వయముగా దేవుని దూత ద్వారా చెప్పించడము అని కలదు. శబ్ధము ఆకాశము నుండి వస్తున్నది, అందువలన జ్ఞానము ఆకాశములోనుండి శబ్ధరూపములో వచ్చి చేరడము మొదటి రకము. మొదటి రకములో ఆకాశమునుండి వచ్చు శబ్ధము ఎవరినుండి వచ్చినదో ఎవరికీ తెలియదు. అయినా మనము శూన్యమునందు అణువణువున వ్యాపించి యున్న దైవశక్తి నుండి వచ్చినదని చెప్పవచ్చును. మొదటి రకము ఎవరికీ అర్థముకాని విషయము. రెండవది తెరవెనుకనుండి చెప్పించడము అని కలదు. తెరవెనుక అంటే కనిపించక ఉన్నవానిని తెరవెనుక ఉన్నట్లు చెప్పవచ్చును. కనిపించకుండ ఎవరు మాట్లాడి జ్ఞానమును చెప్పినా అది తెరవెనుకనుండి చెప్పినట్లగును. ఒకప్పుడు సూర్యుడు ఒక గ్రహమైయుండి సూక్ష్మముగా భూమిమీదికి వచ్చి కనిపించక ఇతరులనుండి మాట్లాడి జ్ఞానమును చెప్పడము జరిగినది. సూర్యుడు మనువునకు చెప్పినది తెరవెనుక నుండియే నని చెప్పవచ్చును. సృష్ట్యాదిలో జ్ఞానము వాణిద్వారా (శబ్ధము ద్వారా) సూర్యునికి తెలియబడగా, సూర్యుడు తనకు తెలిసిన జ్ఞానమును చాటునవుండి తాను స్వయముగా కనిపించక ఇతరుల శరీరమునుండి పలికి మనువునకు చెప్పడము జరిగినది. ఇట్లు రెండు రకములుగా ప్రపంచములోనికి దేవుని జ్ఞానము ప్రవేశించగా, తర్వాత మూడవ విధానమైన దూత ద్వారా కూడా భూమి మీదికి రావడము జరిగినది. దేవుడు మూడు విధముల తన జ్ఞానమును తెలియజేస్తానని చెప్పినా, ఆ విధానములను నేటికీ మనిషి గుర్తించ లేకపోయాడు. మొదటి విధానమును

గురించి ఏమాత్రము మనుషులకు తెలియకుండా పోయినది. ఇక రెండవ విధానము ఎటువంటిదో తెలియక దానినే మూడవ విధానముగా పోల్చుకొనుచున్నారు. ఇకపోతే దూత ద్వారా చెప్పించడము అను విధానమును పూర్తిగా తెలియక రెండవ దానినే మూడవ దానిగా చెప్పుకోవడము జరుగుచున్నది.

వివరముగా చెప్పుకొంటే దేవుడు ఏమాత్రము పని చేయనివానిగా ఉంటూ, తన జ్ఞానమును స్వయముగా తాను కాకుండ ఇతరుల చేత చెప్పించినట్లు తెలియజేశాడు. ఒక విధముగా తెలియజేసినది దేవుడే అయినా, ఈ మూడు విధానములలో దేవుడే చెప్పాడనుటకు వీలులేదు. అయినా లోతుగా ఆలోచిస్తే దేవుడు తప్ప ఎవరూ తెలియజేయుటకు అవకాశము లేదు. గ్రుడ్డిగా మాట్లాడితే ఒక విధము, దృష్టిగా మాట్లాడితే మరొక విధము. ఇదింతేనని ఎవరూ తేల్చి చెప్పలేరు. ఈ మూడు విధానములు మనుషులను ఎటువైపైనా తీసుకుపోవచ్చు, ఎవరికి అర్థమైనది వారికి సత్యముగా తోస్తుంది. అందువలన ఎవరి పట్టును వారు వదలక కొందరు దేవుడు రాడు అంటే, కొందరు దేవుడు వస్తాడు అంటున్నారు. మామాటే సత్యమని కొందరంటే కాదు మామాటే సత్యమని మరికొందరంటున్నారు. దేవుడు తనకిష్టమైన వారిని తనవైపు రప్పించుకొనుటకు అలా చేశాడని తెలియుచున్నది. ఆ మాటకొస్తే మేమే దేవునికి ఇష్టమైనవారమని కొందరంటూవుంటే, మరి కొందరు అందరికంటే మేమే దేవునికి దగ్గరగా ఉన్నామని చెప్పుకొంటున్నారు. ఇటువంటి సందర్భములో ఎవరు ఎక్కడ పొరబడుచున్నారో తేల్చి చెప్పవలసిన అవసరమున్నది. అటువంటి ప్రయత్నమును కొద్దిగా ప్రయత్నించి చూస్తాము.

దేవుడు చెప్పిన మూడు విధానములలో మొదటిది శబ్దము ద్వారా తెలియజేస్తాను అనునది, సృష్ట్యాదిలోనే జరిగిపోయినది. ఆకాశములో సూర్యునికి శబ్దము ద్వారా దేవుని జ్ఞానము సంపూర్ణముగా తెలియబడినది. ఈ విషయము భగవద్గీతలో జ్ఞానయోగము అను అధ్యాయమునందు మొదటి, రెండవ శ్లోకములలోనే కలదు చూడండి.

శ్లో॥ ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహ మవ్యయమ్ ।
వివస్వాన్ మనవే ప్రాహ మనురిక్ష్వాకవే బ్రవీత్ ॥

శ్లో॥ ఏవం పరంపరా ప్రాప్త మిమం రాజర్షయో విదుః ।
సకాలే నేహ మహతా యోగో నష్టః పరన్తప! ॥

భావము : " నేను చెప్పు యోగమునకు సంబంధించిన జ్ఞానము నాశనము లేనిది. అటువంటి జ్ఞానమును మొదట (సృష్ట్యాదిలో) నేను సూర్యునికి చెప్పియుంటిని. సూర్యుడు తనకు తెలిసిన జ్ఞానమును భూమిమీద మనువు అను మహర్షికి చెప్పగా, మనువు ఇక్ష్వాకుడు అను రాజుకు తెలియజేసెను. ఈ విధముగా ఒకరికొకరు తెలుసుకొనుట వలన రాజులు, ఋషులు, ప్రజలు అందరూ తెలుసుకొన్నారు. ఆ విధముగా అందరికీ తెలిసిన జ్ఞానము కాలక్రమమున నేడు ఎవరికీ తెలియకుండా పోయినది."

భగవద్గీతలో కృష్ణుడు చెప్పిన ఈ రెండు శ్లోకములలో, దేవుడు ఖుర్‌ఆన్ గ్రంథములో 42వ సూరా, 51వ ఆయత్‌నందు మీకు నా జ్ఞానమును మూడు విధముల తెలియజేస్తాను అనిన మాటలో మొదటి రెండు విధములు మొదటి శ్లోకములోనే కలవు. అందులో ఒకటి వహీ ద్వారా అనిన మాట, వహీ అనగా శబ్ధ సందేశమని అర్థము. సృష్ట్యాదిలో సూర్యునికి తెలియబడినది ఆకాశములోని శబ్దము ద్వారానే. సూర్యునివద్ద

కూడా ఆకాశము ఉండుట వలన ఆకాశములోని శబ్దమును సూర్యుడు సులభముగా వినగలిగాడు. సూర్యుడు ఒక గ్రహము, సూర్యుని శరీరము మండే అగ్నిగోళము. గ్రహించుకొనుశక్తి గలది గ్రహము, సూర్యుడు ఒక గ్రహము అయినందున శబ్దము ద్వారా వచ్చిన జ్ఞానమును సూర్యుడు వినగలిగాడు. సూర్యుడు గ్రహించుకొన్న దానిని భూమిమీదవున్న మనువు అను మహర్షికి తెలుపడము జరిగినది. సూర్యుడు సూక్ష్మముగా వచ్చి తాను కనిపించక ఇతరుల శరీరమునుండి మాట్లాడుచూ జ్ఞానమును మనువుకు తెలియజేయడమైనది. సూర్యునికి శబ్దము ద్వారా జ్ఞానము తెలియడమను విధానము దేవుడు తెలియజేయు మూడు విధానములలో మొదటిది కాగా, సూర్యుడు మనువుకు జ్ఞానమును ఇతరులనుండి చెప్పడము, దేవుడు తెలియజేసిన మూడు విధానములలో రెండవదైన తెరచాటునుండి తెలుపడమని గ్రహించవలెను. ఈ విధముగా రెండు విధానములు అమలు జరుగగా, కృష్ణుడు వచ్చి అర్జునునికి ప్రత్యక్షముగా చెప్పడము వలన దేవుడు చెప్పిన మూడవ విధానము కూడా నెరవేరినది. నా దూత ద్వారా జ్ఞానము తెలియజేస్తాను అను మూడవ విధానము కృష్ణుడు అర్జునునకు చెప్పడము వలన నెరవేరినది. సృష్ట్యాదిలో మొదటి విధానము జరుగగా, తర్వాత కొంత కాలమునకే రెండవ విధానము ద్వారా భూమిమీద దేవుని జ్ఞానము తెలియబడినది. తర్వాత మనకు తెలిసి ఐదువేల సంవత్సరముల పూర్వము మూడవ విధానము ద్వారా భగవద్గీత గ్రంథము బయటికి వచ్చినది. ఈ విధముగా మూడు పద్ధతులు గతములోనే నెరవేరాయని చెప్పవచ్చును.

గతములో మూడు పద్ధతులు జరిగిపోయాయి గదాయని ఇక జరుగ వనుటకు వీలులేదు. భవిష్యత్తులో కూడా జరుగవచ్చును. అయితే ఆకాశవాణి చెప్పడము ఒకమారే ఉంటుందనుకుంటాను. ఎందుకనగా

ఒకమారు శూన్యమునుండి చెప్పబడిన తర్వాత దానిని ఎన్నిమార్లయినా చెప్పవచ్చును. ప్రత్యక్షముగా కనిపించు దూతగాగానీ, లేక పరోక్షముగా కనిపించక తెరచాటునుండి (ఇతరుల నుండి) చెప్పు గ్రహముగా గానీ, దేవుని జ్ఞానము ఎన్నిమార్లయినా చెప్పుకోవచ్చును. అయితే ఆకాశవాణి ద్వారా చెప్పబడునది ఇతరుల ప్రమేయము లేకుండా వచ్చునది, కావున అది ఒకమారే చెప్పబడును. మనకు తెలిసినంతవరకు గతములో ఒకమారు ఆకాశవాణి చెప్పిన జ్ఞానము ఇంతవరకు రెండవమారు చెప్పలేదు. అట్లే సూర్యగ్రహము మొదట మనువుకు చెప్పిన తర్వాత ఇంతవరకు సూర్యుడు భూమిమీదికి వచ్చి ఎక్కడా చెప్పినట్లు కనిపించడములేదు. అయితే సూర్యగ్రహము తాను తెలుసుకొన్న జ్ఞానమును ఖగోళములోని మిగత అన్ని గ్రహములకు తెలియజేసినది. సూర్యుని వలన ఖగోళములోని ఎన్నో కోట్ల గ్రహములూ, అలాగే ఎన్నో కోట్ల భూతములు, ఉపభూతములు తెలుసు కోగలిగాయి. అలా దేవుని జ్ఞానము ఖగోళమంతా వ్యాపించి గ్రహములు భూతములందరూ తమను సృష్ఠించిన దేవున్ని గురించి తెలుసుకొన్నారు. అదే కోవలో జిబ్రయేల్ అను గ్రహము కూడా అందరినీ సృష్ఠించిన దేవుని జ్ఞానమును తెలుసుకొన్నాడు. సూర్యుడు మొదట వాణి ద్వారా తాను తెలుసుకొన్న జ్ఞానమును విశ్వవ్యాప్తముగా భూమిమీద మనువుకు, ఆకాశములో గ్రహములకు, తెలియజేయడము వలన సూర్యుడు ఆది గురువని పేరుగాంచాడు. జ్ఞానము చెప్పడములో మొదటివాడు గనుక సూర్యున్ని ఆదిత్యుడని అన్నారు. సూర్య గ్రహము భూమిమీద భారత దేశములో మనువు అను వ్యక్తికి జ్ఞానమును తెలియజేసినట్లు మిగత గ్రహములు కూడా దేవుని జ్ఞానమును ఒకరికొకరు చెప్పుకోవడము జరుగుచున్నది. అందువలన ఖగోళములోని గ్రహములు మొదలుకొని

భూతములలోని మేఘముల వరకు దేవుని జ్ఞానము తెలియబడి, దేవునిమీద భక్తికల్గి శ్రద్ధగా వారందరు దేవుని పరిపాలనలో భాగమై దేవుని సేవ చేయుచున్నారు.

భూమిమీద మనుషులు మాత్రము మనువు ద్వారా పరంపరగా వచ్చిన దైవజ్ఞానమును ద్వాపర యుగమునాటికి పూర్తిగా మరచిపోయి, దేవున్ని వదలి దేవతల భక్తిలో పడిపోయి, యజ్ఞయాగాదులు, వ్రతక్రతువులు, వేదపారాయణములు, తపస్సులలో మునిగిపోయారు. అటువంటి సందర్భములో దేవుని సమాచారమును తెచ్చిన దూతగా కృష్ణుడు అర్జునునకు దేవుని జ్ఞానమును బోధించాడు. అలా బోధించునప్పుడు సమయస్ఫూర్తిగా తాను చెప్పు జ్ఞానము మొదట సృష్ట్యాదిలోనే సూర్యునికి తెలియబరచబడిన జ్ఞానమని కృష్ణుడు చెప్పాడు. అలా చెప్పడము వలన ఒకే జ్ఞానము మొదట ఆకాశవాణి ద్వారా తెలియబడి, రెండవమారు తెరచాటునున్న గ్రహముల ద్వారా తెలియబడి, మూడవమారు ప్రత్యక్ష దూత ద్వారా తెలియబడినదని తెలిసినది. ఈ విధముగా దేవుడు నా జ్ఞానమును మూడు విధముల తెలియజేస్తానని చెప్పినమాట నెరవేరినది. కృష్ణుడు చెప్పిన జ్ఞానము సృష్ట్యాదిలో ఆకాశవాణి ద్వారా సూర్యునికి చెప్పబడిన మొదటి జ్ఞానమని తెలిసినది. అలా సృష్ట్యాదిలో చెప్పబడిన మొదటి జ్ఞానమును సూర్యుని ద్వారా తోటి గ్రహమైన జిబ్రయేల్ గ్రహము కూడా తెలుసు కోగల్గినది. సూర్యుడు భూమిమీద మనువు అనునతనికి తనకు తెలిసిన జ్ఞానమును బోధించినట్లు, జిబ్రయేల్ గ్రహము కూడా తనకు తెలిసిన జ్ఞానమును భూమిమీద ఒక మనిషికి బోధించడము జరిగినది. జిబ్రయేల్ గ్రహము ఎప్పుడు ఎవరికి తన జ్ఞానమును బోధించినది తర్వాత సందర్భాను సారముగా చెప్పగలను.

సూర్యుడు కృతయుగములో మనువుకు అందించిన జ్ఞానము ద్వాపరయుగ చివరిలో కృష్ణుడు అర్జుననకు చెప్పడము జరిగినది. అలా ద్వాపర యుగములో చెప్పిన జ్ఞానము వ్యాసుని ద్వారా ఇప్పటికి 5000 సం॥ పూర్వమే గ్రంథరూపమైనది. ఈ విధముగా దేవుని జ్ఞానము మొట్టమొదట గ్రంథముగా బయటకు వచ్చినది. అలా కృష్ణుడు చెప్పిన జ్ఞానము వ్యాసుని చేత రచించబడి గ్రంథమైనది. **ఆ గ్రంథము పేరే భగవద్గీత.** భగవద్గీత యొక్క జ్ఞానము సృష్ట్యాదిలోనే చెప్పబడిన జ్ఞానము అయినందునా మరియు భగవద్గీత భూమిమీద దేవుని జ్ఞానమును గూర్చి వ్రాయబడిన మొదటి గ్రంథమైన దానివలనా, దానిని **ప్రథమ దైవ గ్రంథమని** అంటున్నాము.

ఇక్కడ కొందరికి ఒక ప్రశ్న రావచ్చును. అదేమనగా! కృష్ణుడు చెప్పినపుడు దేవుని జ్ఞానము భూమిమీద ఎవరికీ తెలియకుండా పోయినది కదా! అప్పుడు ఎవరికీ తెలియని జ్ఞానమును కృష్ణుడెలా చెప్పాడు? కృష్ణుడు ఒక మనిషై నపుడు అతనికి దేవుని జ్ఞానమెలా తెలిసినది అని ప్రశ్న రావడములో తప్పు లేదు. దానికి జవాబును వెదకితే ఇలాగ కలదు. దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఇతర మానవులెవరికీ తెలియదని దేవుడు ఒకానొక తన గ్రంథములో చెప్పిన మాట వాస్తవమే. అటువంటపుడు మనిషి అయిన కృష్ణుడు దేవుని జ్ఞానమును ఎలా చెప్పగలడను ప్రశ్న రాక తప్పదు. దేవుడు తన దూత ద్వారా జ్ఞానమును చెప్పిస్తానని మూడు విధానములలో అదొక విధానమని చెప్పినా, కృష్ణుడు దేవుడు పంపిన దూతయని ఎక్కడా నిరూపించబడలేదు. ఒకవేళ కృష్ణుడు ఎక్కడైనా నేను దేవుని దూతనని చెప్పాడా? లేక దేవుడు పంపగా వచ్చిన వాడినని చెప్పాడా? అలా కూడా చెప్పలేదు. అలాంటపుడు సాధారణ మానవుడైన కృష్ణుడు దేవుని జ్ఞానమును

ఎలా చెప్పాడు అను ప్రశ్న నిలబడగలదు. ఈ ప్రశ్నకు జవాబుగా ఎవరైనా కృష్ణుని తరపున వాదించి లేదు కృష్ణుడు దేవుడు పంపిన దూతయేనని వాదించి, ఆయన దేవుని దూతయిన దానివలన దేవుని జ్ఞానమును చెప్పగలిగాడని చెప్పినా, భగవద్గీతలో కృష్ణుడు తాను దేవదూతనని చెప్పిన దాఖలాలేదు. అంతేకాక దేవుడు కృష్ణుడుగా వచ్చినవాడు నా దూతయని చెప్పిన వాక్యము కూడా లేదు. అయినా మేము కూడా ఎటూ దారిలేక దేవుని సమాచారమును తెచ్చిన దూతగా కృష్ణున్ని చెప్పాము. ఇటు కృష్ణుడు తనను దూతగా చెప్పకపోయినా, దేవుడు కూడా తన జ్ఞానమైన భగవద్గీతలో గానీ మరెక్కడగానీ కృష్ణున్ని దూతగా చెప్పకపోయినా, మీరెందుకు కృష్ణున్ని దూతగా చెప్పారని ఎవరైనా నన్ను కూడా ప్రశ్నించవచ్చును. దానికి జవాబు చెప్పవలసిన బాధ్యత నాకున్నది. తప్పనిసరిగా జవాబు చెప్పగలను.

భగవద్గీతలో కృష్ణుడు ఒకవైపు దేవుని జ్ఞానమును చెప్పుచూ, మరొక వైపు తానే దేవుడనని, తనను మించిన దేవుడు ఇంకొకడు లేడని ప్రకటించుకొన్నాడు. భగవద్గీతను కృష్ణుడు చెప్పినది దేవుని జ్ఞానమును చెప్పుటకా లేక తనను దేవుడని చెప్పుకొనుటకా అను ప్రశ్న కూడా రాగలదు. ఈ ప్రశ్నలన్నిటికీ జవాబును వెదుకుచూ పోతే ఒక దారి దొరుకుచున్నది. ఆ దారి ప్రకారము ఆలోచిస్తే ఇలా కలదు. దేవుడు తన దూత ద్వారా తన సమాచారమును తెలియజేస్తానని చెప్పడము వాస్తవమే అయినా, ఆయన తనవద్దనుండి దూతను పంపుటకు ఆయనవద్ద దూతలు ఎంతమంది ఉన్నారని మనము ఆలోచించవలసియున్నది. అలా ఆలోచిస్తే దేవునివద్ద దేవుడు కాక ఎవరూలేరు. ఇంకొక విధముగా చెప్పితే దేవున్ని చూచినవాడు ఎక్కడగానీ, ఎవడుగానీ లేడు. అటువంటప్పుడు దేవునివద్ద ఎవడైన దూత ఉన్నాడంటే వాడు దేవున్ని చూచును. దేవున్ని చూచినవాడు ఎవడూ

లేడన్నప్పుడు దేవునివద్ద ఎవడూ లేడనియే చెప్పవచ్చును. ఎవడైనా జ్ఞానము తెలిసి, కర్మను లేకుండా చేసుకొని దేవునివద్దకు పోయివుండవచ్చును కదా! అని అంటే, అటువంటివాడు దేవునివద్దకు పోవుట నిజమేగానీ, దేవునివద్దకు పోయినవాడు దేవునివద్ద సేవకునిగానో, దూతగానో ప్రక్కన ఉండక దేవునిలోనికి ఐక్యమైపోవును. దేవునివద్దకు పోయిన వాడెవడైనా ఆయనలోనికి చేరి ఆయనలో కలిసిపోవడము తప్ప ప్రక్కన ఉండడమంటూ ఉండదు. దానివలన దేవుని సమాచారమును తీసుకొని వచ్చు దూత ఎవడూ లేడనియే చెప్పవచ్చును. అటువంటపుడు దేవుడు తనదూత ద్వారా తన జ్ఞానమును తెలియునట్లు చేస్తానని చెప్పినమాట ఏమగునని, దేవుని మాట అసత్యమా అని ఎవరైనా అడుగవచ్చును. దానికి జవాబు ఏమనగా! దేవుని మాట ఎప్పటికీ అసత్యముకాదు. దేవుడు ఏమి చెప్పినా అది తప్పక నెరవేరితీరును. ఇక్కడ మనము అర్థము చేసుకోవడములో ఏదైనా లోపము ఉందేమోనని చూచుకోవలసియున్నది. ఆయన మాట నెరవేరుటకు ఏదైన నిగూఢ భావమున్నదేమో చూచుకొందాము. దేవుడు సృష్ఠి పూర్వము ఉన్నట్లు కాకుండా సృష్ఠి తర్వాత రూప, నామ, క్రియారహితునిగా ఉన్నాడనుట మనము మరువకూడదు. దేవుడు స్వయముగా నేరుగా ఎవరితోనూ మాట్లాడడు. అందువలన తన జ్ఞానమును తన దూతద్వారా తెలియజేస్తా నన్నాడు. ఉన్నది ఒకే దేవుడై ఎవరూ దూతలు లేనప్పుడు ఆయన ఆయనగా (దేవుడు దేవునిగా) కాకుండ మారువేషములో వచ్చి చెప్పడము వలన తన జ్ఞానము ప్రజలకు తెలియుచున్నది. దేవుడు దేవునిగాగాక ఒక మనిషివలె వచ్చుచున్నాడు కాబట్టి దేవుడు స్వయముగా చెప్పినట్లు కూడా కాదు. ఇక్కడ మరియొక మాటను గుర్తుచేసుకొంటే ఏ మనిషీ దేవుని జ్ఞానము చెప్పలేడు, ఏ మనిషికీ దేవుని జ్ఞానము తెలియదు.

కనుక చెప్పినవాడు దేవుడేననీ, దీనినిబట్టి దేవుడు పని చేసినట్లే కదాయని ఎవరైనా అడిగితే, దేవుడు పని చేయడు అని చెప్పుటకు వచ్చి చెప్పినవాడు దేవుడుకాడు మనిషియనీ, అట్లని మనిషికి దేవుని జ్ఞానము తెలియదను సూత్రముండుట వలన వచ్చిన వాడు మనిషివలె ఉన్నా అతను అందరివలె మనిషీకాదు, అట్లని దేవుడూ కాదు, మనిషి రూపములోనున్న భగవంతుడని చెప్పవచ్చును. భగవంతుడనగా ఇటు మనిషీకాడు, అటు దేవుడూ కాడు. మనిషి కంటే ఎక్కువవాడు, దేవునికంటే తక్కువ వాడు భగవంతుడు.

దేవుడు దేవుడుగా కాకుండా మనిషివలె మారువేషములో వస్తే అతనిని అప్పుడు భగవంతుడు అనాలి. భగవంతుడు సాధారణ మనిషివలె ఉండుట వలన ఆయనను దేవుని అవతారముగా ఎవరూ గుర్తించలేరు. భగవంతుడు దేవునికి మారుగా వచ్చినవాడైనందున, ఇతరులు దేవుడని గుర్తించుటకు వీలులేకుండా మానవునివలె వచ్చి, భగవంతుడని కూడా ఎవరికీ తెలియకుండా ఉండువాడు దేవుడే అయినందున, దేవుని జ్ఞానము దేవునికే తెలుసు అను సూత్రము ప్రకారము, దేవుని జ్ఞానము మనిషివలెనున్న భగవంతునికి సంపూర్ణముగా తెలిసియుండును. అందువలన భగవంతుడైన మనిషి సంపూర్ణముగా బోధించగల్గును. భగవంతుడైన మనిషే దేవుడని నా మాటకు సాక్ష్యముగా, భగవద్గీతను చెప్పిన మనిషిగా కనిపించు కృష్ణుడు **"నేనే దేవున్ని నన్నుమించిన దేవుడు లేడని"** భగవద్గీతలో చెప్పడము జరిగినది. తనదూతతో జ్ఞానమును తెలియజేయుదునని దేవుడు ఒకచోట చెప్పినా, తనవద్ద తానుతప్ప మరొకడు ఎవడూ లేనందున తానే దూతగా వస్తున్నాడని మనము తెలియవలసియున్నది. మనుషులను మభ్యపెట్టుటకు తనను దూతగా చెప్పుకొన్న దేవుడు దూతగాయున్న మనిషిని ఎవరూ గుర్తించనట్లు చేశాడు. దూత లేక భగవంతుడని చెప్పబడువాడు ఎప్పుడు

భూమిమీదికి వస్తున్నా, వచ్చినా, వచ్చిపోయినా కూడా ఎవరికీ తెలియకుండా దేవుడు చేయగలడు. ఇతను దేవుడని ఎటువంటి వానిచేత కూడా భగవంతుడైన మనిషి గుర్తింపబడనట్లు దేవుడు అమర్చిపెట్టియుండును. ఒకవేళ ఎవడైనా నేను మనిషి ఆకారములో నున్న భగవంతున్ని గుర్తించానని అనగలిగితే, అటువంటి వానిచేతనే ఇతను భగవంతుడుకాడు, ఇతనికి జ్ఞానము తెలియదని అనునట్లు దేవుడు తన మాయ చేత చేయగలడు.

మనిషివలెనున్న దేవుడు భగవంతునిగా భూమిమీదికి ఎన్నోమార్లు వచ్చాడు. అయినా ఆయనను ఎవరూ గుర్తించి ఈయన ఫలానా అని చెప్పలేకపోయారు. ఎవడైనా అరుదుగా గుర్తించినా అతనిమాటను ఎవరూ నమ్మలేకపోవడమేకాక, అతనిని హేళనగా బుద్ధి తక్కువవానిగా పోల్చి మాట్లాడుదురు. ఎక్కడైనా ఎవరికైనా ఇతను మనిషి ఆకారములోనున్న భగవంతుడని కొంత గుర్తింపువచ్చినా వారి నమ్మకము వమ్మగునట్లు మాయ చేయగలదు. మనుషులను మోసగించుటకు మాయ అను గుణముల శక్తిని దేవుడు ఉపయోగించుకొని, అతని గుణముల చేతనే అతను భగవంతుడనిన వానిని భగవంతుడు కాదనిపించును. దేవుడు భూమిమీద మూడు విధముల తన జ్ఞానమును తెలియజేసినప్పుడు, మొదటిది శబ్ధము ద్వారా చెప్పుట వలన, చెప్పినవారు ఎవరు అని చూడవలసిన పని లేకుండా పోయినది. ఇక రెండవ విధానములో తెరచాటునుండి చెప్పడము వలన మనుషులకు దేవుని జ్ఞానము తెలియబడినప్పటికీ, చాటునయుండి చెప్పునది గ్రహము అని తెలిసిపోయినది. గ్రహము దేవుడుకాడు కావున అక్కడ కూడా దేవుడు తెలియబడడు. తర్వాత మూడవ విధానములో ప్రత్యక్షముగా మారువేషములో భగవంతునిగానున్న మనిషి చెప్పినప్పుడు తెలివైనవాడు భగవంతున్ని గుర్తించుటకు వీలుకలదు. అయినా ఎవరికీ తెలియనట్లు దేవుడు చేయును.

దేవుడు ప్రస్తుత కాలములో ఏ పనిని చేయకున్నా అన్ని పనులు చేయునట్లు ముఖ్యముగా మాయను నియమించుకొన్నాడు. తర్వాత తన పరిపాలన సాగుటకు పాలనా వ్యవస్థను ఏర్పరచుకొన్నాడు. పాలనా వ్యవస్థలో గ్రహములు భూతములు ఎంతో శ్రద్ధగా పని చేయుచున్నవి. శరీరము బయటగల తన పాలనా వ్యవస్థను ఉపయోగించుకొనిగానీ, లేక శరీరములోపలగల గుణములను (మాయను) ఉపయోగించుకొనిగానీ, తాను దేవుడైయుండి జ్ఞానమును తెలియజేయు నిమిత్తము మనిషివలె వచ్చినప్పుడు తనను ఎవరూ గుర్తించనట్లు చేసుకొనును. భూమిమీద భగవంతుడుకాని వారందరూ భగవాన్ అని పేరుపెట్టుకొనినా, అసలైన భగవంతుడు మాత్రము ఆ పేరు పెట్టుకోడు, భగవంతునివలె ఏమాత్రము కనిపించడు. నిజమైన భగవంతుడు భూమిమీదకు వచ్చి మనుషులకు ప్రత్యక్షముగా జ్ఞానము చెప్పునప్పుడు చెప్పే జ్ఞానమునుబట్టి, జ్ఞానము యొక్క ప్రత్యేకతనుబట్టి భగవంతున్ని గుర్తించుటకు అవకాశమున్నా, ఎప్పుడో ఒకప్పుడు తాను చెప్పునది నమ్మనట్లు చేయుచూ, కొందరిని తన జ్ఞానమునకు దూరముగా ఉంచి, పూర్తి విశ్వాసమున్న వారిని మాత్రము తన జ్ఞానమును విశ్వసించునట్లు చేయును. తన జ్ఞానమునకు ఎవరు అర్హులో వారికి మాత్రమే తన జ్ఞానము మీద నమ్మకము కల్గునట్లు చేసి, అర్హులు కానివారిని తన జ్ఞానమునకు దూరముగా ఉంచును. చెప్పేది గొప్ప జ్ఞానమైనప్పుడు కొందరు నమ్మడము, కొందరు నమ్మకపోవడము ఎలా జరుగును? కొందరికి మాత్రము మాయ ఎలా పని చేయును? కొందరు దూరముగాపోవుటకు మాయ కార్యాచరణ ఎలాగుండును? అని కొందరడుగవచ్చును. దానికి సమాధానముగా నావద్ద జరిగిన ఒక సంఘటనను వివరిస్తాను చూడండి. నేను ఎంతో పెద్ద జ్ఞాన రహస్యములను చెప్పి అందరినీ ఆకట్టుకోవాలని

చూచినా, కొందరు మాత్రము నా జ్ఞానమును నమ్మకుండా పోవునట్లు మాయ చేసినది. నేను ఇంతవరకు ఎంతో గొప్ప జ్ఞానమును చెప్పినా నేను ఒకమారు పొరపాటుగానో, అదేపనిగానో చెప్పిన జ్ఞానమును చూచి అది అసత్యమని తెలిసిన కొందరు వంద సత్యమైన విషయములను కూడా వదలి అవన్నియు ఇలాగే అసత్యమై ఉండునను భావముతో వారు నా నుండి దూరముగా పోవడమేకాక నాదంతయు అసత్య జ్ఞానమని ప్రచారము చేయుచూ మిగతా వారిని కూడా జ్ఞానమునకు దూరము చేశారు.

గతములో ఇంతవరకు ఎవరూ చెప్పని జ్ఞానమును చెప్పి, నా జ్ఞానము మేటి జ్ఞానమనిపించుకొనునట్లు చేశాను. **గర్భస్థ శిశువుకు ప్రాణము లేదు, శిశువు పుట్టిన తర్వాతే ప్రాణమొస్తుందను** సంచలనాత్మక విషయమును తెలియజేశాను. అంతేకాక భౌతికశాస్త్రవేత్తలు ఎవరూ చెప్పకనే **పురుష వీర్యకణము లేకుండా, పురుష సంపర్కము లేకుండా స్త్రీలు గర్భము దాల్చుదురను** విషయము కూడా తెలియజేశాము. ఇంకనూ **మనుషులు పొందే మరణములు మూడు విధములని** మరణ రహస్యమును తెలియజేశాము. **పునర్జన్మలో కొందరికి మాత్రము ఎందుకు జ్ఞాపకము వస్తుందో ఎలా వస్తుందో** వివరముగా పునర్జన్మ రహస్యమును చెప్పాము. ఇలా శరీరములోపలి విషయములను ఎన్నిటినో చెప్పిన తర్వాత కూడా వాటికి ఎవరూ స్పందించకపోవడము చూచి, ఇవన్నియూ చాలా గొప్ప రహస్యములని గుర్తించని మనుషులను చూచి ఒకమారు అదేపనిగా శరీరము లోపల స్థూలముగా కనిపించు అవయవములను రెండింటిని జాగామార్చి చెప్పడము జరిగినది. గుణముల వివరమును చెప్పుచూ 1) కామ 2) క్రోధ 3) లోభ 4) మోహ 5) మధ 6) మత్సర అను గుణములలో పురుషులకు 1) కామ 3) లోభ 5) మదము అను మూడు

బేసి సంఖ్య గుణములు ఎక్కువగా ఉండుననీ, అలాగే స్త్రీలకు 2) క్రోధ 4) మోహ 6) మత్సర (అసూయ) అనబడు సరిసంఖ్య గుణములు ఎక్కువగా ఉండునని సత్యమైన జ్ఞానమును బోధించుచూ దానికి సంబంధములేని అసత్యమును జోడించి చెప్పడము జరిగినది. ఆ అసత్యమేమనగా! పురుష శరీరములో ఎడమ ప్రక్కనగల జీర్ణాశయము, స్త్రీలలో కుడిప్రక్కన ఉంటుందనీ, పురుషులలో కుడిప్రక్కనగల కాలేయము (లివర్), స్త్రీలలో ఎడమ ప్రక్కన ఉంటుందని అలా ఉండుట చేత పురుషులలో ఎక్కువగా పనిచేయు గుణములు స్త్రీలలో తక్కువగా పని చేయుననీ, పురుషులలో తక్కువగా పని చేయు గుణములు స్త్రీలలో ఎక్కువగా పని చేయునని చెప్పడము జరిగినది. అలా చెప్పినపుడు శరీర అంతర్గత అవయవముల విషయములు తెలియని వారు చెప్పిన విషయమును నమ్మడము జరిగినది. శరీరములో అవయవ నిర్మాణము తెలిసిన వారందరికీ చెప్పిన విషయము అసత్యమని వెంటనే తెలిసిపోయినది. అక్కడ చెప్పినది గుణముల ప్రభావము స్త్రీ పురుషుల మీద ఎలా ఉన్నదను విషయము. కనిపించని గుణములకు కనిపించే అవయవములకు ఏమాత్రము సంబంధము లేకున్నా అనవసర సంబంధము పెట్టి చెప్పిన అసత్య విషయమునకు చాలామంది స్పందించి అసత్య జ్ఞానమునకు దూరముగా ఉండవలెనని అప్పటినుండి వారు నా జ్ఞానమునకు దూరముగా పోవడము జరిగినది.

గతములో ఎన్నో రహస్య జ్ఞాన విషయములను, పూర్తి సత్య విషయములను చెప్పినా, వాటికి స్పందించక వాటిని సర్వసాధారణ విషయములుగా తలచినవారు, ఇప్పుడు మాత్రము సంబంధములేని విషయమును సాకుగా పెట్టుకొని జ్ఞానమునకు దూరము కావడము జరిగినది. అట్లని చెప్పిన గుణముల విషయము ఏమాత్రము అసత్యము

కాక, పూర్తి సత్యమైయున్నది. అసలైన జ్ఞానమును గుర్తించని వారు సంబంధములేని పోలికను చెప్పుచూ అసత్యము చెప్పితే, అది ప్రాముఖ్యము కాకున్నా, ప్రాముఖ్యమైన గుణ ప్రభావముల జ్ఞానమును వదలి ప్రాముఖ్యము గాని విషయముతో జ్ఞానమునకు దూరము కావడము చూచిన తర్వాత దేవుని విషయములో కూడా మాయ ఇలాగే చేయునని తెలియుచున్నది. నేను చెప్పినది సరి బేసి గుణములనూ, స్త్రీ పురుషుల మీద వాటి ప్రభావము. చెప్పిన జ్ఞానము నూటికి నూరుపాళ్ళు సత్యమే, అయినా సంబంధము లేని దాని పోలిక అసత్యమైన దానివలన దానిని చూచి సత్యమైన జ్ఞానమును కూడా వదులుకొన్నారు. గర్భాశయమును గురించి సంపూర్ణముగా తెలిసిన వానికి జీర్ణాశయమును గురించి తెలియకుండునా! అని ఏమాత్రము ఆలోచించలేదు. మరణములో కనిపించని మనస్సు యొక్క స్థితి గతులు చెప్పిన వానికి శరీరములో కనిపించే అవయవ విషయము తెలియకుండునా అని ఏమాత్రము అవిశ్వాసులు ఆలోచించలేదు.

చెప్పిన తప్పును కప్పిపుచ్చుకొనుటకు ఇలా వ్రాశాడని రేపు కొందరు నన్ను అనకమానరు. అందువలన నాకు సత్యము తెలుసో, అసత్యము తెలుసో మీకే అర్థమగునట్లు స్త్రీ పురుషుల మీద గుణ ప్రభావము సత్యమను టకు కొంత వివరమును చెప్పుచున్నాను చూడండి. పూర్వము జ్యోతిష్య శాస్త్రము ప్రకారము గర్భిణీ స్త్రీకి పుట్టబోవు శిశువు ఆడశిశువా లేక మగ శిశువా అని తెలియుటకు జ్యోతిష్య సూత్రమును అనుసరించి ఒక పద్యము గలదు. ఆ పద్యములో చెప్పిన గణితము ప్రకారము లెక్కించి పుట్టబోవు శిశువును గురించి చెప్పెడివారట. ఆ పద్యము ఇలా వుంది చూడండి.

తరుణీ నామాక్షరములు స్థిరముగ
నేడింట పెంచి తిథి గల్పి
నవభాగము చేయ సరికూతురు
బేసి కొడుకు చెయ్యాన తెలుసున్ !

ఈ పద్యములోని భావము ప్రకారము చూస్తే తరుణి అనగా గర్భిణీ స్త్రీ అని అర్థము. నామాక్షరములు స్థిరముగా నేడింట పెంచి అనగా స్త్రీయొక్క పేరులోని అక్షరములను ఏడుతో హెచ్చించి అని అర్థము. హెచ్చించగా వచ్చిన సంఖ్యకు ఆ దినము యొక్క తిథిని కల్పి, వచ్చిన మొత్తమును తొమ్మిదితో భాగించగా వచ్చిన శేషము సరిసంఖ్య అయితే కూతురు పుట్టుననీ, ఒకవేళ వచ్చిన సంఖ్య బేసి సంఖ్య అయితే కొడుకు పుట్టుననీ చెప్పవచ్చునని పద్యములో గలదు. ఈ పద్యమును బాగా పరిశీలించి చూచితే వచ్చిన శేషము సరి అయితే కూతురు, బేసి అయితే కొడుకు అని చెప్పడము విశేషము. ఇప్పుడు అసలు విషయానికి వచ్చి చూస్తే మన తలయందుగల గుణచక్రములోని గుణములు మంచిగుణములు ఆరు, చెడు గుణములు ఆరు గలవు. చెడు గుణములను జీవునకు శత్రువులని భావించి వాటి ఆరును శత్రువర్గము అని అన్నారు. అరిషట్ వర్గము అను పేరుతో శత్రు గుంపు గుణములను అంటున్నారు. అలాగే మిత్రవర్గము గుణములు కూడా ఆరు కలవు. ముందు శత్రు వర్గములోని గుణములను తీసుకొని చూస్తే ఆరు గుణములలో వరుసగా మూడు బేసి సంఖ్య కల్గియున్నవి, మూడు సరి సంఖ్య కల్గియున్నవి. అలాగే మంచి గుణములైన మిత్రవర్గము ఆరు గుణములలో కూడా వరుసగా మూడు బేసి, మూడు సరిసంఖ్యకల్గిన గుణములు కలవు. ఇదంత ఎందుకు చెప్పుచున్నామనగా! జ్యోతిష్యమునకు సంబంధించిన పద్యమును ఇప్పుడు చెప్పుకొన్నాము కదా! ఆ పద్యములో

కూడా సరి బేసి అను పదములు కలవు. ఇప్పుడు గుణములలో కూడా సరి బేసి గుణములను చెప్పుకొన్నాము. ఇకపోతే స్త్రీ గర్భము ధరించినప్పుడు గర్భాశయములో స్త్రీ అండముతో పురుషుని క్రోమోజోములు (XY) అనునవి బేసి సంఖ్యతో కలిస్తే పురుషుడు, సరి సంఖ్యతో కలిస్తే స్త్రీ పుట్టును. వివరముగా చెప్పుకొంటే యక్స్ (X) అను క్రోమోజోము బేసి అనుకోండి, వై (Y) అనునది సరి సంఖ్య అనుకోండి. దీనిప్రకారము స్త్రీ అండముతో బేసి అయిన యక్స్ (X) కలుసుకొంటే పురుష శిశువూ, వై (Y) అను సరిసంఖ్య కలుసుకొంటే ఆడ శిశువు గర్భములో తయారు కాగలదు. ఈ సూత్రమును అనుసరించి జ్యోతిష్యములో పద్యమును తయారు చేశారేమో అనిపిస్తుంది.

ఇప్పుడు పూర్వము పెద్దలు చెప్పిన జ్యోతిష్యము ప్రకారమున్న పద్యమును చూస్తే అందులో శేషము సరి బేసిని అనుసరించి ఆడ మగ అని చెప్పడమూ, భౌతికశాస్త్రము ప్రకారము పురుష వీర్యములోని యక్స్, వై (XY) క్రోమోజోములను అనుసరించి పురుష లేక స్త్రీ శిశువు జననము జరుగుతుందని చెప్పడమూ, మనిషి తలలోగల గుణముల బేసి, సరి సంఖ్యను బట్టి స్త్రీ పురుషులలో భావములున్నవని ఇప్పుడు మేము చెప్పడమును బట్టి అన్ని ఆధారములు ఒక్కదారిలోనికి వస్తున్నవి. శరీరములో స్థూలముగా యున్న అవయవములకు గుణములకు ఎటువంటి సంబంధము లేదు. అందువలన జీర్ణాశయము, కాలేయము యొక్క స్థానమునుబట్టి స్త్రీ పురుషులకు గుణభావములో తేడాలున్నవని ఒక్కమాట చెప్పాముగానీ వాటికి సరి బేసి గుణములకు ఎటువంటి సంబంధమును మేము చూపలేదు. అవయవములకు గుణములకు సంబంధములేదని నాకు తెలిసినా, ఆత్మ అదే పనిగా పలికించినది. అలా చేయడము వలన కొందరికి అపనమ్మకము

కలిగించి, తన జ్ఞానమునుండి దూరము చేయడమే ఆత్మ ఉద్దేశ్యమను కొంటాను. అలా అసత్యమును చెప్పడము వలన నన్ను తప్పు సమాచారమును అందించాడని చాలామంది అనుకోవడము జరిగినది. అయితే నేను గతములో రెండు మూడు నెలల క్రితమే ఒక మాట చెప్పాను. ఇక్కడ చెప్పేవన్ని నిజమని నమ్మవద్దండి అని చెప్పడము జరిగినది. కొన్ని మాటలు అబద్ధముగా చెప్పినవను సంశయముండుట వలన అలా చెప్పాము. అంతేకాక చాలామార్లు నేను జీవున్ని, నాకు ఏమీ తెలియదు. శరీరములో అధిపతియైన ఆత్మ ఆడించేకొద్దీ కదులుతాను, పలికించేకొద్దీ మాట్లాడుతాను, ఇక్కడ వచ్చు కీర్తి అపకీర్తులన్నీ ఆత్మకే చెందుతాయని కూడా చెప్పాము.

చెప్పే జ్ఞానము గొప్పది. జ్ఞానమును చెప్పడములో ఆత్మ అసత్యముగా ఎప్పుడూ చెప్పలేదు. ఒక లెక్కలో చెప్పాలంటే ఇక్కడ ఆత్మ అందించు జ్ఞానము ప్రపంచములో ఎవరూ అందించలేనిదని చెప్పగలను. పోయిన నెల సమావేశములో కూడా స్త్రీ పురుషులలో గుణ భావములు ఎక్కువ తక్కువలున్నాయనీ, ఫలానా గుణములే స్త్రీలలో ఎక్కువనీ, ఫలానా గుణములే పురుషులలో ఎక్కువని చెప్పడము గొప్ప సంచలనాత్మక జ్ఞానమే. ఇంతవరకు ఏ ఋషులు, మహర్షులు చెప్పని విషయమును అన్నీ తెలిసిన ఆత్మ తప్ప ఎవరూ చెప్పలేరనియే చెప్పవచ్చును. గతములో మూడు మూల గ్రంథములలో కూడా చెప్పని జ్ఞాన విషయములను ఆత్మ అందించినది. అంత పెద్ద రహస్యములను చెప్పిన ఆత్మకు, శరీరములకు అధిపతిగాయున్న ఆత్మకు, శరీరములో అంతటా వ్యాపించిన ఆత్మకు శరీరములోని అవయవముల విషయము తెలియదా! తెలిసి అబద్ధముగా చెప్పుచున్నదంటే అందులో ఏదో తిరకాసు ఉందని ఊహించవచ్చును. మా ఊహ ప్రకారము శ్రద్ధలేని వారందరినీ ఆత్మ అదే పనిగా ప్రక్కకు త్రోయుటకే అలా చేసిందని అర్థమైనది.

పైన కనిపించుటకు ఒక వ్యక్తి మాట్లాడినా అతని ద్వారా మాట్లాడునది ఆత్మేనని చాలామార్లు నేను చెప్పాను. ఒక వ్యక్తిగా (జీవునిగా) **"గుత్తా"** గ్రంథములో నన్ను గురించి నేను చెప్పుకోవడము జరిగినది. నేను ఈ దినము చెప్పు జ్ఞానము ఎక్కడా నేర్చుకోలేదని, నేర్చుకొనే అవకాశము నా జీవితములో రాలేదనీ చెప్పాము. అటువంటి నేను దేశములోని గురువులు, స్వామీజీలు మొదలగు వారు ఇంతవరకు చెప్పని విధముగా భగవద్గీతను చెప్పడము మనిషిగా నేను చేసిన పనికాదనీ, స్వయముగా ఆత్మే అలా చేసినదని చాలామార్లు చెప్పాను. నా దగ్గరకు వచ్చినవారు భయంకర రోగములనుండి బయటపడినప్పుడు వారు వచ్చి నన్ను పొగిడితే అప్పుడు కూడా అదేదో నా వలన జరుగలేదు. ఆత్మ వలన జరిగినదని చెప్పాము. ఇక్కడికి వచ్చి జ్ఞానము తెలుసుకొన్న వారికి ఏ మందులూ లేకుండా రోగములు పోయిన వారు చాలామందియున్నారు. వారందరికీ ఆత్మే కారణమనీ, ఏమి చేసినా ఆత్మే చేయునని చెప్పాము. అటువంటి ఆత్మ ఎవరిని జ్ఞానమునకు దగ్గర చేర్చాలో, ఎవరిని జ్ఞానమునకు దూరము చేయాలో నిర్ణయించుకొని చేయగలదు. ప్రపంచములో ఇటు జీవుడుగానీ అటు దేవుడుగానీ ఏమీ చేయలేరు. చేసేదంతా ఆత్మేనని, అన్నీ చేయు ఆత్మ ఇంతవరకు ఎక్కడా ఆత్మ ఇటువంటిదని బయటపడలేదని చెప్పినది ఇక్కడే. ఆత్మను గురించిన సమాచారము ఇంతవరకు ఇక్కడ తప్ప ఎక్కడా బయటపడలేదని కొందరికి తెలుసు. భూమిమీద చాలామందికి ఆత్మ చేయు పనులు తెలియక, ఆత్మ ఆడించుచున్నదనీ, ఆత్మ నడిపించు చున్నదనీ, ఆత్మ పాడించుచున్నదనీ, ఆత్మ మాట్లాడించుచున్నదనీ తెలియక శరీరములో ఆత్మ అన్నిటిగా నటించుచున్నదని గ్రహించలేకపోయారు. అందువలన కనిపించు శరీరము ద్వారా జరుగు పనులకు జీవున్నయిన

నన్ను బాధ్యున్ని చేయుచున్నారు. నిజానికి నేను ఏ దానికీ బాధ్యున్నికానని నాకు బాగా తెలుసు. అందువలన నాకు పాపమురాదు, పుణ్యమురాదు.

పోయిన సమావేశములో గుణముల తారతమ్యము స్త్రీ పురుషుల ఎడల ఎట్లున్నదో చెప్పడము పెద్ద రహస్యము. చెప్పిన జ్ఞానము గొప్పదైనా దానికి సంబంధములేని అసత్యమును చెప్పడము వలన కొందరు జ్ఞానములో నష్టపోయారు. కొందరు లాభపడినారు. ఆత్మ మీద నమ్మకము ఉన్నవారు లాభపడినారు, నమ్మకములేనివారు నష్టపోయారు. ఈ విధముగా ఆత్మ చేయడములో ఒక ఉద్దేశ్యముందని చెప్పగలను. భగవద్గీతను ప్రథమ దైవ గ్రంథముగా తెలియజేసి, ప్రపంచములోని అన్ని మతముల మనుషులను తనవైపు ఆకర్షించుకొని, అందరినీ ఒకే దైవమార్గములో నడుపవలెనను భావముతోనే నేను పథకము ప్రకారము జ్ఞానమును బోధించుచున్నది. సృష్ట్యాదినుండి ఆత్మ యొక్క పాత్ర బయటపడకుండ చేసుకొన్నదీ ఆత్మే, ఇప్పుడు ఇక్కడ ఈ జ్ఞానము ద్వారా బయట పడి తన విషయము అందరికీ తెలియునట్లు చేయునదీ ఆత్మే. ప్రపంచములో ఇంతవరకు తెలియనిదీ, అంతుచిక్కనిదీ, అర్థముకానిదీ ఆత్మే. ఆత్మ మనిషిని ఆడించుచూ వానివాని శ్రద్ధనుబట్టి మనిషిని దేవునివైపుగానీ, మాయవైపుగానీ నడిపించును. ఉన్న వాస్తవమును చెప్పితే ఆత్మ మనిషిని దైవమువైపుకుగానీ, మాయవైపుకు గానీ నడుపుటకు అవసరమునుబట్టి అసత్యమూ చెప్పుచున్నది, అలాగే మోసమూ చేయుచున్నది. జ్ఞానములేని కొందరు బాబాలవద్ద మహత్యము లను కల్పించి, ప్రజలను మహత్యములకు ఆకర్షింపబడునట్లు చేసి, వారిని గొప్పగనమ్మి వారినే దేవునిగా లెక్కించుకొని, జ్ఞానములేని జీవితమును గడుపునట్లు ఆత్మ చేయుచున్నది. మనిషి శ్రద్ధనుబట్టి బాబాలను నిజ దైవముగా భావించునట్లు చేయుచున్నది. అలాగే కొందరిని బాబాలవైపు

పోకుండా చేసి స్వచ్ఛమైన దైవజ్ఞానమువైపు పోవునట్లు చేయుచున్నది. కొందరిని ఎటూ కాకుండా కేవలము ప్రపంచ విషయములలోనే మునిగి ఉండునట్లు చేయుచున్నది. అన్నిటికీ ఆధారమైన ఆత్మ అందరి శరీరములలో ఉండి, అన్ని శరీరములను నడుపుచూ, అన్ని శరీరములకు యజమానిగా ఉంటూ, ఏమీ తెలియని సాధారణ మనిషి చేత ఉన్నతమైన జ్ఞానమును చెప్పించుచున్నది. అలాగే ఏమీ తెలియని సాధారణ మనిషి చేత వానికి తెలియకున్నా, అతని చేత అనేక అద్భుత మహత్యములను చేయించి, అతనినే గొప్పవానిగా కనిపించే దేవునిగా లెక్కించునట్లు చేయుచున్నది. అలా ఆత్మ అదే పనిగా చేయడము ఎందుకు అని ప్రశ్నవస్తే, మనుషులలోని భావమును బట్టి ఆత్మ అలా చేయుచున్నదని చెప్పవచ్చును.

దేవుని మీద శ్రద్ధ భక్తియున్న మనుషులకు ఆత్మ అసలైన జ్ఞానమును అందించుచున్నది. భగవద్గీత రాజవిద్యా రాజగుహ్య యోగములో 22వ శ్లోకము ప్రకారము అన్ని విధముల యోగమార్గమున ఆటంకము లేకుండా చేయుచున్నది.

శ్లో॥ *అనన్యాశ్చిన్త యంతో మాం యే జనాః పర్యుపాసతే ।*
*తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥*

భావము :- “ఇతర దేవతల ధ్యాస లేకుండా ఎల్లప్పుడు సృష్ఠికర్తయిన పరమాత్మ మీద భక్తికల్గి పురుషోత్తముడైన దేవున్నే ధ్యానించుచూ ఉపాసించు వాని యోగము యొక్క క్షేమమును నేనే వహించుదును.”

ఈ శ్లోకములోని భావమును చాలామంది తప్పుగా అర్థము చేసుకొని, అన్యచింత లేకుండా దేవుని ధ్యాస కల్గినవానియొక్క క్షేమమునూ, యోగమునూ నేనే చూచుకుంటానని చెప్పినట్లు భావించుకొన్నారు. అయితే

మనిషి తన భక్తుడైనంత మాత్రమున వాని క్షేమమును మరియు యోగమును దేవుడు చూచుకుంటాడని అనుకోవడము పూర్తి తప్పు. భక్తుడైన వాని యోగము యొక్క క్షేమమును చూస్తానని దేవుడు చెప్పాడుగానీ, వాని యొక్క క్షేమమును చూస్తానని ఎక్కడా చెప్పలేదు. తననే ఆరాధించు యోగి యొక్క యోగము ఆటంకము లేకుండా చూస్తానను ఉద్దేశ్యముతో యోగము యొక్క క్షేమము అన్నాడుగానీ క్షేమము, యోగము అని విడిగా చెప్పలేదు. దేవుని మీద భక్తి శ్రద్ధలుగలవాడు ఆచరించు యోగమునకు ఆటంకపడు దేనినైనా ఆత్మ తొలగించును. అటు ప్రయత్నములో యోగి యోగమునకు ఆటంకముగా అతనికి రోగమువస్తే, ఆ రోగమును ఆత్మే లేకుండా చేయును. ఒకవేళ ముందే దీర్ఘకాల రోగముతోయున్నవాడు దేవుని జ్ఞానమును తెలియ గలిగి యోగము ఆచరించుటకు పూనుకొనినట్లయితే, నిజమైన దేవుని మీద ధ్యాస కల్గి ఉన్నట్లయితే, అతనిలో ముందు చాలాకాలము నుండి ఉన్న రోగమైనా లేకుండా పోవును. క్యాన్సర్ లేక మందులు లేని ఎయిడ్స్ వ్యాధులైనా మందుల ప్రమేయము లేకుండా ఆత్మ ఆజ్ఞతో శరీరమునుండి లేకుండాపోవును. ఇటువంటి అసంభవమైన ఎన్నో పనులను ఆత్మ చేయుచూ దేవుని జ్ఞానమునకు విలువను కల్గించుచున్నది. ఈ విధముగా జ్ఞానము యొక్క విలువను చూపుచూ మనిషిని దేవునివైపు ఆత్మ నడిపించుచున్నది.

ఇట్లు దేవునివైపు మనిషిని నడిపించు ఆత్మ, అసలైన దేవుని మీద నమ్మకము లేక దేవుడెవరో తెలియక, అన్యదేవతల మీద ధ్యాసకల్గిన మనుషులను అజ్ఞానమార్గమువైపు నడిపించుటకు, దేవుని జ్ఞానము తెలియని మనిషికి మహత్యములను కల్గించి, అతని ద్వారా ప్రజల క్షేమములకు సుఖములకు కావలసిన లాభములు కల్గించును. తగిన విధముగా ఒక మనిషిని మహత్తులుగల మనిషిగా చూపించి, అతనే దేవుడన్నట్లు చేయించి

అతని వెనకే అతని ధ్యాసలోనేవుంటూ, అతనికంటే మించిన దేవుడు లేడన్నట్లు ఆత్మే చేయును. మనిషిని స్వామీజీగానో, బాబాలుగానో అవతార మెత్తించి అతనికి తెలియకుండానే అతని మహత్యములు అందరికీ తెలియునట్లు చేసి, అతనిని ప్రజలలో మహిమగల వానిగా ప్రచారము చేయించి, అతనినే అనుసరించునట్లు ఆత్మ చేయును. అటువంటి వారికి దేవుని జ్ఞానము రుచించదు. అందువలన వారు దేవుని జ్ఞానమును అనుసరించక మహిమగల మనిషి వెంటనే పోవుదురు. బయటికి కనిపించు మహత్యములు రెండు విధములైనా, ఒకటి దేవుని జ్ఞానము వలన ఉన్న కర్మ పోవడము. రెండవది ఏమాత్రము జ్ఞానములేకున్నా, ఆత్మే మనిషినుండి మహత్యమును చూపి అతనివెంట పోవునట్లు చేయడము కలదు. దేవుని జ్ఞానము వలన కర్మలు కాలిపోవడము మహత్యమైనా, అది దేవుని జ్ఞానమున్న వానికి మాత్రమే జరుగును. జ్ఞానమార్గములోనున్న వానికి కర్మలు కాలిపోవడము జ్ఞానములో ఉండే పద్ధతి. అలా జరుగడము వలన దేవుడు యోగము యొక్క క్షేమమును చూచుటకే తన జ్ఞానము చేత అట్లు చేయించాడని తెలియుచున్నది. అది జ్ఞానమార్గములో ఉన్నవానికే జరుగును. కావున దానిని మంచి పద్ధతిగానే గుర్తించవచ్చును. అయితే ఏ జ్ఞానము లేనిచోట మహత్యము జరుగుచున్నదంటే, మనిషిని మాయమార్గమున పంపుటకు ఆత్మే ఆ విధముగా చేయుచున్నదనీ, అంతతప్ప అది జ్ఞాన మార్గముకాదని అర్థమైపోవుచున్నది.

అసలు విషయానికి వస్తే గుణ భావములు స్త్రీ పురుషులలో ఎక్కువ తక్కువ ప్రభావములు కల్గియున్నవని చెప్పడమే పెద్ద రహస్యము. శరీరములో రహస్యముగాయున్న దానిని గురించి ఇపుడు వివరముగా తెలుసుకొందాము. మన శరీరములో తలయందు గల గుణచక్రములో మూడు భాగములు

కలవు. అందులో ప్రతి భాగములోనూ ఆరు చెడు గుణములు, ఆరు మంచి గుణములు కలవు. మొదట చెడు గుణములను గమనించిన వరుసగా ఇలా కలవు. ఒకటి కామము (ఆశ), రెండు క్రోధము (కోపము), మూడు లోభము (పిసినారి తనము), నాలుగు మోహము (నా అనునది), ఐదు మదము (గర్వము), ఆరు మత్సరము (అసూయ). ఇవన్నియు చెడు గుణములుకాగా వీటికి వ్యతిరేఖముగా ఆరు మంచి గుణములు కూడా ఇలా కలవు చూడండి. ఒకటి దానము, రెండు దయ, మూడు ఔదార్యము, నాలుగు వైరాగ్యము, ఐదు వినయము, ఆరు ప్రేమ ఇవన్నియు ముందు చెప్పిన చెడు గుణములకు వ్యతిరేఖముగా తయారైన మంచి గుణములని చెప్పవచ్చును. ముందు చెప్పిన చెడు గుణములు బేసి సంఖ్యలో మూడు, సరి సంఖ్యలో మూడు గలవు. అట్లే మంచి గుణములు బేసిసంఖ్యలో మూడు, సరిసంఖ్యలో మూడు, చెడు గుణములను అనుసరించి వాటికి వ్యతిరేఖముగా కలవు. ముందు చెడు గుణములను సరి బేసిగా విడదీసి చూచినట్లయితే ఇలా కలవు. బేసిసంఖ్య అయిన 1, 3, 5 గుణములు కామము, లోభము, మదము అను మూడు గుణములు గలవు. తర్వాత సరిసంఖ్యలోనున్న వాటిని గమనించితే ఇలా కలవు. 2, 4, 6 సంఖ్యల గుణములు వరుసగా క్రోధము, మోహము, మత్సరము అనునవి గలవు.

| | | | |
|---|---|---|---|
| **చెడు** | 1) కామము | 3) లోభము | 5) మదము |
| **గుణములు** | 2) క్రోధము | 4) మోహము | 6) మత్సరము. |

*****

| | | | |
|---|---|---|---|
| **మంచి** | 1) దానము | 3) ఔదార్యము | 5) వినయము |
| **గుణములు** | 2) దయ | 4) వైరాగ్యము | 6) ప్రేమ |

భౌతికశాస్త్రము ప్రకారము బేసి క్రోమోజోముల వలన మగ శిశువు, సరి క్రోమోజోముల వలన ఆడ శిశువు తయారగునని చెప్పినట్లు, అలాగే జ్యోతిష్యశాస్త్రము ప్రకారము శేషము బేసి సంఖ్య వచ్చిన మగ శిశువు జన్మించుననీ, సరి సంఖ్య వచ్చినట్లయితే ఆడ శిశువు జన్మించుననీ చెప్పినట్లు, బ్రహ్మవిద్యా శాస్త్రమును అనుసరించి బేసిసంఖ్యగల గుణముల ప్రభావము పురుషులకు ఎక్కువగా ఉండుననీ, అట్లే సరి సంఖ్య గుణముల ప్రభావము స్త్రీలకు ఎక్కువగా ఉండునని చెప్పవచ్చును. ఈ లెక్క ప్రకారము పురుషులకు మూడు చెడు గుణములు, మూడు మంచి గుణముల ప్రభావములు కలవనీ, అలాగే స్త్రీలకు మూడు చెడు గుణములు, మూడు మంచి గుణముల ప్రభావము కలవనీ చెప్పుచున్నాము. వాటిని క్రింద గమనించితే ఇలా కలవు.

| | | | |
|---|---|---|---|
| పురుషులకు ఎక్కువ ప్రభావము గల చెడు | 1) కామము | 3) లోభము | 5) మదము |
| మంచి గుణములు | 1) దానము | 3) ఔదార్యము | 5) వినయము |

| | | | |
|---|---|---|---|
| స్త్రీలకు ఎక్కువ ప్రభావము గల చెడు | 2) క్రోధము | 4) మోహము | 6) మత్సరము. |
| మంచి గుణములు | 2) దయ | 4) వైరాగ్యము | 6) ప్రేమ |

స్త్రీ పురుషుల ఇరువురిలో మంచి చెడు అనబడు పన్నెండు గుణములు సహజముగా ఉండినా, వాటిలో సరి సంఖ్యగాయున్న మూడు మంచి గుణములు, మూడు చెడు గుణములు ఎక్కువ శాతము స్త్రీలలో

పనిచేయగా, బేసిసంఖ్యగాయున్న మంచి చెడు ఆరు గుణములు పురుషులలో ఎక్కువ పని చేయునని తెలిసిపోయినది. స్త్రీలలో అసూయ గుణము ఎక్కువగా ఉండునని చాలామందికి అనుభవపూర్వకముగా తెలుసు. అలాగే మోహగుణము కూడా పురుషులకంటే ఎక్కువగాయుండును. నా వారు, నాది అను భావము ఎక్కువగా ఆడవారిలో కనిపించును. పుట్టింటి వారిమీద కనబరచు మోహభావము, అత్తగారింటివారి మీద ఉండదు. నా అను మోహభావము స్త్రీలలోనే ఎక్కువ ఉన్నదని తెలియుచున్నది. అట్లే కోపము మగవారికంటే ఆడవారిలోనే ఎక్కువ ఉండునని తెలియుచున్నది. అందువలన కొందరు కవులు తమ వ్రాతలలో తోక త్రొక్కిన నాగుపాము బుస్సున లేచినట్లు ఆడవారిలో కోపముండునని వర్ణించారు. కోపము, మోహము, అసూయ అను మూడు గుణములు పాపమును తెచ్చిపెట్టును. అందువలన ఆ మూడు గుణములను చెడు గుణములంటున్నాము. స్త్రీలలో మూడు చెడు గుణముల ప్రభావమేకాక మూడు మంచి గుణముల ప్రభావము కూడా కలదు. పురుషులకంటే స్త్రీలలో దయా గుణము ఎక్కువగాయుండును. అలాగే ప్రేమ గుణము కూడా ఎక్కువగా ఉండును. అట్లే మోహగుణమునకు వ్యతిరేఖమైన వైరాగ్య గుణము కూడా స్త్రీలలో ఎక్కువయుండును. స్త్రీలకు పురుషులకంటే కోపము, అసూయ, మోహము ఎక్కువగాయున్నా, వాటికి పూర్తి వ్యతిరేఖమైన దయ, ప్రేమ, వైరాగ్యము కూడా ఎక్కువగానే ఉన్నాయని ఒప్పుకోక తప్పదు.

అదే విధముగా పురుషులలో కామము, లోభము, మదము అను మూడు గుణములు ఎక్కువగాయుండును. అట్లే ఆ మూడు గుణములకు వ్యతిరేఖ గుణములైన దానము, ఔదార్యము, వినయము అను మంచి గుణములు కూడా ఉండును. మానవజాతిలో ఒక్కొక్క గుణభాగమందు

పన్నెండు గుణములుండగా వాటిలో ఆరు స్త్రీలయందు ఎక్కువ ప్రభావము చూపునవిగా ఉండగా, మిగత ఆరు పురుషులలో ఎక్కువ ప్రభావమును చూపుచున్నవి. నేడు చాలామందికి కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరములను ఆరు గుణములే తెలియును. మిగతా ఆరు మంచి గుణముల విషయము తెలియదనియే చెప్పవచ్చును. ఇక్కడ ఆరు చెడు గుణములను చెప్పడమేకాక, వాటికి పూర్తి వ్యతిరేఖముగాయున్న ఆరు మంచి గుణములను కూడా చెప్పడము జరిగినది. మనిషిలోనున్న గుణములే మాయ అని చెప్పబడుచున్నదని భగవద్గీతలో తెల్పుచూ విజ్ఞానయోగమను అధ్యాయమున 14వ శ్లోకమందు "గుణమయీ మమ మాయా దురత్యయా" అని చెప్పడము జరిగినది. మాయ అను గుణములను జయించుట దుస్సాధ్యమైన పని అని దీని భావము. మాయ అనబడు గుణముల చేతనే పాపపుణ్యమను కర్మను మనిషి సంపాదించుకొని, కర్మ కారణము చేత జన్మించుచూ రావడము జరుగుచున్నది. జన్మ రాహిత్యము చేసుకొని మోక్షమును పొందాలంటే గుణముల విషయము పూర్తి వివరముగా తెలియవలసియున్నది. అందువలన మనుషులకున్న పన్నెండు గుణములను తెల్పుచూ, వాటిలో స్త్రీ పురుషులయందు ఎక్కువ తక్కువ ప్రభావము చూపు వాటిని కూడా విడదీసి చెప్పడము జరిగినది. గుణముల రహస్యమంతయూ ప్రథమ దైవ గ్రంథమైన భగవద్గీతలో దేవుని మారువేషమైన కృష్ణ భగవానుడు చెప్పడము జరిగినది. మొదటినుండి సర్వమానవులకు సంబంధించిన జ్ఞానము భగవద్గీతలో ఉండుట వలన భగవద్గీత ప్రతి మనిషికీ అవసరమైన గ్రంథము. ఒక్క హిందూ సమాజమునకే భగవద్గీత అని మిగత మతముల వారు అనుకోకూడదు. సర్వమానవులకు సంబంధించిన జ్ఞానము గీతలో ఉండుట వలన, గీతలోని జ్ఞాన సూత్రములే మిగత బైబిలు, ఖుర్ఆన్

గ్రంథములలో ఉండుట వలన  అన్ని మతముల వారికి భగవద్గీత అవసరమనీ, గీత అన్నిటికీ మూల గ్రంథమైన ప్రథమ దైవ గ్రంథమనీ తెలియవలెను.

ఆడవారిలో సరిగుణములూ, మగవారిలో బేసి గుణములూ ఎక్కువగా పని చేయడము వలన  వారిలో ఇట్లున్నదని సమాజమునకు తెలుపు నిమిత్తము స్త్రీ పురుషులలో ఒక ఆచరణ యోగ్యమైన నియమమును పూర్వము పెద్దలు ఏర్పరచారు.  ఇందూ సమాజము అంటే జ్ఞాన సమాజమని అర్థము కదా!  పూర్వము పెద్దలందరూ జ్ఞానులే అయినందున  రాబోవు కాలములోని చిన్నలందరూ స్త్రీ, పురుషులలోని గుణముల ప్రభావములు తెలుసుకొనునట్లు  బయటికి గుర్తుగా స్త్రీని పురుషునికి ఎడమ ప్రక్కగా నిలబెట్టెడివారు.  ఇందూ సమాజములో ఈనాటికీ పెళ్ళిలోగానీ, పండుగలలో గానీ భార్య భర్త ఇరువురు ఒకచోట నిలబడినప్పుడు,  భార్య భర్తకు ఎడమ వైపున నిలబడునట్లు చేశారు.  అలా చేయడము వలన ఏదో అర్థముందని దానిని గురించి అడుగుటకు అవకాశముండునని పెద్దలు అలా చేశారు. ఇతర మతములలో ఈ జ్ఞానము తెలియదు, ఈ ఆచరణ లేదు.  ఇటువంటిదే పూర్వము వైద్యులు చేతివద్ద నాడిని పరీక్షించునప్పుడు  పురుషులకు కుడి చేతినాడినీ, స్త్రీలకు ఎడమచేతి నాడినీ పరీక్షించి చూచెడివారు.  ఈ విధముగా వైద్య విధానములో కూడా ఆడవారికి ఎడమప్రక్కనే నాడి చూడడములో కూడా లోపలి గుణములనుబట్టియేనని తెలియుచున్నది.  నేడు చాలామందికి నాడి చూడడములో స్త్రీలకు ఎడమ ప్రక్కనే ఎందుకు చూడాలి అను విషయము తెలియదు.  పూర్వము గుణముల ప్రభావములు స్త్రీలలో పురుషులలో ఎక్కువ తక్కువగాయున్నవని తెలిసిన జ్ఞానులు  ఆ విషయము లను బయటికి తెలుపు నిమిత్తము అలా చేయు ఆచరణ పెట్టారు.

నేడు సమాజములో హిందువులందరూ చేతివ్రాత వ్రాయునప్పుడు కుడివైపున మొదలుపెట్టి ఎడమవైపుకు వ్రాయడము సహజముగాయున్న పని. గుణముల విషయమునకువస్తే గుణములను వరుసగా వ్రాయడము జరుగుచున్నది. అలా వ్రాసుకొన్నప్పుడు మొదట కామమను గుణముతో మొదలుపెట్టి మత్సరము వరకు చెడు గుణములను వ్రాయుదుము. తర్వాత మంచిగుణములను వ్రాస్తూ దానము నుండి మొదలుపెట్టి ప్రేమ వరకు వ్రాయడము జరుగుచున్నది. అలా వ్రాసినప్పుడు ప్రతి బేసి గుణమునకు ఎడమవైపు సరి సంఖ్య గుణము వచ్చుచున్నది. తలలో గుణముల వరుసలో బేసికి ఎడమవైపున గల సరి గుణములే స్త్రీలలో ఎక్కువ ప్రభావము చూపు చున్నవని తెలియుటకు అలా సరిసంఖ్య బేసికి ఎడమవైపున వ్రాతలో అమరుచున్నదని తెలియవలెను. ఈ విధానము అర్థమగుటకు క్రింద చూడండి.

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| కామ | క్రోధ | లోభ | మోహ | మద | మత్సర |
| కుడి ఎడమ | కుడి ఎడమ | కుడి ఎడమ | కుడి ఎడమ | కుడి ఎడమ | కుడి ఎడమ |
| పురుష | స్త్రీ | పురుష | స్త్రీ | పురుష | స్త్రీ |

*****

| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
|---|---|---|---|---|---|
| దాన | దయ | ఔదార్య | వైరాగ్య | వినయ | ప్రేమ |
| కుడి ఎడమ | కుడి ఎడమ | కుడి ఎడమ | కుడి ఎడమ | కుడి ఎడమ | కుడి ఎడమ |
| పురుష | స్త్రీ | పురుష | స్త్రీ | పురుష | స్త్రీ |

మన తలలోనున్న గుణ ప్రభావములు స్త్రీ పురుషులలో వేరువేరుగా ఉన్నాయని తెలియుటకే పడకలోగానీ, పండుగలోగానీ, పెళ్ళిలోగానీ స్త్రీని పురుషునికి ఎడమవైపు ఉంచడము జరుగుచున్నదని తెలియవలెను.

ఈ విధానమంతయు శాస్త్రబద్ధమైనది. భౌతికశాస్త్రమును, జ్యోతిష్య శాస్త్రమునూ, బ్రహ్మవిద్యాశాస్త్రమునూ అనుసరించి చెప్పిన విధానమని తెలియవలెను. ఈ విషయమంతయు ఎవరూ ఇంతవరకు ఎక్కడా చెప్పలేదు. అటువంటి రహస్య విషయమును ఆత్మ అందించగా ఇక్కడ వ్రాయడము జరిగినది. ఎవరో స్వామీజీలు చెప్పారనిగానీ, ఎవరో గురువు చెప్పాడనిగానీ ఈ విషయమును చెప్పలేదు. నేరుగా ఆత్మే చెప్పినదని చెప్పుచున్నాము. ఎవరికీ తెలియని ఆత్మ, ఎవరికీ చెప్పని ఆత్మ నీకు ఒక్కనికే చెప్పిందా అని ఎవరైనా నన్ను ప్రశ్నించవచ్చును. దానికి జవాబు ఏమనగా! ఆత్మయనునది ఇంతవరకు ఎవరికీ తెలియకున్నా సృష్ట్యాదిలోనే దేవుడు ఆత్మను గురించి శబ్ధరూపములో వచ్చిన తన జ్ఞానములో తెలియ జేశాడు. ఆత్మ నీకు ఒక్కనికే చెప్పిందా అను ప్రశ్నకు చెప్పునదేమంటే, ఆత్మను అడిగితే ఎవరికైనా జవాబు చెప్పగలదు. వినగలిగిన వానికి అన్నీ ఆత్మ చెప్పే విషయములేగలవని తెలియును. ప్రతి దానిని ఆత్మే తెలియ జేయుచున్నదనుటకు నిరూపణగా భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమను అధ్యాయమందు 15వ శ్లోకమునందు ఇలా చెప్పబడినది చూడండి.

*శ్లో॥ సర్వస్య చాహం హృది సన్ని విష్టో మత్తః స్మృతిర్జ్ఞాన మపోహనంచ।*
*వేదైశ్చ సర్వైరహ మేవ వేద్యో వేదాన్తకృ ద్వేదవి దేవ చాహమ్ ॥*

భావము :-"నేను సర్వ జీవరాసుల హృదయ పీఠమైన తలలోయున్నాను.

నా వలననే సర్వ జీవరాసులకు స్మృతి, జ్ఞానము, ఊహ కల్గుచున్నవి! ఈ శ్లోకములో మొదటి చరణములోనే నేను అందరి తలలో ఉన్నాననీ, అందరికీ నేనే స్మృతి, జ్ఞానము, ఊహ కలుగజేయుచున్నానని ఆత్మ తెలియజేసినది. అదే విధముగా అందరినీ ఆజ్ఞాపించుచూ, బోధించుచూ, నడిపించుచూ, మాట్లాడించుచూ అన్నిటినీ చేయుచున్నది. ఇదే విషయమునే చెప్పుచూ అంతిమ దైవ గ్రంథమని పేరుగాంచిన ఖుర్ఆన్ గ్రంథమున 50వ సూరా యందు 21వ ఆయత్‌లో "ప్రతి జీవి ఒక తోలే ఆత్మతోనూ, సాక్షిగావుండే పరమాత్మతోను" ఉన్నాడని చెప్పబడినది. అన్ని విధముల ఒక మనిషిని నడుపుచున్న ఆత్మను తోలేవానిగా చెప్పడము జరిగినది. ఈ విధముగా ప్రథమ దైవ గ్రంథము భగవద్గీతగానీ, మధ్య దైవ గ్రంథము బైబిలుగానీ, అంతిమ దైవ గ్రంథము ఖుర్ఆన్ గ్రంథముగానీ ఆత్మను గురించి చెప్పుచున్నవి. ఆత్మ అన్ని విధముల అన్ని జీవరాసులను నడిపించుచున్నదని మూడు దైవ గ్రంథములలోనూ ఉండగా, మీరు తెలుసుకోగలిగితే ఆత్మ మీకు సమాధానము ఇవ్వగలదు. ఇంతవరకు నిన్ను నన్ను అందరినీ నడిపించు ఆత్మ ఒకటున్నదని హిందువులకే తెలియని దానివలన, ఇతర మతస్థుల దృష్టి దేవునిమీద తప్ప, దేవుడు చెప్పిన ఆత్మమీద లేనిదానివలన ఆత్మ ఎవరికీ తెలియకుండాపోయినది. అందరూ ఆత్మ చేయు పనులనన్నిటినీ మేమే చేయుచున్నామని అనుకొంటున్నారు. అందువలన మేము ఆత్మ విషయమును గురించి చెప్పితే అందరికీ క్రొత్తగావుండుట వలన ఆత్మ నీకు ఒక్కనికే చెప్పిందా అని ప్రశ్న వేయుటకు అవకాశమేర్పడి నది. ప్రతి క్షణము ఆత్మ చెప్పడమేకాక, అందరినీ ఆత్మే నడిపించుచున్నదని మరువకూడదు.

సృష్ట్యాదిలో దేవుడు పంపిన వాణి (శబ్దము) లో జగతికి సరిపడు జ్ఞానమును, జీవరాసులకు మరీమరీ చెప్పకుండా ఒకేమారు సంపూర్ణమైన జ్ఞానమును అందించాడు. అందులో ప్రకృతి విషయము ఒక భాగముకాగా, జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అను మూడు ఆత్మల విషయము ఒక భాగముగా తెలుపడము జరిగినది. సృష్టి ఎప్పుడు పుట్టిందో ఖచ్చితముగా ఎవరికీ తెలియదు. అలాగే సృష్ట్యాదిలో దేవుడు సూర్యునికి చెప్పిన జ్ఞానమును కూడా అందరూ మరచిపోవడము జరిగినది. మరచిపోయిన దేవుని జ్ఞానమును దేవుడే స్వయముగా మారువేషములో వచ్చి దేవునిగా కాకుండా, అట్లని మనిషిగా కూడా కాకుండా, ఇటు దేవునికీ అటు మనిషికీ తప్పిన మధ్య స్థితిలోగల భగవంతునిగా వచ్చి ఎన్నోమార్లు చెప్పడము జరిగినది. దేవుడు భగవంతునిగా ఎప్పుడు వచ్చి చెప్పినా సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానమునే చెప్పును. సృష్టి అంతయు త్రైత సిద్ధాంతముతో (మూడు సూత్రములతో) నిండుకొనియుండుట వలన దేవుడు జీవుడు ఆత్మ (పరమాత్మ, జీవాత్మ, ఆత్మ) అను భాగములుగా సృష్ఠంతయు ఉన్నది. త్రైత సిద్ధాంతము మీద ఆధారపడిన సృష్ఠిలోని మనుషులకు మూడు విధముల తన జ్ఞానమును తెలియజేస్తానని, తాను ఎవరితోనూ ప్రత్యక్షముగా మాట్లాడనని దేవుడు చెప్పడము జరిగినది. దేవుడు నేరుగా ఎవరితోనూ మాట్లాడకుండా తన జ్ఞానమును ఎలా తెలుపునను ప్రశ్నకు జవాబుగా, ఒకటి ఆకాశములోని శబ్దము ద్వారా, రెండు తెరవెనుక కనిపించకయున్న వారిచేత, మూడు తన దూతవలె వచ్చిన వానిచేత జ్ఞానమును తెలియజేస్తానని చెప్పడము జరిగినది. దేవుడు అంత వివరముగా మూడు విధములని చెప్పినా, చెప్పినట్లే మూడు విధముల బోధించినా, మనిషి మాత్రము ఇంతవరకు ఆ విధానములేవో అర్థము చేసుకోలేక పోయాడు.

ఆకాశవాణి చెప్పినది సృష్ట్యాదిలో ఒకమారే జరిగినది. మొదట దేవునినుండి జ్ఞానము బయటికి వచ్చుటకు దేవుడు ఆకాశములోని శబ్దము ద్వారా పలికించాడు. అక్కడ శూన్యమునుండి శబ్దము వచ్చినది తప్ప, దానిని పల్కినవారు ఎవరని చెప్పలేము. అది ఆదిలోనే దేవుడు చెప్పించిన జ్ఞానమని చెప్పగలము. వాస్తవముగా మూడు విధానములలోని మొదటిదైన శబ్దము ద్వారా వచ్చినది ఎవరినుండి వచ్చియుండును అని ఆలోచిస్తే దానిని దేవుడే చెప్పాడని అనుటకు ఆధారములేదు. అక్కడ జరిగిన విధానము ఏమిటి? అని యోచిస్తే కొంత సమాచారము ఆత్మ అందిస్తున్నది. అదేమనగా! దేవుని జ్ఞానమును మనుషులకు అందించుటకు లేక బోధించుటకు ఒకటి భూతములు, రెండు గ్రహములు మూడు మనిషివలెనున్న భగవంతుడు ఉపయోగపడుచున్నారు. భూతములలోనూ, గ్రహములలోనూ మనుషుల శరీరములలో ఉన్నట్లే ఆత్మ గలదు. మనిషి చేత అన్ని పనులను ఆత్మ చేయించినట్లు, అన్ని మాటలను మాట్లాడించినట్లు భూతములనుండి, గ్రహములనుండి ఆత్మ చేయించగలదు, మాట్లాడించగలదు. గ్రహములలో గానీ, భూతములలోగానీ త్రైత సిద్ధాంతము ఇమిడియున్నది. అందువలన భూతములందు మహాభూతములందూ, గ్రహములందు మహా గ్రహములందూ జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అనబడు మూడు ఆత్మలుండును. సృష్ట్యాదిలో మహాభూతమైన ఆకాశములోని ఆత్మనుండి జ్ఞానము చెప్పబడినది. అలాగే రెండవ విధానమైన తెరచాటునుండి చెప్పించుటలో మహా గ్రహమైన సూర్యగ్రహములోని ఆత్మ చెప్పినది. ఆకాశభూతమునుండి చెప్పినప్పుడుగానీ, ఖగోళములోని మహా గ్రహమైన సూర్యుడు చెప్పినప్పుడు గానీ వారిలోని ఆత్మయే జ్ఞానమును చెప్పగా! మనిషి ఆకారములోనున్న భగవంతుని శరీరమునుండి కూడా ఆత్మే చెప్పినది. అయితే మనిషి

ఆకారమున్న భగవంతుని శరీరములో నుండి చెప్పినది ఆత్మే అయినా భూతముల ఆత్మకు, గ్రహముల ఆత్మకు భిన్నముగా భగవంతుని శరీరములోని ఆత్మయుండును. త్రైత సిద్ధాంతము భగవంతుని శరీరములో ఉన్నదని చెప్పుటకు వీలులేదు. భగవంతుడు మనుషులకంటే, భూతములకంటే, గ్రహములకంటే భిన్నముగా ఉండును. అలా ఎందుకున్నదనగా భగవంతుని శరీరములో జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అనబడు మూడు ఆత్మలుండవు.

భగవంతుని శరీరములో కర్మవుండదు. కావున జీవాత్మ ఆత్మలుండవు. అయితే ఒక్క పరమాత్మ మాత్రము భగవంతుని శరీరములో ఉండినా అది సాక్షిగా ఉంటూ ఏమీ చేయకుండును. అయితే పరమాత్మ నుండి అవసరమునుబట్టి ఆత్మ బయటికివచ్చి మాట్లాడవలసినది మాట్లాడి తిరిగి పరమాత్మలోనే అణిగిపోవుచుండును. అలా వచ్చిన ఆత్మ అవసరమును బట్టి జీవునిగా, అవసరమునుబట్టి దేవునిగా కూడా నటించు చున్నది. అయితే భగవంతుని శరీరములోని విధానము ఎవరికీ తెలియదు. సర్వసాధారణ మనిషిలో ఉన్నట్లే ఉండును. భగవంతుని శరీరములో మూడు ఆత్మలు ఎందుకులేవు అని ప్రశ్నించుకొని చూస్తే, సృష్ట్యాదిలో చెప్పని జ్ఞానమేదైనా ఉంటే అప్పుడప్పుడు దేవునినుండి బయటికి వచ్చునట్లు చేయుటకు భగవంతుని శరీరములో పరమాత్మ మాత్రముండును. భగవంతుని శరీరమునుండి ఆత్మ చెప్పిన మాటలలో సృష్ట్యాదియందు చెప్పక వదిలిన జ్ఞానము కూడా ఉండును. దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఇతరులెవరికీ తెలియదు. కావున భగవంతుని శరీరములోగల దేవుని నుండి ఆత్మ బయటికి వచ్చుట వలన క్రొత్త జ్ఞానమును అప్పటికప్పుడు బోధించగలదు. ఇదంతటిని గమనిస్తే, భగవంతుని శరీరము భూమిమీద సకల జీవరాసులలో ప్రత్యేకత కల్గియున్నదని చెప్పవచ్చును. సృష్ట్యాదిలో

ఏ చిన్న విషయమునుగానీ ఆకాశముచేత చెప్పించక వదలివేసియుండినా, దానిని దేవుడు భగవంతునిగా వచ్చినప్పుడు వదలకుండా చెప్పును.

గతములో భూమిమీదికి భగవంతుడు వచ్చిపోయిన సంఘటనలు కలవు. ఇక్కడ ముఖ్యముగా చెప్పుకోవలసిన విషయమేమనగా! దేవుడు భగవంతునిగా వేరువేరు సమయములలో మూడుమార్లు భూమిమీదికి వచ్చి పోతే, ఒక్కమారు వచ్చినట్లగును. త్రైత సిద్ధాంతమును దేవుడు భగవంతుని జన్మలలో కూడా అమర్చి మూడుమార్లు వచ్చి జ్ఞానమును చెప్పిపోవునట్లు చేశాడు. అయితే ఆ విషయము ఎవరికీ తెలియకూడదు. ఆయన ఎవరికీ తెలియకుండ వచ్చి పోవడమును దైవరహస్యము అని అనవచ్చును. దేవుడు భూమిమీదికి మనిషి ఆకారమున్న భగవంతునిగా వచ్చి పోవడము ఎవరైనా తెలియగల్గితే, వారికి జ్ఞానము తెలియకున్నా, వారు యోగమును చేయకున్నా జన్మరాహిత్యమైన మోక్షమును పొందగలరు. ఎంతో జ్ఞానము తెలిసినా దొరకని మోక్షము అంత సులభముగా దొరకకూడదు. కావున మనిషి వలె వచ్చు దేవుని అవతారము అనగా భగవంతుని జన్మను ఎవరూ తెలియ లేరు. తెలియుటకు వీలులేకుండా దేవుడు చేయును. అందువలన చాలామందికి దేవుడు భూమిమీదికి రాడు అను ఉద్దేశ్యమును వారిలో స్థిర స్థాయిగా ఉంచాడు. దానిప్రకారము కొన్ని మతములవారు దేవుడు పుట్టడనే వాదించుచుందురు. దేవుడు మనిషివలె పుట్టి వచ్చినా అతను ఇటు మనిషి కాడు, అటు దేవుడు కాదు రెండిటికి తప్పియున్న అనగా రెండూ కాని భగవంతుడని వారికి తెలియదు. ఎటు చూచినా దేవుని అవతారమైన భగవంతున్ని గుర్తించడము ఎవరికీ సాధ్యము కాదనియే చెప్పవచ్చును.

గుర్తించుటకు కష్టతరమైన దేవుని అవతరణను తెలియలేని ప్రజలందరూ, దేవుడు మనిషివలె కనిపించు భగవంతునిగా వచ్చిపోయినా,

ఆయన వచ్చిపోయాడను విషయము కూడా తెలియని స్థితిలో ఉన్నారు. దేవుడు మనిషివలె వచ్చి, దేవుడే మారురూపములో గుర్తించనట్లు మనుషుల మధ్యలోవుండి, దేవుని సమాచారమును (జ్ఞానమును) దేవుడే స్వయముగా చెప్పిపోయినా, ఆ జ్ఞానమును చూచి కూడా ఇది సాధారణ మనుషులు చెప్పు జ్ఞానము కాదని తెలియలేక, భగవంతున్ని కూడా సామాన్య మనుషులలోనికి కలిపివేసుకొంటున్నారు. ఎవరికీ తెలియని దేవుని సమాచారమును అందించినవాడే నిజమైన దూత అని తెలియక పోయినందున, దేవుడు తన జ్ఞానమును భూమిమీద మనుషులకు అందించు మూడు విధానములలో, మూడవ విధానమైన దూత ద్వారా జ్ఞానమును తెలియజేస్తాను అన్న విధానమును పూర్తి తెలియకుండా పోయారు. మూడు విధానములలో రెండవదైన తెరచాటునుండి తెలియజేస్తాను అను పద్ధతి ప్రకారము తెరచాటునుండి ఎలా తెలియజేస్తాడో తెలియనివారై, తెరచాటు నుండి కనిపించక చెప్పినప్పుడు అలా చెప్పిన వానిని దేవుడు పంపిన దూతయని అనుకోవడము జరిగినది. మూడవ విధానమును రెండవ విధానముగా మనుషులు అనుకోవడము జరిగినది. ఇకపోతే మొదటి విధానమైన ఆకాశవాణినుండి చెప్పబడునది ఎలాగో కూడా మనుషులకు తెలియకుండా పోయినది. ఒకమారు సృష్ట్యాదిలోనే దేవుడు ఆకాశమునుండి సూర్యునికి తన జ్ఞానమును చెప్పించినా, అదే జ్ఞానమును సూర్యుడు తన సాటి గ్రహములకు, భూమిమీదవున్న ప్రజలకు తెలియజేసినా, దేవుడు చెప్పినట్లు రెండు విధానములు గడచిపోయాయని తెలియలేకపోయారు. సృష్ట్యాదిలో మొదటి విధానము జరుగగా, అప్పుడే కొద్ది కాలమునకు సూర్యుడు రెండవ విధానము ప్రకారము భూమిమీద మనుషులకు జ్ఞానమును తెలియజేసాడని గుర్తించలేకపోయారు.

గతములో గడచిపోయిన మొదటిది అయిన వహీ ద్వారా (వాణి ద్వారా) తెలియబడిన దానిని, సూర్యుడు తెరచాటునుండి చెప్పిన రెండవ దానిని గుర్తించలేకపోయారు. ఇప్పటికీ ఆ రెండు విధానములు తెలియక పోయిన దానివలన, ప్రత్యక్షముగా దూతవలె చెప్పిన దానిని రెండవ దానిగా లెక్కించుకోవడము జరిగినది. దానితో మూడవ విధానము పూర్తి తెలియ కుండాపోయినది. తెరచాటునుండి చెప్పువాడు కనిపించకుండ బోధించి నప్పటికీ, చెప్పువాడు నేను ఫలానా సూర్యున్నని చెప్పగా, సూర్యున్ని దేవుని దూతగా లెక్కించుకొని మూడవ విధానమును రెండవ దానిగా పోల్చుకొని పొరపడడము జరిగినది. ఆ పొరపాటును నేటికినీ తెలుసుకొను స్థితిలో మనుషులు లేరు. పూర్వము ఇందూ సమాజముగాయున్న మనుషులందరు నేడు కొంత అజ్ఞానముతో తమది హిందూమతము అని చెప్పుకోవడము జరుగుచున్నది. నేడు హిందూ మతము మీద ప్రేమకల్గి, తమ మతము క్షీణించి పోవుచున్నదను బాధను వ్యక్తము చేయువారందరికీ, వాస్తవముగా నేడు హిందూ మతము అనబడు ఇందూ సమాజముయొక్క పూర్వ చరిత్ర వారికి ఏమాత్రము తెలియదు. పూర్వచరిత్ర తెలిసిన జ్ఞానులు భూమిమీద అక్కడక్కడ ఉండవచ్చును.

ఇందువు అంటే జ్ఞాని అని అర్థము. ఇందువులు అనగా జ్ఞానులు అని అర్థము. పూర్వము ఏ మతమూలేని, ఏ మతమూ రాని రోజు దేశములో నున్న వారందరూ జ్ఞానులుగా ఉండుట వలన భారతదేశమునకు ఇందూ దేశమని బిరుదు కలదు. ఇందూ దేశమను బిరుదు కృతయుగములోనే వచ్చినది. కలియుగములో రెండువేల సంవత్సరముల పూర్వము వరకు ఈ దేశమును ఇందూ దేశము అనెడివారు. పేరుకు తగినట్లు దైవజ్ఞానము కూడా కల్గి ఇందూదేశము ఆధ్యాత్మిక శక్తిగల దేశమని ఇతర దేశముల

వారనుకొనునట్లు చేసినది. ఈ మధ్య కాలములో ఇందూదేశము కొంత మార్పుతో హిందూదేశముగా పిలువబడుచున్నది. మేము నేడు జ్ఞానమును బోధించుచూ మనము పూర్వము ఇందువులుగా ఉండెడివారము, అటువంటి జ్ఞానము తెలిసి నిజమైన జ్ఞానులు (ఇందువులు) కావాలి అని చెప్పితే, చరిత్ర తెలియని నేటి హిందువులు మేము ఏదో క్రొత్త మతమును గురించి చెప్పుచున్నామని అనుకొంటున్నారు. మేము ఏమి చెప్పుచున్నామని అర్థము చేసుకోలేని స్థితిలో నేటి హిందువులుండడము బాధాకరము. మేము చెప్పు ఇందు అను పదము సత్యము అని సాక్ష్యమిచ్చునట్లు ఒకప్పుడు ఈ దేశమునకు ప్రధాని అయిన జవహర్‌లాల్ నెహ్రూ తన కుమార్తె అయిన ఇందిరాగాంధీకి **"మనది ఇందూదేశమే"** అని చెప్పి వ్రాసిన ఉత్తరము గలదు తర్వాత పేజీలో చూడండి.

నేడు కొందరు దైవజ్ఞానమును తెలిసినవారు కూడా తాము నిజమైన ఇందువులమని తెలియలేకపోయారు. అర్థముతో కూడుకొన్న ఇందువనను మాటనే తెలియకుండాపోవడేమేకాక, దానికంటే ముఖ్యమైన జ్ఞానమునే మరచి పోయి, దేవుడు భూమిమీద మూడు విధముల జ్ఞానమును బోధించిన విషయమును పూర్తిగా తెలియకుండాపోయారు. భగవద్గీతలో జ్ఞాన యోగమను అధ్యాయమున మొదటి శ్లోకములోనే సృష్ట్యాదిలో ఆకాశవాణి ద్వారా సూర్యునికి జ్ఞానమును చెప్పిన మొదటి విధానమూ, అట్లే సూర్యుడు మనువుకు చెప్పిన రెండవ విధానమును తెలియజేసాడు. తర్వాత మూడవ శ్లోకమున మూడవ విధానమైన దానిగా తాను అర్జునునికి తెలియజేసినట్లు చెప్పాడు. ఖుర్‌ఆన్ గ్రంథములో 42వ సూరా 51వ ఆయత్‌నందు చెప్పిన విషయము ముందే గీతయందు జ్ఞానయోగములో ఒకటవ శ్లోకమందును తర్వాత మూడవ శ్లోకమునందును కలదు. అయినా దేవుడు చెప్పిన మూడు

ప్రముఖుల లేఖ

సాక్షి న్యూస్ పేపరు, *21-01-2014*



## ఇందు దేశమే ఇండియా!

హిమాలయాలకు, వింధ్యపర్వతాలకు మధ్యగా అప్పటి ఆర్యావర్తనం (ఆర్యుల భూభాగం) ఎక్కడ ఉండేదో మన దేశ పటంలో నువ్వు చూశావు. అది బాల చంద్రాకారంగా ఉన్నట్లు కనిపిస్తుంది. అందుకే ఆర్యావర్తానికి ఇందుదేశమని పేరు వచ్చింది. ఇందు దేశమే హిందూదేశమయింది.

రామాయణం పుట్టిన చాలాకాలానికి మహాభారతం పుట్టింది. అది రామాయణం కంటే పెద్ద గ్రంథం. దానిలో చెప్పింది ఆర్యద్రావిడ యుద్ధం కాదు. ఆర్యుల మధ్య ఏర్పడిన కుటుంబకలహమే భారతకథ. భారతంలో చెప్పిన కథలు, ధర్మాలు ఇన్నీ అన్నీ కావు. అవి చాలా అందంగా, గంభీరంగా ఉంటాయి. వీటి అన్నిటికంటే గొప్పదైన భగవద్గీత అనే మహా గ్రంథం మహాభారతంలో ఉన్న కారణాన అది మనకందరికీ ప్రియతమమైనది అయింది. వేల సంవత్సరాల క్రితమే మన దేశంలో ఇలాంటి గొప్ప గ్రంథాలు పుట్టాయి. మహానుభావులే వీటిని రాసి ఉంటారు. ఈ గ్రంథాలు పుట్టి ఇంతకాలం గడిచినా వాటి గురించి తెలుసుకోని పిల్లలు, ప్రయోజనం పొందని పెద్దలు అంటూ ఉండరు.

* నెహ్రూ ఇందిరకు రాసిన లేఖలోనుంచి

విధానములు అంతిమ దైవ గ్రంథము ఖుర్ఆన్‌లో ప్రత్యేకమైన ఆయత్‌గా (వాక్యముగా) చెప్పగా, ప్రథమ దైవ గ్రంథమైన భగవద్గీతలో అదే విషయమునే జ్ఞానయోగమునందు మొదటి శ్లోకములోనూ మూడవ శ్లోకములోనూ చెప్పడము జరిగినది. అంతిమ దైవ గ్రంథములో చెప్పినా, అదేమిటో ఆ ఆయత్ యొక్క భావములోని మూడు విధానములేమిటో, ఆ గ్రంథమును చదివినవారికి అర్థము కాలేదు. వారు అర్థము చేసుకొను ప్రయత్నము కూడా చేయలేదు. అంతిమ దైవ గ్రంథమని పేరుగాంచిన ఖుర్ఆన్‌లో అక్కడక్కడ ఎంతో గొప్ప జ్ఞానముండగా, వాటన్నిటిని ఏమాత్రము అర్థము చేసుకోకుండా, కేవలము అల్లాహ్‌ను (దేవున్ని) విశ్వసించడము, నమాజ్ అను పేరుతో ప్రార్థనలు చేయడము తుచ తప్పక చేయుచున్నారు. గ్రంథములో చెప్పిన జ్ఞానమును తెలియకుండ దేవున్ని ఆరాధించితే గమ్యము తెలియని ప్రయాణములాగ ఉంటుంది. ఒకవేళ దేవుడిచ్చిన గ్రంథములోని జ్ఞానమును సంపూర్ణముగా తెలిసి, గ్రంథములో చెప్పినట్లు దేవున్ని ఆరాధించితే అది గమ్యము తెలిసిన ప్రయాణములాగ ఉంటుంది. దేవుడు తన జ్ఞానమును భూమిమీద మూడు విధముల బోధిస్తానని, తాను నేరుగా (ప్రత్యక్షముగా) ఎవరితోనూ మాట్లాడననీ ఖుర్ఆన్ గ్రంథములో 42వ సూరా, 51వ ఆయత్‌నందు ప్రత్యేకముగా చెప్పాడు. దేవుడు అంతగా చెప్పితే నేడు ముస్లీమ్ సమాజమునకు దేవుడు ప్రత్యక్షముగా ఎవరితోనూ మాట్లాడడు అను విషయమొక్కటి అర్థమైనది. అంతతప్ప అక్కడే చెప్పిన మూడు విధానములలో సక్రమముగా ఒక్క విధానము కూడా అర్థము కాలేదని చెప్పవచ్చును.

హిందువుల (ఇందువుల) విషయానికివస్తే ప్రత్యక్షముగా భగవంతుడు చెప్పిన భగవద్గీతే అర్థముకాని స్థితిలో ఉండిపోయారు.

ముస్లీమ్‌లకు వారి గ్రంథము ఖుర్‌ఆన్ అను నమ్మకముతో మా గ్రంథము ఖుర్‌ఆన్ అని చెప్పుచున్నారు. హిందువులకు తమకు దేవుడిచ్చిన గ్రంథమేదో కూడా తెలియని స్థితిలోవుండి తమ గ్రంథము భగవద్గీత అని చెప్పలేక పోవుచున్నారు. చాలామంది హిందువులు తమ గ్రంథములు వేదములని చెప్పుచున్నారు. దేవుడు సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానము, సూర్యుని చేత మనువునకు చెప్పబడిన జ్ఞానము, మొట్టమొదట గ్రంథరూపమైన దైవ జ్ఞానము భగవద్గీతయని తెలియని స్థితిలో ఉన్నారు. భగవద్గీత తమ గ్రంథమని తెలియనివారు, భగవద్గీతను ఇంతవరకు చూడనివారు, భగవద్గీతలో చెప్పిన జ్ఞానము తెలియని స్థితిలోవున్న వారికి దేవుడు తన జ్ఞానమును మూడు విధములుగా బోధించునను విషయమెలా తెలుస్తుంది. అందువలన దేవుడు చెప్పిన మూడు విధానములలో కనీసము ఒక్క విధానము కూడా తెలియకుండా పోయినది. అసలైన అల్లాహ్‌ను (దేవున్ని) తప్ప మేము ఎవరినీ ఆరాధించలేదు అను ముస్లీమ్‌లకుగానీ, పూర్వము జ్ఞానమార్గములో ఘనచరిత్ర కల్గి నేడు దేవుడెవరో, తమ గ్రంథమేదో తెలియని స్థితిలోగల హిందువులకుగానీ, దేవుని జ్ఞానము భూమిమీద ఎలా తెలియబడుతుందో, దానిని గురించి దేవుడు ఏమి చెప్పాడో తెలియకుండా పోయినది.

భూమిమీద అనేక దేశములు, ఆ దేశములలో అనేక ప్రాంతములు గలవు. ఒక్కొక్క ప్రాంతములో గల మనుషులు ఒక్కొక్క సమాజముగా ఏర్పడి వారికి అనుకూలమైన జీవన విధానములకు అలవాటుపడి యుందురు. అలాగే భక్తి విధానములో కూడా ఏదో ఒక పద్ధతిని అలవాటు చేసుకొని దాని ప్రకారము వారి ఆరాధనలు (పూజలు) చేయుచుందురు. కొన్ని సమాజముల వారు ప్రకృతిని ఆరాధించుచుండగా, కొన్ని సమాజముల

వారు ప్రకృతిలోని జంతువులను ఆరాధించుచుందురు. కొన్ని సమాజముల వారు గ్రామదేవతలను, కొన్ని సమాజములవారు క్షుద్రదేవతలను, కొన్ని సమాజములవారు మహా దేవతలనూ ఆరాధించుచుందురు. కొందరు ఆ ప్రాంతమునకు పెద్దగాయున్న వ్యక్తినే ఆరాధించడము గలదు. కొందరు తమకు గురువుగాయున్న వ్యక్తిని ఆరాధించడము కలదు. ఈ విధముగా లెక్కలేనన్ని ఆరాధనలు, లెక్కలేనన్ని దేవతలు గలరని చెప్పవచ్చును. అనేక ప్రాంతములలో ఇంతమంది ఆరాధించు ఆరాధనలలో ఏవి సరియైనవి, ఏవి సరియైనవికాదు అని ఆలోచిస్తే, బుద్ధికి ఒక సమాధానము అందు చున్నది. బుద్ధికి జవాబు అందించువాడు ఆత్మయే కనుక, ఆయనకు తెలియనిది ఏదీలేదు కనుక, ఆ సమాధానమే సరియైనదని భావించు చున్నాము. ఆత్మ అందించిన సూచన ప్రకారము దేవుడు మూడు విధానముల ప్రకారము అందించిన జ్ఞానమే సరియైనదనీ, ఆ మూడు విధానముల జ్ఞానములో లేని ఆరాధనలు, ఆచరణలు అన్నియు వ్యర్థమని తెలియుచున్నది.

ఇంత ప్రపంచములో దాదాపు 194 దేశములలో గల అనేక ఆరాధన ఆచారములను, దేవుడు చెప్పిన మూడు విధానములతో పోల్చి చూచి, దానికి సరిపోయినవన్నీ సక్రమమైనవనీ, ఆ మూడు విధానములకు సరిపోనివన్నీ సక్రమమైనవికావని తెలియవచ్చును. ఆ విధముగా లెక్కించి చూచిన సక్రమమైన దేవుని జ్ఞానము కలవి నేడు భూమిమీదున్న మూడు మతములని చెప్పవచ్చును. వాస్తవముగా మూడు మతములుగా చెప్పబడు వాటిలో దేవుడు చెప్పిన మూడు విధానములకు సంబంధించిన జ్ఞానము కలదు. ఆ మతములలోనున్న జ్ఞానము ప్రకారమైతే వాటికి మతములని పేరు పెట్టకూడదు. అయినా అక్కడ కూడా కొంత అజ్ఞానము ఏర్పడడము

వలన మతములని పిలువబడుచున్నవి. వారు పెట్టుకొన్న మతములను పేరుతో చెప్పితే, దేవుని జ్ఞానము హిందూమతమునకు సంబంధించిన భగవద్గీతలో, క్రైస్తవులకు సంబంధించిన బైబిలు గ్రంథములో, అలాగే ముస్లీమ్‌లకు సంబంధించిన ఖుర్‌ఆన్ గ్రంథములో కలదని చెప్పవచ్చును.

మనుషులు కొంత అజ్ఞానముతో మతములని పేరు పెట్టుకొనినా, మా మత గ్రంథమువేరని చెప్పుకొనినా, మూడు మత గ్రంథములలో ఒకే దేవుని జ్ఞానము కలదు. గ్రంథములోనున్న వాక్యములకు అర్థములు, భావములు మనుషులు వేరువేరుగా చెప్పుకొనినా, వాస్తవముగా ఒక వాక్యమునకు అర్థము ఒకే విధముగా ఒకే జ్ఞానముతో ముడిపడియున్నది. మనిషి మెదడు దేవుని జ్ఞానమును అర్థము చేసుకోలేని స్థితిలోవుండి తప్పు భావముతో అర్థము చేసుకొనినా, ఒక వాక్యము అన్ని గ్రంథములలో ఒకే అర్థమునిచ్చునదై, ఒకే జ్ఞానమును సూచించునదై ఉండును. ఏ మనిషి అయినా తన మత గ్రంథమైన భగవద్గీతనుగానీ, బైబిలు గ్రంథమును గానీ, ఖుర్‌ఆన్ గ్రంథమునుగానీ చదివితే మిగతా రెండు గ్రంథములలోని సమాచారము అర్థమైపోవును. ఒక మనిషి హిందువైతే భగవద్గీతను అసలైన అర్థముతో, అసలైన భావముతో చదువగలిగితే మిగతా బైబిలు, ఖుర్‌ఆన్ గ్రంథములలోని సారాంశమంతయు తెలిసిపోవును. దేవుడు చెప్పిన ఒకే జ్ఞానమే మూడు గ్రంథములలో ఉండుట వలన, ఒక గ్రంథమును చదివితే మిగత రెండు గ్రంథముల సారాంశము తెలిసిపోవును. నేను స్వయముగా మూడు గ్రంథములను చదివి చూచాను. అందువలన వాటిని గురించి చెప్పగలుగుచున్నాను. వాస్తవముగ చెప్పితే ఈ గ్రంథములలో ఒక మంత్ర జాలమున్నదని చెప్పవచ్చును. వీటిలోని మ్యాజిక్ బహుశ ఎవరికీ అర్థము అయివుండదు. ఎందుకనగా ఒకే దృష్టితో మూడు గ్రంథములను ఎవరూ

చదవరు. ఎవరైనాగానీ మూడు మత గ్రంథములను చదివినవారున్నా వారు ముందు వారి మత గ్రంథమును చదివిన తర్వాత మిగత మత గ్రంథములను చదవడము జరిగియుండును. ఎవరైనాగానీ ముందు చదివిన గ్రంథము మీద ఒక నిర్ణయానికి వచ్చియుందురు. ముందు తమ గ్రంథమును చదివియుండుట వలన తమ గ్రంథమును మించిన గ్రంథము ఉండదను నిర్ణయము కల్గియుందురు. అందువలన తర్వాత చదివే గ్రంథముల మీద ఒకే దృష్టి ఉండదు. తర్వాత చదివిన గ్రంథము మొదట తాను చదివిన దానికంటే గొప్పగాయుండినా, ఆ గొప్పతనమును మనిషి గ్రహించక ముందు చదివినదే గొప్పదనుకొనుచుండును. అందువలన వీటిలో ఏది ఎంత అని గుర్తించలేని మంత్రజాలమున్నదని చెప్పవచ్చును.

నేను ఇందువుగా (హిందువుగా) పుట్టాను. అందువలన మొదట భగవద్గీతను చదవడము జరిగినది. జ్ఞానమంటే ఏమిటో తెలియని నేను ఒక్కమారు భగవద్గీతను చదివిన తర్వాత అందులో కేవలము పదిశాతము మాత్రము అర్థమైనది. మిగత తొంభైశాతము అర్థము కాలేదు. పూర్తి అర్థము కాలేదని తెలిసి అర్థము కాని దానిని గురించి మిగతా పెద్దలైన జ్ఞానులను, స్వాములను అడగడము జరిగినది. అప్పుడు వారు చెప్పిన వివరముగానీ, సమాధానముగానీ వినిన తర్వాత అప్పుడు అర్థమైనది. భగవద్గీత నాకే కాదు, నాకంటే గొప్పవారైన స్వాములకు, జ్ఞానులకు కూడా అర్థము కాలేదని తెలిసిపోయినది. సాధారణ మనిషినైన నాకు పది శాతమైనా అర్థమైనది. నాకంటే గొప్పగ కనిపించు వారికిగానీ, పెద్ద జ్ఞానులని పేరుగాంచిన వారికిగానీ కేవలము పదిశాతము కూడా అర్థము కాలేదని తెలిసి నేను ఆశ్చర్యపోయాను. ఎంతోమంది స్వాములని పేరు పెట్టుకొని గురువులుగాయుండి గీతను బోధించువారికే కేవలము రెండు

శాతము కూడా తెలియనప్పుడు, వారివద్ద విని తెలుసుకొనే వారికి దానికంటే గొప్పగా తెలియుటకు అవకాశము లేదనిపించినది. నేను మొదట ఎందరి నడిగినా తిరిగి ప్రశ్నరాని సమాధానము దొరకలేదు. ఎవరు చెప్పినా అందులో చివరకు ప్రశ్న మిగిలిపోయి జవాబు దొరికేది కాదు. అప్పుడు అంతవరకు నాకు అర్థమైన పదిశాతము భగవద్గీత ప్రకారము శరీరము లోపల శరీరమునకు అధిపతిగాయున్నవాడే నిజమైన సమాధానము చెప్పగలడని ప్రతి ప్రశ్నను లోపలికి అడిగేవాడిని. నా మెదడులో వచ్చిన సంశయమునకు అక్కడే జవాబు దొరికేది. అయితే ఇప్పుడు అడిగిన ప్రశ్నకు వెంటనే జవాబు దొరికేది కాదు. తర్వాత ఎప్పుడో దొరికేది లోపలయున్న ఆత్మ నా ప్రశ్నకు జవాబు అందించినట్లు కాకుండా, ఆ జవాబు స్వయముగా నాకే వచ్చిందనిపించేది. మొదట భగవద్గీతలో నాకు అర్థమైన పదిశాతము జ్ఞానము వలన వచ్చిన జవాబు ఆత్మ అందించినదైనా, ఆత్మ బయట పడక జవాబు నాకే వచ్చినట్లు నన్ను ఆత్మే భ్రమింపజేయు చున్నదని తెలిసిపోయినది. అప్పటినుండి ఆత్మ అందించిన ప్రతి విషయమును జాగ్రత్తగా ఎరుకతో గమనించేవాడిని.

అప్పటినుండి అసలైన ఆధ్యాత్మికమంటే ఏమిటో తెలిసిపోయినది. నేనున్న శరీరములోని ఆత్మ కూడా నన్ను మభ్యపెట్టక అన్ని ఆత్మే తెలియ జేయునట్లు అర్థమయ్యేది. ఆ తర్వాత భగవద్గీత నూరుశాతము అర్థమైనది. ఇదంతా ఎందుకు చెప్పుచున్నానంటే, ఆత్మ తన ఉనికిని ఎవరూ గుర్తు పట్టనట్లు అందరినీ మోసము చేయగలదు. అందువలన మీరు కూడా ఆత్మ విషయములో మోసపోకుండుటకు చెప్పుచున్నాను. భగవద్గీతను ఆత్మ వలన పూర్తిగా తెలియుటకు కొంత కాలము పట్టినది. నాకు అనుభవమున్నది కావున ఆడవారికి, మగవారికి ఏ గుణములు ఎక్కువ

ప్రభావమున్నవో చెప్పినప్పుడు, ఎవరికీ తెలియని గుణముల విషయములు నీకు ఎలా తెలిసినదని ఇతరులు ప్రశ్నించగా నాకు ఆత్మ ద్వారా తెలిసినదని చెప్పాము. నాకు ఒక్కనికే కాదు, అడిగితే నీకు కూడా చెప్పగలదని అక్కడ చెప్పాను. అందరూ శరీరములో తాము తప్ప వేరెవరూ లేరని అనుకొంటున్నారు. మేమే మాట్లాడుచున్నామని, అంతా మా తెలివేనని అనుకొనుచూ తనను తాను గొప్పగా ఊహించుకోవడము జరుగుచున్నది. అయితే శరీరముగల అందరినీ ఆత్మే నడిపించుచున్నదనీ, శరీరములో అధిపతిగాయున్నది ఆత్మేయనీ, జీవుడైనవాడు కాదని తెలియక, జరిగే పనులన్నిటినీ తానే చేయున్నట్లు మనిషి (జీవుడు) అనుకొని మోసపోవడము జరుగుచున్నది. అందరూ ఎక్కడైతే మోసపోవుచున్నారో, నేను అక్కడ మోసపోవడము లేదు. అందువలన నాకు ఏమీ తెలియదని, తెలుసు కోవాలని నాలో శ్రద్ధ కలిగేకొద్దీ ఆత్మ సవివరముగా తెలిపెడిది. ఆ విధముగా భగవద్గీతను సంపూర్ణముగా తెలియగలిగాను. తర్వాత బైబిలు గ్రంథములోని వివరమును తెలుసుకొన్నాను. ఆ తర్వాత అంతిమ గ్రంథమని పేరుగాంచిన ఖుర్ఆన్ గ్రంథమును గురించి ఆత్మ ద్వారానే తెలియగలిగాను. ఆత్మ తెలిపిన విధానము ప్రకారము హిందువులకు భగవద్గీత, క్రైస్తవులకు బైబిలు గ్రంథము, ముస్లీమ్‌లకు ఖుర్ఆన్ గ్రంథము అర్థము కాలేదని నాకు తెలిసినది. ఇక్కడ నేను చెప్పునది ఆత్మ తెలిపిన విధానము ప్రకారమన్నాను గానీ, వారికి తెలిసిన ప్రకారము తెలియలేదని నేను చెప్పలేదు. హిందువులలో వారి బోధకులు చెప్పినట్లు వారికి అర్థమైనది. అట్లే బైబిలు క్రైస్తవులకు వారి బుద్ధి ప్రకారమూ, వారి బోధకులు చెప్పినట్లు అర్థము కావడము జరిగినది. అదే విధముగా ఇస్లామ్‌ను అనుసరించు ముస్లీమ్‌లకు వారి పెద్దలు చెప్పినట్లు వారు అర్థము చేసుకోగలిగారు. మూడు మతముల

వారు మూడు దైవ గ్రంథములనుండి వారివారి స్థోమతకొద్దీ అర్థము చేసుకొన్నారు. అంతా అర్థముకాకపోయినా కొంతకు కొంతయినా తెలుసుకో గలిగారు. అలా కొంతవరకైనా తెలుసుకోవడము సంతోషించవలసిన విషయమే.

అందరూ వారివారి గ్రంథములను తెలియగలిగినా, వారు తెలిసినది దేవునికి సంబంధించిన జ్ఞానమే అయినా, ఒక మతమువారు మరొక మతములోని గ్రంథమును ఒప్పుకోకపోవడమూ, మిగత గ్రంథముల కంటే మా గ్రంథమే గొప్ప అనియూ, మిగత మతములకంటే మా మతమే గొప్ప అనియూ, మిగత మతములలో చెప్పుకొను దేవునికంటే మా మతములో చెప్పబడిన దేవుడే గొప్ప అనియూ వారి మదిలో అనుకోవడమే కాక, అదే ఉద్దేశ్యమునే బయటికి వ్యక్తపరచుచున్నారు. అలా ఒక మతము వారు మరొక మతమును తక్కువ చేసి మాట్లాడడము జరుగుచున్నది. ఎవరికి వారు మా మతముగొప్ప అనుకోవడము వలన మనుషులలో మత ద్వేషములు మొదలైనవి. మతద్వేషములు చివరకు మత ఘర్షణలుగా తయారైనవి. నేడు ఒక బాంబు ప్రేలుడు జరిగిందంటే దాని వెనుక మత ద్వేషముగానీ, మతములోని మరొక తెగ మీద ద్వేషముగానీ ఉండును. అలాగే నేడు ఒక దేశము మరొక దేశము మీద దాడికి పూనుకోబోతున్న దనినా, లేక దాడిచేసినా దాని వెనుక ముఖ్యముగా మతద్వేషమే ఉండును. అమెరికా క్రైస్తవ దేశమైనందున ముస్లీమ్ దేశముల మీద దాడి చేయడము వెనుక ఏమున్నదో అందరికీ తెలిసిన విషయమే. అలాగే ఒక ముస్లీమ్ దేశము అమెరికా మీద దాడి చేసిందంటే దానికి కారణము ఏమిటో అది కూడా తెలిసిన విషయమే. అన్ని మత గ్రంథములు ఒకే దేవున్ని గురించి చెప్పినప్పుడు, అన్ని మతముల మనుషులను ఒకే దేవుడు సృష్ఠించినప్పుడు

వారి మధ్యలో ఘర్షణలు, ద్వేషములు ఎందుకు వస్తున్నవని ఆలోచించి చూస్తే, వారికి వారి వారి గ్రంథములనుండి వేరువేరు భావములు అర్థమైనవని తెలియుచున్నది. అలా వారికి వేరు వేరు విధములుగా పరస్పర విరుద్ధముగా ఎందుకర్థమైనదని చూస్తే మనుషులు స్వంతముగా అర్థము చేసుకోవడము వలన వారి గుణములనుబట్టి, వారివారి భావములనుబట్టి వారికి వేరువేరుగా అర్థమైనందున అలా ద్వేషములు ఏర్పడినవని చెప్పవచ్చును.

నేను మొదట భగవద్గీతను, తర్వాత బైబిలు, ఖుర్ఆన్ చదివానని చెప్పాను కదా! నేను చదివినప్పటికీ మొదట భగవద్గీతనుండి చివరి ఖుర్ ఆన్ వరకు ఎన్నో ప్రశ్నలను ప్రశ్నించి ఆత్మ అందించిన జవాబును తీసు కోవడము వలన మూడు గ్రంథములు సులభముగా అర్థమైనవి. అయితే అందరికీ అర్థమైనట్లు కాకుండా, మూడు గ్రంథములు ఒకే దేవున్ని గురించి చెప్పినవిగా అర్థమైనది. మూడు గ్రంథములు సర్వ మానవులకు సంబంధించి నవిగా అర్థమైనవి. ఒక గ్రంథములోని జ్ఞాన వాక్యములు మరొక గ్రంథములోని వాక్యములను సమర్థించుచూ ఒకదానికొకటి ధృవీకరించు కొనునట్లు తెలిసిపోయినది. ఒకే కుటుంబములోని వారు ఒకరి పోలికలు మరొకరు కల్గియున్నట్లు, మూడు గ్రంథములలోని విషయములు ఒకదాని కొకటి విరుద్ధముగా లేకుండా, ఒక దానికొకటి దగ్గరి పోలికలు కల్గియున్నట్లు తెలిసినది. ఒక గ్రంథములోని ప్రశ్నకు నేను జవాబిస్తానన్నట్లు మరొక గ్రంథములో జవాబు దొరుకుచూ, మూడు గ్రంథములు ఒకదానికొకటి సాక్ష్యముగాయున్నట్లు తెలిసిపోయినది. మూడు గ్రంథములలో మతము అను పదమే లేదు. ఇది ఫలానా మతగ్రంథమని చెప్పుటకు వీలే లేదు. మూడు గ్రంథములు అందరినీ సృష్టించిన, అందరికీ అధిపతియైన ఒకే

దేవున్ని గురించి చెప్పుచున్నవి తప్ప ఏమాత్రము వేరుగా లేవు. ప్రాంతమును బట్టి, ప్రాంతీయ భాషనుబట్టి వేర్వేరు దేశములలో చెప్పబడిన మూడు గ్రంథములు, వేరువేరు భాషలలో చెప్పబడినవి. భాషలు వేరైనా మూడు గ్రంథములలోని సూత్రములు, ధర్మములు అన్నియూ ఒకే భావముతో కూడుకొనియున్నవి. భగవద్గీత భారతదేశములో ద్వాపరయుగ అంత్య మందు, ఇప్పటికి దాదాపు 5000 సంవత్సరముల పూర్వము ఆనాడు ఉత్తర భారతదేశమునందు అమలులోయున్న హిందీ భాషలో కృష్ణుని చేత అర్జునునకు చెప్పబడినది. అలా హిందీలో చెప్పిన జ్ఞానమును అర్జునుడు వ్యాసునికి తెలుపగా, వ్యాసుడు తాను వినిన జ్ఞానమునకు భగవద్గీతయని పేరుపెట్టి సంస్కృత భాషలో వ్రాశాడు. కాగితము కలము లేని ఆ రోజులలో చినిగిపోని తాటి ఆకులమీద మొనతేలిన ఇనుప కడ్డీతో వ్రాయడము జరిగినది. ఆ విధముగా కృష్ణుడు చెప్పిన జ్ఞానము గ్రంథరూపముగా మారిపోయినది. శ్రీకృష్ణుడు హిందీలో చెప్పితే, సంస్కృతములో వ్రాయబడి దేవుని జ్ఞానము మొట్టమొదట గ్రంథరూపమైనది. అన్నిటికంటే ముందు గ్రంథరూపమైన దైవజ్ఞానమునకు వ్యాసుడే భగవద్గీతయని పేరు పెట్టాడు. అందువలన **"ప్రథమ దైవ గ్రంథము భగవద్గీత"** అని చెప్పబడినది.

భగవద్గీతగా వ్రాయబడిన తాటి ఆకులను పురుగులు తినివేయ కుండా, ఆకులు శిథిలము కాకుండా మృదువుగా ఉండుటకు క్రిమి సంహారిణిగా పనిచేయు పసుపును ఆముదములో కలిపి ఆకులకు పూసి పెట్టెడివారు. ఆ విధముగా ఆముదము పసుపుతోనున్న తాటి ఆకులు వెయ్యి నుండి పదిహేనువందల సంవత్సరముల వరకు ఉండగలవు. తర్వాత వాటిని క్రొత్త ఆకులమీద వ్రాసి పసుపు నూనె పూసి ఉంచవలసియుండును. ఇప్పటికి ఐదువేల సంవత్సరములకు ముందు వ్యాసుని చేత వ్రాయబడిన

భగవద్గీత కాలక్రమమున పూర్తి శిథిలము కాకుండా ఉండుటకు రెండు లేక మూడుమార్లు ఇతరుల చేత తాటి ఆకులమీద వ్రాయబడినది. ఆ విధముగా ఐదువేల సంవత్సరముల వరకు చెక్కుచెదరకయున్న భగవద్గీతను తర్వాత కాగితము మీద వ్రాయబడి అచ్చువేయబడినది. సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానము కృష్ణుని చేత అర్జుననకు ఐదువేల సంవత్సరముల పూర్వము చెప్పగా అదియే మొదటి దైవగ్రంథముగా వ్యాసునిచేత సంస్కృతములో రచించబడి మన వరకు వచ్చినది. భగవద్గీత మూల రచన సంస్కృత భాషలో శ్లోకముల రూపముగాయుండినా, సంస్కృత భాష తెలిసిన వారు దానిని ఇతర భాషలలో అనువదించి వ్రాసుకోగా, అన్ని ప్రాంతములవారు అన్ని భాషల వారూ నేడు భగవద్గీతను చదువగల్గుచున్నారు. ఈ విధముగా ప్రథమ దైవ గ్రంథము మన వరకు వచ్చినది.

ప్రథమ దైవ గ్రంథముగా భగవద్గీత తయారైన తర్వాత దాదాపు మూడువేల సంవత్సరములకు రెండవ దైవ గ్రంథమైన బైబిలు తయారైనది. బైబిలు గ్రంథమునకు రెండవ దైవ గ్రంథముగా ఎందుకు పేరు వచ్చినది తర్వాత వివరించుకొందాము. బైబిలు గురించి నాకు తెలిసినంతవరకు చెప్పుకొంటే నేడు బైబిలు గ్రంథము దాదాపు 1400 భాషలలో వ్రాయబడి నది. పదునాలుగు వందల ప్రాంతీయ భాషలలో వ్రాయబడివుండడము వలన నేడు ప్రతి భాషలోను బైబిలును చదువవచ్చును. మొదట హెబ్రీ గ్రీకు భాషలో వ్రాయబడిన బైబిలు నేడు ప్రపంచములోనే అత్యధిక భాషలలో తర్జుమా చేసి వ్రాయబడిన గ్రంథముగా ఉన్నది. నేడు మనముందున్న బైబిలు 66 భాగములుగా ఉంటూ, ఒక్కొక్క భాగము ఒక్కొక్క పేరుతో పిలువబడుచున్నది. వాటినే అరవై ఆరు సువార్తలుగా, అరవై ఆరు పాఠములుగా క్రైస్తవులు చెప్పుకొంటున్నారు. అరవై ఆరు భాగములుగా

యున్న బైబిలును 39 భాగములు పాత నిబంధన అనియూ, 27 భాగములను క్రొత్త నిబంధన అనియూ రెండు పేర్లతో వ్రాసియుంచారు. నేడు క్రైస్తవ మతముగా చెప్పుకొనువారందరికీ అరవై ఆరు భాగములుగాయున్న బైబిలు మార్గదర్శకముగా ఉన్నది. నేడు బైబిలును కంఠాపాఠముచేసి వరుసగా నోటికి చెప్పు జ్ఞాపకశక్తి కలవారున్నప్పటికీ, వారిలో జ్ఞానశక్తి మాత్రము రవ్వంత కూడా లేదనియే చెప్పవచ్చును. ఈ మాటను నేను మత ద్వేషముతో గానీ, అసూయతోగానీ చెప్పడములేదు. అంతగా శ్రమించి గ్రంథము నంతటినీ కంఠాపాఠముగా చెప్పినా, వారికి దేవునినుండి రవ్వంత కూడా దైవికమైన లాభము ఏమీలేదు. అలా ఎందుకైనదని అడిగితే, వారికి బైబిలు గ్రంథములో దేవుడు చెప్పినది ఏదో, మనుషులు చెప్పినది ఏదో తెలియ కుండా పోవడమే ముఖ్యకారణమంటున్నాను.

ఇక్కడ మీరు మరొక ప్రశ్నను అడుగవచ్చును. ప్రశ్న ఏమనగా! ఇంతకుముందు బైబిలు పేరు వ్రాసినప్పుడు మీరే బైబిలును రెండవ దైవ గ్రంథమని చెప్పారు. ఆ మాటను వ్రాసిన కొద్దిసేపటికే బైబిలులో దేవుడు చెప్పినదేదో, మనుషులు చెప్పినదేదో చదివేవారికి తెలియదని అంటున్నారు. దైవ గ్రంథమని చెప్పినప్పుడు దేవుడు చెప్పినదే ఉంటుందిగానీ, మనుషులు చెప్పినది ఎలా ఉంటుంది? ఒకవేళ మనుషులు చెప్పిన విషయములు ఉంటే మీరెందుకు దానిని రెండవ దైవ గ్రంథమన్నారు? అని ప్రశ్నించ వచ్చును. ఈ ప్రశ్న సమంజసమైనదే, దేవుడు చెప్పిన జ్ఞానము ముందు గ్రంథ రూపమైన దానివలన భగవద్గీతను ప్రథమ దైవగ్రంథము అని అన్నాము. మొదట దేవుడు భగవంతుని రూపముతో, శ్రీకృష్ణుడను పేరుతో కనిపించే మనిషిగా వచ్చి భారతదేశములో తన జ్ఞానము చెప్పడము జరిగినది. సృష్ట్యాదియందు వాణి ద్వారా దేవుడు చెప్పిన జ్ఞానమును

సూర్యుడు వినడము జరిగినది కదా! దానివలన ప్రపంచములో సూర్యుడు మొదట దైవ జ్ఞానమును తెలిసినవాడయ్యాడు. ప్రపంచములో మొదటి జ్ఞాని అయిన సూర్యుడు భూమిమీదగల భారతదేశములోని మనువుకు జ్ఞానమును చెప్పి ప్రపంచమునకంతటికి సూర్యుడు ఆది గురువైనాడు. మొదటి జ్ఞాని అనియూ, ఆది గురువు అనియూ సూర్యునికి పేరు రావడము జరిగినది. తర్వాత ప్రపంచములో ఎవరు జ్ఞాని అయినా, ఎవరు గురువు అయినా, వారికి సూర్యుని తర్వాత స్థానము దక్కినదని చెప్పవచ్చును. జ్ఞానములోనూ, గురుత్వములోనూ మొదటి స్థానము సూర్యునికి దక్కినది. ఎక్కడైతే సూర్య గ్రహము తెరచాటునుండి కనిపించక మనువుకు జ్ఞానమును చెప్పినదో, అక్కడే దేవుని దూతవలె వచ్చిన కృష్ణుడు దేవుని సమాచారమైన దైవ ధర్మములను అర్జునునికి బోధించి, రచనా సామర్థ్యముగల వ్యాసునికి అర్జునుని ద్వారా తన జ్ఞానమును చేరునట్లు చేశాడు.

మేము బైబిలును గురించి అడిగితే భగవద్గీతను గురించి చెప్పుచున్నా డేమిటి? అని అనుకోవద్దండి. బైబిలు గురించి చెప్పవలసిన జవాబు కొరకు భగవద్గీతనుండి మొదలు పెట్టవలసియున్నది. అందువలన ఇప్పుడు చెప్పు సమాచారమును జాగ్రత్తగా వినండి. అర్జునుని ద్వారా కృష్ణుడు చెప్పిన సమాచారమంతయూ వినిన తర్వాత అర్జునునికంటే బాగా వ్యాసునికి కృష్ణుడు చెప్పిన సమాచారమంతయు అర్థమైనది. అప్పుడు వెంటనే ఆ సమాచారమునంతటిని గ్రంథరూపములో వ్రాసియుంచాలనుకొన్నాడు. అంతకు ముందే నాలుగు వేదములనూ, పదునెనిమిది పురాణములనూ గ్రంథములుగా వ్రాసిన వ్యాసుడు, మాయ జ్ఞానమునకు చిహ్నాముగానున్న వాటిని వ్రాసి చెడు కార్యమును చేశానని కృష్ణుని సమాచారము తెలుసుకొన్న తర్వాత చింతించాడు. ఇప్పుడు కృష్ణుడు చెప్పిన సమాచారమును

భగవద్గీతగా వ్రాసి కొంతయినా మంచి కార్యమును చేయాలనుకొన్నాడు. వెంటనే తనకు తెలిసిన సమాచార జ్ఞానమును భగవద్గీతయను పేరుతో భద్రపరిచాడు. ఆ విధముగా సృష్ట్యాదిలో సూర్యునికి బోధించిన జ్ఞానము, తర్వాత శ్రీకృష్ణభగవాన్ ద్వారా చెప్పిన జ్ఞానము ప్రథమ దైవ గ్రంథముగా తయారైనది. ఆ విధముగా తయారైన తాటి ఆకుల గ్రంథము కాలక్రమమున శిథిలము కాకుండా ఉండుటకు ఇతరుల చేత తిరిగి రెండు మూడుమార్లు ఎత్తి వ్రాయబడినది.

మొదట వ్యాసుడు వ్రాసిన సమయములో కృష్ణుడు చెప్పిన సమాచారమును మాత్రము భగవద్గీతా గ్రంథముగా వ్యాసుడు వ్రాసి పెట్టగా, అది పూర్తి దైవ గ్రంథముగా ఉండేది. తర్వాత దానిని తిరిగి వ్రాసినవారు వారికి అనుకూలమైన కొంత సమాచారమును అందులో తెలివిగా ఇరికించి వ్రాయడము జరిగినది. ఆ విధముగా భగవద్గీతలోనికి మనుషుల సమాచారము కొన్ని శ్లోకముల రూపములో చేరిపోయినది. ఆ దినము తమ ఉద్దేశ్యమును శ్లోకముల రూపములో ఎవరూ గుర్తించనట్లు తెలివిగా కొందరు భగవద్గీతలో చేర్చడము వలన, ఆ దినము వ్యాసుడు వ్రాసిన భగవద్గీత స్వచ్ఛమైన దేవుని జ్ఞానముతో నిండియుండెడిది. నేడు మనముందరున్న భగవద్గీత కొంత మానవ కాలుష్యముతో కూడుకొని ఉన్నదని చెప్పవచ్చును. దేవుడు చెప్పిన జ్ఞానమునకు పదిశాతము మానవుల కల్పిత జ్ఞానము భగవద్గీతలో కలదు. అటువంటి భగవద్గీతను కొందరు చదవడము జరిగినది, జరుగుచున్నది. అయితే మాయా ప్రభావము వలన భగవద్గీతలో దేవుడు చెప్పిన తొంభై శాతము జ్ఞానమును వదలి పది శాతమున్న మనుషులు చెప్పిన మాటలవైపు ప్రజలు పోవడము జరుగు చున్నది. దేవుడు చెప్పిన జ్ఞానము ఎంతో స్వచ్ఛముగాయున్నా, దానిని

గ్రహించలేని మనుషులు కల్పిత జ్ఞానమును గ్రహించుకొంటున్నారు. దీనిని బట్టి భగవద్గీతలో కలిసిపోయిన మానవ కల్పిత శ్లోకములను కనుగొనలేక అందరూ పొరబడుచున్నారని తెలియుచున్నది.

ఈ విధముగా ఏనాడో భగవద్గీతలో మానవ వాసన చేరిపోయినా, చదివేవారు మానవులే అయినందున తమ వాసనను తాము గుర్తించలేక భగవద్గీతలోయున్నదంతా దైవజ్ఞానమే అనుకొన్నారు. మానవజాతి కల్పితములు జనమేజయుని కాలములోనే, వ్యాసుడు చనిపోయిన కొద్ది కాలమునకే భగవద్గీతలో కలిసిపోయినవి. అయినా వాటిని ఇంతవరకు ఎవరూ గుర్తించలేదని చెప్పవచ్చును. ఇక్కడ ఒక్క ఉదాహరణను చెప్పు చున్నాము చూడండి. ఒక ఊరిలో ఇద్దరు దొంగలు తాము దొంగతనము చేయుటకు అనుకూలముగావున్న ఇల్లును చూచుకొన్నారు. ఒక వారము నుండి ఆ ఊరిలో తిష్టవేసిన దొంగలు తాము దొంగతనము చేయాలనుకొన్న ఇంటివారు ధనికులో కాదో, ఆ ఇంటివారు బీదవారైతే తాము కష్టపడి రాత్రి పూట దొంగతనము చేయుటకు ఇంటిలో ప్రవేశించినా ఏమీ ప్రయోజనము ఉండదని ఆలోచించి, ఆ ఇంటివారు ఎంతవరకు ఆర్థిక స్థోమత కల్గియున్న వారో తెలియుటకు, ఆ ఇంటి యజమానితో ఒకమారు హోటల్‌లో కలిసి, మాటల పరిచయము ఏర్పరచుకొని, అందరూ అల్పాహారముగా పూరి, దోసె తినడము జరిగినది. అప్పుడు కొంత పరిచయమైన ఇంటి యజమాని తాము తినిన దానికి కూడా హోటల్ బిల్లు కట్టితే, అతను ఆర్థిక స్థోమత కల్గియున్నాడని, బిల్లు కట్టలేక తమ చేత కట్టిస్తే ఆర్థికస్థోమత లేనివానిగా లెక్కించవచ్చుననుకొన్నారు. వారు టిఫిన్ తిన్న తరువాత కొద్దిపాటి పరిచయమునకే ఇంటి యజమానే బిల్లు కట్టడము జరిగినది. దానితో ఇంటి యజమాని ధనికుడేనని దొంగలు

గ్రహించగలిగి ఒక వారము తర్వాత ఆ యజమాని ఇంటికి దొంగతనము చేయుటకు వచ్చారు. ఆ వారము లోపల రెండు మూడుమార్లు ఆ యజమానితో కలిసి మాట్లాడడము జరిగినది. అయినా ఇంటి యజమానికి వారు దొంగలని ఎలా తెలియగలదు. అందువలన వారిని సర్వసాధారణ వ్యక్తులుగానే తలచాడు. వారు మూడుమార్లు తనతో కలిసి మాట్లాడినా, వారిని దొంగలని గ్రహించ లేకపోయాడు. తన సాటి మనుషులనుకొని మభ్యపడిపోయాడు. యజమాని మాటలలో అతను ఎంత స్థోమతగల వాడో గ్రహించిన దొంగలు, ఆ ఇంటిలో దొంగతనము చేస్తే లాభసాటిగా ఉంటుందనుకొన్నారు.

ఒక దినము చీకటిగాయున్న రాత్రి ఇద్దరు దొంగలు తాము ముందే చూచుకొన్న ఇంటిలో దొంగిలించుటకు బయలుదేరి ఇంటి సమీపములోనికి వచ్చారు. అప్పుడు రాత్రి ఒంటిగంట సమయములో ఆ ఇంటిలోని వారందరూ పూర్తిగా గాఢనిద్రలో ఉన్నారు. ఇతరులు తట్టిలేపినా లేచే స్థితిలో లేరు. అటువంటి సమయములో ఇంటి సమీపములోనికి వచ్చిన వారిద్దరిని ఆ ఇంటి కుక్క చూచింది. కుక్క కంటితో చూడడమేకాక, తనకున్న సహజశక్తి అయిన ఘ్రాణశక్తితో గ్రహించుటకు ముక్కుతో వారినుండి వచ్చు వాసనను పసికట్టింది. గాలిలో కలిసిన ఇద్దరు దొంగల వాసనను కుక్క ముక్కుద్వారా గ్రహించి వెంటనే మొరగను మొదలు పెట్టింది. కుక్క మొరగడమును గమనించి ఇద్దరు దొంగలు కుక్క దృష్టిలో పడకుండ కొంత వెనక్కి రాగలిగారు. తర్వాత కొద్దిసేపటికి తిరిగి ప్రయత్నము చేయుచూ ఇంటిని సమీపించారు. అప్పుడు కూడ కుక్క మొరగను ప్రారంభించినది. ఇద్దరు దొంగలు ముందుకు పోకుండా ఇంటికి దూరముగా అక్కడే కూర్చున్నారు. అయినా కుక్క తన మొరుగుడును

ఆపలేదు. కుక్క మొరుగుచున్న శబ్ధమును ఇంటి యజమాని విని పడక మీదినుండి లేచి బయటికి వచ్చాడు. బయటికి వచ్చి కుక్కను సముదాయించినా అది మొరగడము ఆపలేదు. ఇంటి యజమాని మేల్కొని బయటికి వచ్చినది దొంగలు దూరమునుండి చూడగలిగారు. ఇక ఈ దినము దొంగతనము చేయలేమని వెనుతిరిగి పోయారు. మరుసటి దినము బజారులో దొంగలు, ఇంటియజమాని ఒకరికొకరు కలిసి మాట్లాడు కొన్నారు. దొంగలు ముందే పరిచయమున్నా, వారు దొంగలని యజమానికి తెలియదు కాబట్టి, రాత్రి జరిగిన సంఘటనను గురించి దొంగలకు ఇంటి యజమాని చెప్పడము జరిగినది. అలా చెప్పినప్పుడు రాత్రి మా ఇంటికి దొంగలు వచ్చారు. అయినా వారు దొంగతనము చేయలేకపోయారు అని చెప్పాడు. అప్పుడు ఆ మాటవిన్న దొంగలు ఆశ్చర్యపడి, మీ ఇంటికి దొంగలు వచ్చారని మీరెలా చెప్పగలుగుచున్నారని అడిగారు. అప్పుడా యజమాని మా కుక్క మొరుగుడునుబట్టి తెలిసిందని చెప్పాడు. అప్పుడు దొంగలు “కుక్క మరొక కుక్కను చూచయినా మొరుగుతుంది. అంత మాత్రమున దొంగలు వచ్చారని ఎందుకనుకోవాలి” అని అడిగారు. అప్పుడు యజమాని “లేదండీ! మా కుక్క నిజముగా దొంగలను చూచే మొరిగిందని నేను చెప్పగలను. ఎందుకనగా! దొంగలను చూడకపోయినా కుక్క తన ఘ్రాణశక్తి చేత గాలిలోని వాసనను గుర్తించి వచ్చినవారు దొంగలేనని గ్రహించి మొరిగింది. ఖచ్చితముగా వచ్చినవారు దొంగలేనని నేను ఎందుకు చెప్పుచున్నానంటే, కుక్క సాధారణ మనుషులను చూచినప్పుడు ఒక రకము, దొంగలను చూచినప్పుడు ఒక రకము, సాటి కుక్కలను చూచినప్పుడు ఒక రకము, జంతువులను చూచినప్పుడు ఒక రకమూ, పామును చూచినప్పుడు ఒక రకము, దేవున్ని గుర్తు చేసుకొన్నప్పుడు ఒక రకము మొరుగును.

తాను ఎందుకు మొరుగుచున్నది అర్థమగునట్లు ఐదారు రకములుగా కుక్కలు మొరగడము కలదు. అలా మొరగడము వాటికి పుట్టుకతో వచ్చిన విద్య, కుక్కకు వాసనను గ్రహించు ఘ్రాణశక్తి దాని ముక్కులో దేవుడు ఏర్పాటు చేసి పెట్టాడు. అందువలన అవి చూడకున్నా వాసన గ్రహించి మొరగ గలవు. ఈ విషయము మొదట నాకు కూడా తెలియదు. మా ఇంటికి వచ్చిన ఒక మహర్షి చెప్పిన విషయమిది. ఆయన చెప్పిపోయిన తర్వాత కుక్క మొరిగేటప్పుడు వాటి మొరుగుడులోని తేడాను గమనిస్తూ వచ్చాను. ఒక దినము రాత్రి ఒక ముసలికుక్క మొరగుచుండడమును విన్నాను. రాత్రి ఒక గంట తర్వాత ఆ కుక్క మొరగను మొదలుపెట్టినది. అది అలా ఒక అరగంటసేపు మొరగను మొరిగింది. అప్పుడు అది సాధారణముగా మొరగక రెండు శబ్దములతో ఆపి ఆపి మొరిగేది. అది మా ఇంటికి కొద్ది పాటి దూరములో మొరుగుచుండుట వలన ఆ దినము ఆ శబ్దమును బాగా వినగలిగాను. తెల్లవారిన తర్వాత మా ఇంటికి ఏడెనిమిది ఇళ్ళ దూరములోనున్న చిన్న హోటల్‌లో రాత్రి దొంగతనము జరిగినట్లు తెలిసినది. దొంగలు ఇద్దరో ముగ్గురో, లేక ఒకరో తెలియదు కానీ, దొంగలు హోటల్ లోపలికి పోయినప్పుడు గమనించిన కుక్క తిరిగి వారు బయటికి పోవు వరకు అర్థగంటసేపు మొరిగిందని నాకు అర్థమైనది. ఆ హోటల్‌ను రాత్రి పదిగంటలకు మూసివేసి ఉదయము ఆరుగంటలకు తెరుస్తారు. ఆ హోటల్ లోనికి పోయిన మనుషులు దొంగలేనని దానికి ఎలా తెలిసింది అని అనుకొంటే ముక్కుకున్న వాసన గ్రహించుశక్తి ద్వారానే మనిషిలోని ఉద్దేశ్యమును కూడా కుక్క గ్రహించగలదని అర్థమైనది.

కుక్క మొరుగు విషయములో ప్రత్యక్షముగా దొంగల విషయమును చూచాను. అలాగే ఒక దినము రాత్రి చీకటిగాయున్న చోట రెండు కుక్కలు

ప్రత్యేకముగా మొరగడమును చూచాను. అప్పుడు మహర్షి చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి. వెంటనే టార్చిలైటును తీసుకొని కుక్కలు మొరుగుచున్న చీకటి దగ్గరకు పోయి టార్చిలైటువేసి చూచాను. అక్కడొక మగ నాగుపాము పడగెత్తుకొని నిలబడియున్నది. దాని దారికి అడ్డముగా కుక్కలు నిలబడి దానిని ఇటు మనుషుల వైపుకు రాకుండా మొరుగుచుండడమును గ్రహించి కుక్కలను అక్కడనుండి తరిమివేశాను. అప్పుడు పాము వెనుతిరిగి పోయింది. ఈ విధముగా రెండు, మూడు సంఘటనలలో కుక్కలు ప్రత్యేకముగా మొరగడమును చూచాను. అందువలన రాత్రి మా ఇంటివద్ద గల కుక్క మొరిగే విధానమునుబట్టి అది ఖచ్చితముగా దొంగలను పసిగట్టి మొరుగుచున్నదని అర్థము చేసుకొన్నాను" అని అన్నాడు. అంతవరకు దొంగలకు కూడా తెలియని ఆ విషయము ఆ దినము ఆ ఇద్దరు దొంగలు తెలుసుకొని ఇక ఆ ఇంటికి దొంగతనమునకు పోకూడదనుకొన్నారు.

ప్రత్యక్షముగా చూడకున్నా మనుషుల గాలినిబట్టి వీడు మంచివాడా లేక దొంగనా అని గ్రహించగల స్థోమత కుక్కకుయున్నట్లు, ఒక దైవ గ్రంథములోనున్న వాక్యములను చూచినవెంటనే ఇవి దేవుడు చెప్పిన వాక్యములా, లేక మనిషి చెప్పిన వాక్యములా అని గ్రహించు స్థోమత కొందరికుండును. కుక్కకు వాసనతో వీడు ఫలానా అని గ్రహించు శక్తి యున్నట్లు, ప్రథమ దైవ గ్రంథమైన భగవద్గీతను చూచిన వెంటనే అందులో ఈ వాక్యములు మాత్రము దేవుడు చెప్పినవనీ, ఈ వాక్యములు దేవుడు చెప్పిన వాక్యముల వలెనున్నా ఇవి మాత్రము మనుషులు చెప్పినవేనని గ్రహించు స్థోమతను (శక్తిని) ఆత్మ నాకు ఇవ్వడము వలన మనుషుల వలెనున్నప్పటికీ దొంగలను ప్రత్యేకముగా కుక్క గుర్తించినట్లు, నేను మాత్రము భగవద్గీతలో అన్నీ దేవుని వాక్యములవలెనున్నప్పటికీ ఏవి దేవుడు చెప్పిన

వాక్యములు, ఏవి మనుషులు చెప్పిన వాక్యములని గుర్తించగలుగుచున్నాను. అందువలన భగవద్గీతలో కొన్నిచోట్ల మనుషులు కలిపిన శ్లోకములను గుర్తించి ఇవి మనుషులు వ్రాసి చేర్చినవని చెప్పగలిగాను. నేను వ్రాసిన త్రైత సిద్ధాంత భగవద్గీతలో మనుషులు వ్రాసిన కల్పిత శ్లోకములను తీసివేయడము జరిగినది.

మొట్టమొదట గ్రంథరూపమైనది భగవద్గీత. మొదట వ్యాసుడు వ్రాసిన భగవద్గీతలో ఎటువంటి మానవుల వాక్యములులేవు. ప్రథమ దైవ గ్రంథమైన భగవద్గీత ఆనాడు స్వచ్ఛమైన దేవుని వాక్యములతోనే వ్యాసుని చేత వ్రాయబడినది. వ్యాసుడు పోయిన తర్వాత భగవద్గీత శిథిలము కాకుండా తిరిగి వ్రాయడము జరిగినది. ఆ విధముగా రెండు మూడుమార్లు వ్రాయబడిన భగవద్గీత నేడు మనముందరున్నది. మొదట దైవ వాక్యములతో నిండిన భగవద్గీతలో తమ ప్రపంచ స్వార్థము కొరకు కొందరు మనుషులు తమ ఉద్దేశ్యములను దేవుని వాక్యములవలె కనిపించునట్లు శ్లోకముల రూపములో వ్రాసి భగవద్గీతలో కలుపడము జరిగినది. వారు ఎంత తెలివిగా తమ ఉద్దేశ్యములను భగవద్గీతలో కలిపినా అవి నేడు ఆత్మ అందించిన శక్తి వలన మా ముందర బయట పడినాయి. దేవుని మాటల మధ్యన మనుషుల మాటలు ఉండడము ఆత్మకు ఇష్టము లేదు. అందువలన ఎవరూ గుర్తించలేని వాక్యములను చదివిన వెంటనే గుర్తించునట్లు గ్రహించు శక్తిని నాకు ఇవ్వడము జరిగినది. ఆత్మ అందించిన శక్తి వలననే భగవద్గీతలో కల్పిత శ్లోకములను గుర్తించగలిగాను.

నా దృష్టిలో ప్రపంచములో మూడు దైవ గ్రంథములున్నాయని చెప్పాను కదా! అందులో ప్రథమ దైవ గ్రంథముగా వ్రాయబడినది భగవద్గీత కాగా, ద్వితీయ దైవ గ్రంథముగా వ్రాయబడినది బైబిలు. అయితే బైబిలును

మధ్య దైవ గ్రంథమని కూడా అనవచ్చును. చివరిలో అంతిమ దైవ గ్రంథముగా ఖుర్‌ఆన్ ఉండుట వలన ద్వితీయ దైవ గ్రంథమైన బైబిలును మధ్య దైవ గ్రంథమని అనవలసి వచ్చినది. ఇంతకుముందు బైబిలులో మనుషులు చెప్పినదేదో, దేవుడు చెప్పినదేదో తెలియక పోవడము వలన బైబిలు చాలామందికి అర్థము కాలేదని చెప్పాము. భగవద్గీతను గురించి చెప్పాను కదా! భగవద్గీతలో కొద్దిగ మనుషుల వాక్యములు (శ్లోకములు) కలిసియుండగా, బైబిలులో చాలాభాగము మనుషుల మాటలతో, కొద్ది భాగము మాత్రము దేవుని వాక్యములుండడము జరిగినది. ఒక భగవద్గీత లోనేకాక, బైబిలులోను, ఖుర్‌ఆన్ గ్రంథములోనూ మనుషుల వాక్యములు కలిసిపోయి ఏమాత్రము కనుగొనుటకు వీలులేకుండా ఉన్నాయి. అందువలన అందరూ వాటిలోని వాక్యములను దైవ వాక్యములుగానే నమ్ము చున్నారు. భగవద్గీతను వ్రాసిన వ్యాసుడు తాను ఏ తప్పు చేయక దేవుని వాక్యములను మాత్రము భగవద్గీతలో వ్రాయడము జరిగినది. రెండవ దైవ గ్రంథము, అంతిమ దైవ గ్రంథము అలా మొదటనే స్వచ్ఛముగా వ్రాయబడక, మొదటి రచనలోనే (మొదట గ్రంథము తయారైనప్పుడే) మనుషుల మాటలు వాటిలో కలిసిపోవడము జరిగినది. భగవద్గీత వ్యాసుని చేత స్వచ్ఛముగా వ్రాయబడి బయటికి వచ్చిన తర్వాత కొంత కాలమునకు కలుషితముకాగా, మిగత రెండు గ్రంథములను మానవుడు తన ప్రపంచ స్వార్థముతో మొదటనే కలుషితము చేశాడు. అలా కలుషితమైనా అందులో దేవుడు చెప్పిన వాక్యములూ ఉన్నాయి. మనుషులు చెప్పిన వాక్యములూ ఉన్నాయి. మూడు దైవ గ్రంథములలోను దేవుడు చెప్పిన వాక్యములను ఎవరూ తీసివేయలేరు. అందువలన ఆ మూడు గ్రంథములు నేటికినీ దైవ గ్రంథములే.

మనిషి తన ప్రకృతి స్వార్థబుద్ధితో తన వాక్యములను చేర్చినా దేవుని వాక్యములను ముట్టుకొను సాహసము చేయలేకపోయాడు. ఇదంతయు దేవునికి తెలియకుండా ఏమీ జరుగలేదు. ఎందుకనగా దేవునివైపు రావాలను కొనువాడు దేవుని వాక్యములనే విశ్వసిస్తాడు. అలా పూర్తి దేవుని మీద శ్రద్ధలేనివాడు మనుషుల వాక్యములలో చిక్కుకొని ఎప్పటికీ దేవుడంటే ఎవరో అర్థముకాక ఉంటాడు అను ఉద్దేశ్యముతోనే ఆ పని జరిగి యుంటుంది. తనను ఎవరూ గుర్తించలేనట్లు దేవుడుంటాడు అని చెప్పుకొన్నాము కదా! అందువలన దైవగ్రంథములోని ఒక్క అక్షరముగానీ, ఒక పొల్లునుగానీ తీసివేయకూడదని కొందరు చెప్పుకోవడము జరుగు చున్నది. ఇటువంటి వాక్యముల వలన దైవ గ్రంథములోని ఏ దానినీ కాదనలేని స్థితిలో మానవులుండి అన్నిటినీ చదువుట వలన ఏ దానికీ సమాధానము దొరకక మనిషి అయోమయస్థితిలో పడిపోవుచున్నాడు. దైవ గ్రంథములు మూడు మతములవారికీ ఎదురుగానే ఉన్నా వాటిలో దేవుడు చెప్పిన జ్ఞానమేదో, మనిషి చెప్పిన అజ్ఞానమేదో తెలియక, అంతయూ దేవుని జ్ఞానమనుకోవడము వలన ఆ మూడు దైవ గ్రంథములు మూడు మతముల వారికీ అర్థము కాలేదనియే చెప్పవచ్చును.

బైబిలు విషయానికి వస్తే అరవై ఆరు పాఠములలో 39 పాఠముల తర్వాత 40, 41, 42, 43 వరుసగాయున్న నాలుగు పాఠములు మాత్రము దేవుని మాటలతో కూడుకొనియున్నవి. ఈ నాలుగు పాఠములు తప్ప మిగత అరవై రెండు (62) పాఠములలో దేవునికి సంబంధించిన వాక్యములున్నా అవి భగవంతుడు చెప్పినవి కావు. ఏ విధముగా దేవుని దూతగా భగవంతుడైన కృష్ణుడు వచ్చి భగవద్గీతను చెప్పిపోయాడో, ఆ విధముగా ఏసు వచ్చి పోయాడు. భగవద్గీత మహాభారతమను పెద్ద

గ్రంథములో ఇరికించబడియున్నా మహాభారతమును వదలి ఆధ్యాత్మిక ప్రియులు భగవద్గీతను మాత్రము చదువుచుందురు. అలాగే దేవుని సమాచారమును తెచ్చిన దూత (భగవంతుని) మాటలే ముఖ్యమనుకొను వారు ఏసు మాటలున్న మత్తయి, మార్కు, లూకా, యోహాను అనబడు నాలుగు సువార్తలనే చదవాలి. ప్రత్యక్షముగా దేవుని సమాచారమును తీసుకవచ్చినవాడు ఏసు అయినప్పుడు ఆయన చెప్పిన మాటలు కొద్దిపాటి అయినా అవి దేవున్ని చేర్చగలవు. ఏసే దేవుడని కొందరు క్రైస్తవులు అనడము మేము వినియున్నాము. అలా ఏసే దేవుడైనప్పుడు ఆయన మాటలను వినకుండా, ఆయన మాటలకు విలువ ఇవ్వకుండా మనుషులు చెప్పిన మాటలను లేక సువార్తలను ఎందుకు వింటున్నారని ప్రశ్నించు చున్నాము. భగవద్గీత వద్ద హిందువులు కొద్దిగా పొరపాటుపడితే, బైబిలు వద్ద క్రైస్తవులు పూర్తిగా బోర్లా పడిపోయారు.

మహాభారతమంతటినీ చదవక అందులోనుండి కొద్దిగా యుద్ధ ప్రకరణములోనున్న భగవద్గీతను విడదీసుకొని హిందువులు చదువు కొంటున్నారు. అయినా భగవద్గీతలో కలిసిపోయిన మానవుల శ్లోకములను గుర్తించలేక పోయారు. అలా మనుషులు చెప్పిన శ్లోకములను గ్రహించు కోలేక చిన్న పొరపాటును హిందువులు చేయగా, హిందువులు మహా భారతమును దానిలోని భగవద్గీతను కలిపి చదువుకొన్నట్లు, భారతమును భగవద్గీతను రెండింటిని ఒకటే అనుకొనునట్లు క్రైస్తవులు పాత నిబంధనను క్రొత్త నిబంధనను కలిపి బైబిలు అనుకొనుచున్నారు. **వాస్తవానికి బైబిలు అను పదము మత్తయి, మార్కు, లూకా, యోహాన్ అను నాలుగు సువార్తలకే వర్తించును. అందువలన కేవలము నాలుగు సువార్తలనే బైబిలు అనాలి.** ఏసు కృష్ణునివలె మనిషిగా వచ్చిన దేవుడేనని మేము

ఒప్పుకొంటాము. అయినా ఏసును మాటవరుసకు దేవుడని క్రైస్తవులనినా, ఏసు దేవుడు కాడనీ, ఏసు దేవుని కుమారుడనీ అనువారు చాలామంది క్రైస్తవులు కలరు. దేవుడు దేవునివలె వచ్చి ఎవరితోనూ నేరుగా మాట్లాడడు అనుమాట సత్యమైనది. ఆ మాట ప్రకారము దేవుడు భూమిమీదికి దేవునిగా ఎప్పటికీ రాలేడు. ఎవరితోనూ దేవుడు ప్రత్యక్షముగా మాట్లాడలేడు. అయితే దేవుడు ఇటు మనిషీకాక అటు దేవుడూకాక ప్రత్యేకమైన మనిషివలె కనిపించు, భగవంతుని అవతారముగా వచ్చుచున్నాడు. ఆ విధముగా వస్తానని భగవద్గీతయందు జ్ఞానయోగములో మొదటిలోనే భగవంతుడే చెప్పాడు. కృష్ణుడు ఎట్లు వచ్చాడో అట్లే ఏసుకూడా వచ్చాడు. ఏసు కూడా యోహాన్ సువార్త లోను, మత్తయి సువార్తలోను ఆ విషయము అర్థమగునట్లు అక్కడక్కడ చెప్పాడు. ఒక సందర్భములో నేను నాతండ్రి ఒక్కటే అనికూడా చెప్పాడు. అయినా ఏసును మనిషిగా యెహోవాను దేవునిగా మనుషులు పోల్చుకొన్నారు. ఏసుయే యెహోవాయనిగానీ, యెహోవాయే ఏసు అనిగాని గుర్తించలేక పోయారు. ద్వాపరయుగములో కృష్ణునిగా వచ్చిన దేవున్ని కూడ నేడు మేము హిందువులమని చెప్పు కొనువారు కనుగొనలేకపోయారు.

ఏసు జన్మకు కృష్ణుని జన్మకు కొంత సంబంధమున్నది. దానిని తర్వాత చెప్పుకొందాము. భారతదేశములో భగవద్గీత పురుడు పోసుకున్నది. అలాగే బైబిలు ఇజ్రాయేల్ దేశములో పుట్టినది. ఈ రెండిటిని చెప్పినవారు కృష్ణుడుగానీ, ఏసుగానీ ఇద్దరూ ప్రత్యక్షముగా ఉండి మాట్లాడినవారే. దేవుడు ప్రత్యక్షముగా మాట్లాడడు అను ఒకే ఒక సూత్రమును అడ్డము పెట్టుకొని దేవుడు భగవంతుడు (దూత) అను మారు పేరుతో, మారు రూపములో వచ్చినప్పటికీ వచ్చినవానిని మనుషులు గుర్తించలేకపోయారు. ద్వాపర

యుగములో వచ్చిన కృష్ణుడుగానీ, కలియుగములో వచ్చిన ఏసుగానీ ఇద్దరూ ఒక్కరేనని ఏమాత్రము ఎవరి అంచనాకు రాలేదు. వారు ఇద్దరూ వచ్చిన పద్ధతయినా ఒక్కటేనని తెలిసిందా అని అంటే అది కూడా మనుషులు తెలియలేకపోయారు. ప్రథమ దైవ గ్రంథమని పిలువబడు భగవద్గీతను చెప్పిన కృష్ణుడుగానీ, రెండవ దైవ గ్రంథమని పిలువబడు బైబిలును చెప్పిన ఏసుగానీ కనిపించుటకు ఇద్దరూ మనుషులే. అయినా వారు సాధారణ మనుషులుగా రాలేదు. ఇద్దరూ దేవుని జ్ఞానమును భూమిమీద బోధించుటకు వచ్చిన దూతలు.

ప్రథమ ద్వితీయ రెండు దైవ గ్రంథముల జ్ఞానమును చెప్పినది మనుషులవలెనున్న ఇద్దరూ దూతలేనని చెప్పవచ్చును. వారినే మరొక పేరుతో భగవంతులు అని కూడ చెప్పవచ్చును. దేవుని సమాచారమును తెచ్చువారు దూతలే అయినా వారికి దేవుని సమాచారము ఎలా తెలిసింది అని ప్రశ్నించుకొని చూస్తే, దేవుని సమాచారము దేవునికి తప్ప ఎవరికీ తెలియదను సూత్రము ప్రకారము వారికి (దూతలకు) కూడా తెలియదనియే అనుకోగలము. అయితే దూతలుగా వచ్చినవారు సంపూర్ణముగా దేవుని సమాచారమంతయు చెప్పగలుగుచున్నారంటే, వారికి దేవునికి మధ్య ఏదో రహస్యమున్నదని అర్థము కాగలదు. ఆ రహస్యము ఏముంటుందని పరిశీలించి చూస్తే, దేవుడు తన దూతలను భూమిమీదికి పంపుటకు ఆయన వద్ద ఒక్కరంటే ఒక్కరు కూడా లేరు. అందువలన దేవుడే దూత రూపముగా కనిపించే మనిషిగా వచ్చి, దైవజ్ఞానమును సంపూర్ణముగా చెప్పగలుగు చున్నాడు. దేవుడు మారురూపములో (మారువేషములో) తన జ్ఞానమును తానే చెప్పుచున్నాడు. కావున ఆయన (దూత లేక భగవంతుడు) చెప్పిన జ్ఞానములో ఏ సంశయమూ ఉండదు. తిరిగి ప్రశ్నరాని తిరుగులేని

జ్ఞానమును దేవుడు స్వయముగానే భగవంతునిగా అందించుచున్నాడని తెలియవలెను. భగవంతుని (దూత) రూపములో ద్వాపరయుగ అంత్యములో వచ్చిన కృష్ణుడు భారతదేశములో తన జ్ఞానమును బోధించి ప్రథమ దైవ గ్రంథము తయారగునట్లు చేశాడు. తర్వాత మూడువేల సంవత్సరములకు కలియుగములో ఇశ్రాయేల్ దేశమున మరొక అవతారముగా, మరొక పేరుతో రావడమూ జరిగినది. అక్కడ తన జీవిత కాలములో మూడు సంవత్సరములు మాత్రము తన జ్ఞానమును బోధించి పోవడమూ జరిగినది. కృష్ణుని జన్మలో యుద్ధరంగ స్థలములో, యుద్ధము ప్రారంభము కాబోవు సమయములో కొద్ది నిమిషములు (ఐదారు నిమిషములు) మాత్రమే కృష్ణుడు భగవద్గీతను అర్జునునికి చెప్పడము జరిగినది. ఈ విధముగా ఒకే దేవుడు ఒకే జ్ఞానమును, రెండూ రూపములలో, రెండు దేశములయందు బోధించడము వలన రెండు ఒక్కటేననీ, రెండూ ఒక్కరే చెప్పారనీ చాలామంది తెలియలేకపోయారు.

ఇంతవరకు దాదాపు రెండు దైవ గ్రంథముల విషయము తెలిసి పోయినది. ఇక మూడవ దైవగ్రంథ విషయానికి వస్తే, దానిని చెప్పినవాడు దూతకాదు. నేడు ముస్లీమ్ సమాజమంతా జిబ్రయేల్ దూతద్వారా ప్రవక్త అయిన ముహమ్మద్ గారికి ఖుర్ఆన్ గ్రంథము చెప్పబడినదని అనుకోవడము జరుగుచున్నది. మనము అనుకొన్నట్లు దేవుని దూత వచ్చి చెప్పలేదని తెలియుచున్నది. మొదట జ్ఞానమును వాణి (వహీ) ద్వారా దేవుడు చెప్పించగా అప్పుడు వినినవాడు సూర్యుడు. సూర్యుడు ఒక గ్రహము. ఆకాశము ఒక మహాభూతము. సృష్ట్యాదిలో ఆకాశమను భూతమునుండి సూర్య గ్రహమునకు జ్ఞానము చెప్పబడినది. సూర్యగ్రహము భూమిమీదున్న మనువు అనునతనికి చెప్పడమేకాక, ఖగోళములో మరికొన్ని భూతములకు,

గ్రహములకు తనకు అందిన జ్ఞానమును చెప్పడమైనది. ఆ పద్ధతిలో గ్రహములయందు కొంత గొప్పవాడైన జిబ్రయేల్ గ్రహమునకు కూడ చెప్పడము జరిగినది. సూర్యగ్రహము తనకు తెలిసిన జ్ఞానమును భూమిమీద భారతదేశములో మనువునకు చెప్పినట్లు, జిబ్రయేల్ గ్రహము కూడా తనకు తెలిసిన జ్ఞానము భూమిమీద తెలియజేయాలని నిర్ణయించుకొని, ఎక్కడైతే ఏసు దూతగా వచ్చిపోయాడో, ఆ ప్రాంతములోనికే జిబ్రయేల్ వచ్చి తనకు తెలిసిన జ్ఞానమును సూర్యుడు మనువునకు చెప్పినట్లే జిబ్రయేల్ కూడా ముహమ్మద్ ప్రవక్తకు చెప్పడము జరిగినది. ఇక్కడి ప్రత్యేకత ఏమంటే ప్రథమ దైవ గ్రంథము భగవద్గీతగానీ, ద్వితీయ దైవ గ్రంథము బైబిలుగానీ గ్రహము చెప్పినవి కావు. ఆ రెండు గ్రంథములను దూతలు చెప్పారు. అంతిమ దైవ గ్రంథమైన ఖుర్‌ఆన్ విషయములో అలా జరుగలేదు. గ్రహము చెప్పినదే గ్రంథరూపముగా మారినది. సూర్యగ్రహము చెప్పిన తర్వాత తిరిగి కృష్ణ దూత చెప్పినప్పుడు అదే విషయము ప్రథమ దైవ గ్రంథమైనది. రెండవ దైవ గ్రంథము కూడా దూతయిన ఏసు చెప్పిన తర్వాత గ్రంథరూప మైనది. అయితే కొంత గమనించవలసిన విషయమున్నది. అదేమనగా!

సృష్ట్యాదిలోనే సూర్యునికి వాణి ద్వారా జ్ఞానము తెలియగా, తనకు తెలిసిన జ్ఞానమును సూర్యుడు భూమండలములో భారతదేశమున తెలియ జేశాడు. ఎక్కడైతే గ్రహము జ్ఞానమును తెలియజేసినదో అక్కడే అనగా అదే దేశములోనే కొంత అటు ఇటుగానున్న ప్రదేశములోనికి భగవంతుడైన మనిషి వచ్చి చెప్పడము జరిగినది. ఒకమారు సూర్యగ్రహము చెప్పగా, అదే జ్ఞానమునే రెండవమారు భగవంతుడు చెప్పగా, అప్పుడు తయారైనది ప్రథమ దైవ గ్రంథము భగవద్గీత! అయితే భారతదేశమునకు దాదాపు నాలుగు లేక ఐదువేల కిలోమీటర్ల దూరములోనున్న ఇజ్రాయేల్ దేశమున

ఇప్పటికి ఏసు రెండువేల నలభై నాలుగు (2044) సంవత్సరములనాడు పుట్టడము జరిగినది. ఏసు ఎవరైనది క్రైస్తవులకు తెలియకున్నా ద్వాపర యుగ అంత్యములో కృష్ణునిగా వచ్చినవాడే (దేవుడే) తిరిగి ఏసు రూపములో ఇశ్రాయేల్ దేశమున వచ్చి జ్ఞానమును చెప్పడము జరిగినది. అక్కడికి ముందు గ్రహము రాలేదు. అక్కడికి ఏకముగా ముందు దూతయే వచ్చాడు. ఏసు దూతగా వచ్చి చెప్పిన జ్ఞానము వెంటనే బైబిలు గ్రంథమైనది. అయితే ఇక్కడ ఏసు చెప్పిన జ్ఞానమును బైబిలులో భాగముగా చేసి 39 పారములను పాత నిబంధన అని ముందు భాగముగా చేర్చి, క్రొత్త నిబంధన అను రెండవ భాగమును ఏసు చెప్పిన నాలుగు పారములతో మొదలుపెట్టి దాని తర్వాత 23 పారములను వ్రాసి మొత్తము అరవై ఆరు (66) పారములుగా బైబిలు గ్రంథమును తయారు చేయడము జరిగినది. దీనినంతటినీ గమనిస్తే ప్రస్తుత కాలములో బైబిలు అని చెప్పబడు గ్రంథములోనున్న అరవై ఆరు పారములలో నిజమైన బైబిలు కేవలము నాలుగు సువార్తలేనని తెలియవలెను. ఏసు చెప్పినప్పుడు ఆయన సమక్షములోనున్న నలుగురు వ్రాసిన నాలుగు ప్రతులను నాలుగు సువార్తలుగా బైబిలులో చేర్చడమైనది. నాలుగు సువార్తలలో కూడా ఒకే సువార్త జ్ఞానమే మిగత మూడు సువార్తలలో కలదని చెప్పవచ్చును. ఆ లెక్క ప్రకారము చూస్తే ఏసు ప్రత్యక్షముగా మాట్లాడినది, ఆయన జీవితకాలములో చెప్పినది, ఆయన చివరిలో చెప్పిన మూడు సంవత్సరముల జ్ఞానమును నలుగురు వ్రాయడము వలన, వ్రాసిన నలుగురు పేర్లతో నాలుగు సువార్తలుగా చెప్పడము జరిగినది. ఒక సువార్తలోనున్నదే మిగతా మూడు సువార్తలలో ఉండుట వలన, నాలుగు చదివినా ఒక్కటే, ఒక్కటి చదివినా ఒక్కటే. అలాంటప్పుడు రెండవ దైవ గ్రంథముగానున్న బైబిలులో దూత వచ్చి చెప్పినది కొద్దిమాత్రము కలదని

తెలియవలెను. బైబిలును క్రైస్తవ మత గ్రంథముగా క్రైస్తవులు చెప్పుకొనినా, వాస్తవానికి అది క్రైస్తవుల గ్రంథమేమీకాదు. అందులో మానవులందరికీ పనికివచ్చు జ్ఞానమే కలదు. మాది అని చెప్పు క్రైస్తవులు బైబిలునుండి ఏమి గ్రహించుకొన్నారని గమనించితే, దాదాపు 99 శాతము మంది ఏసు చెప్పిన సమాచారమును వదలి మనుషులు చెప్పిన సమాచారమే తెలుసుకొన్నారు. వారిలో ఒక్కరు కూడా మనకు ముఖ్యమైనది ఏసు చెప్పిన సమాచారము కదాయని ఎవరూ ఆలోచించలేదు. ఏసు చెప్పినది తప్ప మిగతాది అవసరము లేదుకదా అనుకోలేదు. మనుషులను, భగవంతునిగా వచ్చిన ఏసును ఇద్దరినీ కలిపి, ఇద్దరూ చెప్పిన వాటిని సమానముగా ఆదరించారు. అలా అన్నిటిని చదవడము వలన అందులో ఏసుకు ఏమి ప్రత్యేకతయున్నదని కొద్దిగా కూడా గ్రహించలేదు. పైకి మాటలలో ఏసే దేవుడనినా, వారి మనసులలో ఏసు దేవుని కుమారుడని గలదు. అందువలన బైబిలు వలన క్రైస్తవులు గ్రహించుకొన్నది ఏమీ లేదని తెలియు చున్నది.

ఇజ్రాయేల్ దేశములోనికి ఏసు దూతగా వచ్చి చెప్పినది సంపూర్ణ జ్ఞానమైనా అది అంత స్థాయిలో బైబిలుయందు కనిపించకపోయినా, ఏసు చెప్పినది నాలుగు సువార్తలుగానేయున్నా, ఆయన (దూత) చెప్పినది అసలైన దేవుని జ్ఞానమే అగుట వలన కొద్దిగాయున్నా బైబిలును ద్వితీయ దైవ గ్రంథమనియే చెప్పవచ్చును. అయితే ఇక్కడ గ్రహము వచ్చి చెప్పిన తర్వాత దూత వచ్చి చెప్పలేదు. ఈ ప్రాంతములో ముందు దూత (భగవంతుడు) వచ్చాడు, తర్వాత గ్రహమువచ్చి చెప్పినది. అయితే దూత వచ్చి చెప్పినది ఒక గ్రంథమైనది. గ్రహము వచ్చి చెప్పినది మరొక గ్రంథమైనది. ఇది ఇజ్రాయేల్ దేశములో జరిగిన విషయము కాగా, భారత

దేశములో ముందు గ్రహము వచ్చి చెప్పిపోయినది. తర్వాత అదే విషయమునే దూత అయిన (భగవంతుడైన) శ్రీకృష్ణుడు వచ్చి చెప్పడము జరిగినది. భారతదేశములో గ్రహము చెప్పిన లక్షల సంవత్సరములకు దూత వచ్చి గ్రహము చెప్పినదానినే చెప్పిన తర్వాత అదంతయు ప్రథమ దైవ గ్రంథముగా తయారైనది. దూత చెప్పినది కానీ, గ్రహము చెప్పినదిగానీ ఒకే జ్ఞానమే అయినందున అందులో భేదము లేదు. అలాగే ఇజ్రాయేల్ దేశములో ముందు దూత వచ్చి చెప్పినా, వెనుక గ్రహము వచ్చి చెప్పినా అక్కడ కూడా దూత చెప్పినదిగానీ, గ్రహము చెప్పినదిగానీ రెండూ సృష్ట్యాదిలో చెప్పబడిన జ్ఞానమే అయినందున వాటిలో కూడా భేదము లేదు. వాస్తవముగా మూడు దైవ గ్రంథములలో ఒకే జ్ఞానముండవలెను. అట్లే మూడు గ్రంథములలో దేవుడు సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానమే కలదు. అయితే మొదటి గ్రంథమైన భగవద్గీత తయారైన తర్వాత కొన్ని సంవత్సరములకు కొందరు అదే పనిగా తమ అజ్ఞానమును అందులో కొన్ని శ్లోకముల రూపములో చొప్పించడము వలన కొంతమార్పుతో కొందరికి కనిపించి యుండవచ్చును. ఇక బైబిలు విషయానికివస్తే దూత చెప్పింది ఒక భాగమైతే మిగతావారు చెప్పినది అరవై రెండింతలు కలదు. అందువలన దేవుని జ్ఞానమును వదలి చదివేవారికి బైబిలుకంటే భిన్నముగా భగవద్గీత కనిపించియుండవచ్చును. బైబిలులోగానీ, భగవద్గీతలోగానీ దేవుడు చెప్పిన వాటిని మాత్రము చూస్తే, రెండిటిలో ఏమాత్రము తేడా లేదని చెప్పవచ్చును.

అదే విధముగా ఖుర్ఆన్ విషయమునకు వచ్చి చూస్తే సృష్ట్యాదిలో సూర్యుడు విన్న జ్ఞానమునే, సూర్యుడు జిబ్రయేల్‌కు చెప్పడము జరిగినది. జిబ్రయేల్ వినిన జ్ఞానమునే 1400 సంవత్సరముల పూర్వము భూమిమీదికి ఇజ్రాయేల్ ప్రాంతములోనికే వచ్చి ముహమ్మద్ అను వ్యక్తికి చెప్పిపోవడము

జరిగినది. జిబ్రయేల్ చెప్పినంతవరకు బాగానేయున్న జ్ఞానము వ్రాత రూపములో ఖుర్ఆన్ గ్రంథముగా వ్రాయబడినప్పుడు అందులోనికి కొన్ని దేవుడు చెప్పని విషయములు కూడా ఎక్కినవి. దేవుని విషయములు ఉంటూ, దేవుడు చెప్పని విషయములు కూడా ఏదో ఒక విధముగా ఎక్కినవి. ముందు రెండు గ్రంథములలోనికి కొన్ని దేవుడు చెప్పని విషయములు, మనుషులు చెప్పిన విషయములు చేరిపోయినట్లు ఖుర్ఆన్ గ్రంథములోనికి కూడా చేరునట్లు దేవుడే చేశాడనుకొందాము. దేవుడు తనకిష్టమైన వారిని మాత్రమే తనవైపు లాగుకొనునట్లు మూడు గ్రంథములను అలాగే మార్చి వేశాడు. ఇదంతయు గమనిస్తే ఒక పద్ధతి ప్రకారము దేవుడు తన జ్ఞానమును అందించిన చోటే కొంత అజ్ఞానమును కూడా పెట్టాడని తెలియు చున్నది. ఖుర్ఆన్ గ్రంథములో కొంత మనిషి జ్ఞానముండగా ఎక్కువ జిబ్రయేల్ చెప్పిన దైవజ్ఞానమే కలదు. బైబిల్‌ను ఖుర్ఆన్‌ను పోల్చి చూస్తే బైబిలులో ఎక్కువ మనుషులు చెప్పినది, తక్కువ దూత (ఏసు) చెప్పినది కలదు. మూడు దైవ గ్రంథములను కలిపి చూస్తే భగవద్గీతలో తక్కువగా మనుషులు చెప్పినది కలదు. భగవద్గీతను మొదట గ్రహము తర్వాత దూత (భగవంతుడు) చెప్పడము వలన దానిలోనికి కొన్ని సందర్భములలో తప్ప మిగతా చోట్ల మానవుల రచనలు దానిలోనికి చేరలేకపోయాయి. మిగత బైబిలు కేవలము దూత చెప్పినదే అయినందున, అలాగే ఖుర్ఆన్ కేవలము గ్రహము చెప్పినదే అయినందున, వాటిలోనికి సులభముగా మానవుల రచనలు చేరిపోయినవి. అలా చేరిపోయినా ఏది దేవుడు చెప్పినది, ఏది మనుషులు చెప్పినదని కనుగొనుటకు దేవుడు అవకాశము కూడా ఇచ్చాడు. ఎవరైతే దేవున్ని పూర్తి నమ్మియున్నారో, ఎవనికైతే దేవుని జ్ఞానము అత్యంత ఆనందమును కల్గించునో, ఎవనికయితే నిజమైన తండ్రి

పరమాత్మయనీ, నిజమైన తల్లి ప్రకృతియనీ తెలిసియుండునో అటువంటి వానికి దైవగ్రంథములలోని తన జ్ఞానము ప్రత్యేకముగా కనిపించునట్లు చేయును. మనుషులు వ్రాసిన జ్ఞానమును చూస్తూనే ఇది కలుషిత జ్ఞానమని అర్థమగునట్లు చేయును. ఈ పద్ధతి ప్రకారము దేవునికిష్టమైన వారిని తనవైపు దేవుడు రప్పించుకొనును, తన జ్ఞానము పూర్తి అర్థమగునట్లు చేయును.

భూమిమీద మనకు (నాకు) తెలిసినంతవరకు రెండు దేశములలోనే దేవుని జ్ఞానము చెప్పబడినది. చెప్పబడిన రెండుచోట్ల ఒక గ్రహమూ, ఒక దూత చేత జ్ఞానము చెప్పబడినదని తెలిసిపోయినది. పద్ధతి ప్రకారము రెండుచోట్ల రెండు దైవ గ్రంథములే తయారు కావలసియుండగా తన రహస్యము సులభముగా తెలియకుండునట్లు దేవుడు మూడు గ్రంథములను తయారు చేయించాడు. అలా చేయుటకు కూడా కొంత కారణమున్నది, దానిని తర్వాత వివరించుకొందాము. దేవుడు తన జ్ఞానమును సర్వ ప్రపంచములోనూ వ్యాపించుటకు తగినట్లు ఆకాశము ద్వారా సూర్యునకు చెప్పించాడు. తర్వాత సూర్యుని ద్వారా అన్ని గోళములకు, అన్ని గ్రహములకు, అన్ని దేశములకు వ్యాపించునట్లు చేశాడు. అందులో భాగముగా సూర్యుడు భూమిమీదగల భారతదేశమందు దక్షిణ భాగమునగల శ్రీలంక సమీపమున మనువుకు తెరచాటునుండి బోధించాడు. సూర్యుడు గ్రహమైనందున తన స్థూల శరీరమైన మండుచున్న గోళమును ఆకాశము లోనే వదలివేసి సూక్ష్మశరీరముతో భూమిమీదికి వచ్చి, ఇక్కడ తనకు తగిన వ్యక్తి శరీరములోనికి చేరి, తాను కనిపించక తాను చేరిన మనిషి శరీరముతో మాట్లాడుచూ మనువుకు దేవుని జ్ఞానము చెప్పడము జరిగినది. ఇక్కడ సూర్యగ్రహము ఎలా తెరచాటునుండి చెప్పగలిగిందో, అలాగే జిబ్రయేల్ గ్రహము కూడ తన సూక్ష్మశరీరముతో వచ్చి ఒక స్థూల

శరీరమునాశ్రయించి తెరచాటునుండి ముహమ్మద్ ప్రవక్తగారికి దేవుని జ్ఞానమును చెప్పడము జరిగినది. అయితే సూర్యగ్రహము ఒక దినమే మనువుకు జ్ఞానము చెప్పగా జిబ్రయేల్ గ్రహము దాదాపు 23 సంవత్సరములు దేవుని జ్ఞానమును చెప్పడము జరిగినది. సూర్యుడు తాను ప్రవేశించిన శరీరముతో కనిపించి మాట్లాడినా, చెప్పే సూర్యుడు కనిపించ లేదు. మాట్లాడే శరీరము కనిపించినా, జ్ఞానమును చెప్పిన సూర్యుడు మాత్రము కనిపించలేదు. అందువలన ఆ విధానమును తెరచాటునుండి చెప్పిన విధానమని దేవుడే ఖుర్ఆన్ గ్రంథములో 42వ సూరా, 51వ ఆయత్‌నందు చెప్పియున్నాడు. ఇక్కడొక ప్రశ్నరాగలదు, అదేమనగా! సూర్యుడు మనువునకు ఒక దినము మాత్రము చెప్పగా, జిబ్రయేల్ ద్వారా ముహమ్మద్ ప్రవక్తకు చెప్పినప్పుడు 23 సంవత్సరములు ఎందుకు పట్టినదని అడుగవచ్చును. దానికి మా జవాబు ఏమనగా!

సూర్యుడు కనిపించకుండా తెరచాటునయున్నా, సూర్యుడు ప్రవేశించిన శరీరము ప్రత్యక్షముగా కనిపించి మనువుకు చెప్పడము జరిగినది. మాట్లాడుచున్నది సూర్యుడైనా, కనిపించు శరీరము మనిషిదని ఆనాడు మనువుకు తెలుసు. ఆనాడు మనువు ఒక మహర్షి, ఎంతో జ్ఞాపక శక్తిగలవాడు, ఈనాడు మేధావియైన అంబేద్కర్ రాజ్యాంగమును వ్రాసి పరిపాలన ఇట్లే ఉండవలెనని సూచించినట్లు, ఆనాడు మనువు మానవుడు ఇట్లేవుండవలెనని సూచించిన మేధావి. మనువు వలననే ఆయన నడవడి కలకు అలవాటుపడిన దానివలననే మనకు మనుషులని (మానువులని) పేరువచ్చింది. ఆనాడు మనువు గొప్ప తెలివిగలవాడు, అలాగే జ్ఞాపకశక్తి గలవాడు. కావున ఉన్న జ్ఞానమంతయు ఒకేరోజు సూర్యుడు చెప్పడము జరిగినది. అయితే జిబ్రయేల్ రెండు లేక మూడు వాక్యములను మాత్రము

ఒకమారు ముహమ్మద్ ప్రవక్తగారికి చెప్పడము జరిగినది. దానికి కారణము ప్రవక్త గారు నిరక్షరాస్యుడు. ప్రవక్తకు చదువురాదు. చెప్పిన విషయమును తాను స్వయముగా వ్రాసుకోలేడను కారణముతో, చెప్పిన దానిని ఇతరులకు చెప్పి వ్రాయించుకొనునట్లు రెండు, మూడు వాక్యములకంటే జిబ్రయేల్ ఎక్కువ చెప్పెడివాడుకాదు. అదియూ ప్రతి దినమూ చెప్పకుండా రెండు మూడు రోజులకు ఒకమారు చెప్పెడివాడు. సమాచారమునుబట్టి అప్పుడప్పుడు ఎక్కువ వాక్యములు కూడా చెప్పెడివాడు. ఆ విధముగా జిబ్రయేల్ గ్రహము 23 సంవత్సరములు తన జ్ఞానమును ప్రవక్తకు చెప్పడము జరిగినది. అలా చాలాకాలము చెప్పబడిన విషయములన్నిటినీ గ్రంథముగా వ్రాయాలనుకొన్నప్పుడు ప్రవక్త చెప్పగా విని వ్రాసుకొన్నవారు, విషయములను విని జ్ఞాపకముంచుకొన్నవారు, చెప్పిన విషయములను అన్నిటినీ కూర్చి ఖుర్ఆన్ గ్రంథముగా చేయబడినది. అందువలన ఖుర్ఆన్ గ్రంథములోని వాక్యములు వరుస క్రమములో ఉండవు. ఎలాయున్నా అందులో జిబ్రయేల్ గ్రహము చెప్పిన దేవుని వాక్యములలో ఒక్కటి కూడా తప్పిపోకుండా వ్రాయడము జరిగినది. దేవుని జ్ఞానమంతయూ ఖుర్ఆన్ గ్రంథములోనికి ఎక్కినది. కావున ఖుర్ఆన్ గ్రంథము దైవ గ్రంథమైనది. ముందు బయటికి వచ్చిన భగవద్గీత, బైబిలులోవలె ఖుర్ఆన్ గ్రంథములో కూడా మానవుని వాక్యములు కొన్ని చేరిపోయినవి. ఎవరూ గమనించనట్లు మానవుని వాక్యములు అందులోయున్నా, అవి అదే గ్రంథములోని దేవుని వాక్యములకు వ్యతిరేఖముగా ఉన్నందున, ఇవి మనుషులు చెప్పిన వాక్యములని సులభముగా బయటపడిపోవుచున్నవి. మా దృష్ఠిలో మూడు గ్రంథములు దైవ గ్రంథములే అయినా మూడింటిలో కొంత కాలుష్యము కనిపించుట వలన ఆ కాలుష్యమును తీసివేసి దేవుడు చెప్పిన అసలైన జ్ఞానమును

అందించాలను ఉద్దేశ్యముతో భగవద్గీతను సవరించి మానవుల కల్పిత శ్లోకములను చూపుచూ **"త్రైత సిద్ధాంత భగవద్గీత"** అను పేరుతో వ్రాయడము జరిగినది. రాబోవు కాలములో మిగతా రెండు గ్రంథములలో కూడా ఇదే దేవుని జ్ఞానమని చెప్పగల రోజు రాబోతుందనీ, దేవుడు ఆత్మచేత అలా చేయించగలడనీ అనుకొంటున్నాను.

మనిషిగా కనిపించి మాట్లాడిన వారు, మనిషి కాకున్నా అందరినీ నమ్మించి చివరకు తమ ధ్యేయమైన జ్ఞానమును బోధించడమను పనిని చేసిపోయినవారు నాకు తెలిసినంతగా, ఈ మధ్య కొన్ని వేల సంవత్సరముల పూర్వము వరకు గమణిస్తే ఇద్దరే ఇద్దరు గలరు. వారిలో ద్వాపరయుగ అంత్యములో వచ్చిపోయిన శ్రీకృష్ణుడూ, కలియుగములో రెండు వేల సంవత్సరముల పూర్వము వచ్చిపోయిన ఏసు. కృష్ణుడు ఐదువేల సంవత్సరముల పూర్వమురాగా, ఆయన తర్వాత మూడు వేల సంవత్సరముల తర్వాత ఏసు రావడము జరిగినది. వీరి ఇద్దరి జీవితములు తూర్పు పడమరగా కనిపించినా వాస్తవముగా వారు ఇద్దరూ ఇద్దరు కాదు ఒక్కరే. ఈ మాటను ఎవరూ నమ్మనట్లు రెండు జీవితములను ముందే వ్యూహ రచన చేయబడినది. ఇద్దరూ మనిషిగా వచ్చినప్పటికీ మనిషికాని భగవంతుడై ఉన్నారు. కృష్ణునిగా వచ్చినవాడుగానీ, ఏసుగా వచ్చినవాడుగానీ ఎవరు అని ఇప్పుడు ప్రశ్నిస్తే రామాయణమంతయూ వినిన తర్వాత సీతకు రాముడేమవుతాడని అడిగినట్లుంటుంది. ఒక్కడే తాను తానుగా కాకుండా మారువేషములలో రెండుమార్లు వచ్చిపోయాడని ముందే వ్యక్త పరిచాను. వివరముగా చెప్పితే ఎవరికీ తెలియని దేవుడు, ఎవరికీ తెలియని తన విషయమును తెలుపుటకు భూమిమీద మనుషుల మధ్యలోనికి రావలసి వచ్చినప్పుడు మనిషివలె వస్తే తనను ఎవరూ గుర్తుపట్టలేరను ఉద్దేశ్యముతో

మనిషివలె వేషము ధరించి రావడము జరిగినది. అలా మనిషిగా వచ్చినప్పుడు తాను ఎవరైనదీ మనుషులెవరూ గుర్తించనట్లు నటించవలసి వచ్చినది. అందువలన మొదట కృష్ణునిగా వచ్చినప్పుడు సుఖాలతో తేలి పోయినట్లు, మనుషులవలె మోసాలు చేయడము, అబద్ధములు చెప్పడమూ, ఒకమాటకు కట్టుబడివుండక పోవడము చేస్తూ, ఎక్కడా జ్ఞానమును చెప్పక తొంభై (90) సంవత్సరములు జీవితము గడిపి, కృష్ణుడు మోసగాడు అను పేరును సంపాదించుకొని చివరిలో ఎవరికీ తెలియకుండా అర్జునుడు ఒంటరిగానున్న సమయములో, ఎవరూ విననట్లు తన జ్ఞానమును అర్జునునికి చెప్పడము జరిగినది. రహస్యముగా తాను చెప్పినట్లు ఎవరికీ తెలియకుండా చెప్పిన జ్ఞానము చివరకు వ్యాసుని రచన ద్వారా ప్రథమ దైవ గ్రంథముగా మారిపోయినది.

అలాంటి వాతావరణమును సృష్టించి జ్ఞానమును చెప్పిపోవడము వలన ఆయన గొప్పవాడని నమ్మువారు తప్ప మిగతావారందరూ ఈనాటికీ భగవద్గీత వైపు చూడకుండా, హిందువుల ఆధ్యాత్మిక గ్రంథములు నాలుగు వేదములని చెప్పుచున్నారు. కృష్ణునిగా వచ్చిపోయిన తర్వాత మూడువేల సంవత్సరములకు తన జ్ఞానమును భూమిమీద మరొక దేశములో బోధించుటకు మరొక మనిషిగా దేవుడే రావలసివచ్చినది. దేవుడు మనిషిగా రాడు, సృష్టి తర్వాత ఆయనకు రూపములేదు అను సూత్రమును అనుసరించి ఆయన సాధారణ మనిషిగా కాకుండా ప్రత్యేకమైన మనిషిగా కృష్ణునిగా వచ్చినప్పుడు ఎలా వచ్చాడో అలాగే మరొక రూపముతో వచ్చాడు. రెండవ మారు భారతదేశమునకు పడమటివైపున దాదాపు నాలుగు లేక ఐదువేల కిలోమీటర్ల దూరములోనున్న ఇజ్రాయేల్ అను దేశమున రావడము జరిగినది. రెండవమారు వేసుకొన్న జీవిత పథకము మొదటి దానితో

ఏమాత్రము పోలికలులేనిదై, పూర్తి భిన్నముగా ఉండడము జరిగినది. దేవుడే తనను తెలియకూడదనుకొన్నప్పుడు ఎవరు ఆయనను గుర్తించగలరు? దేవుడు నామ రూప క్రియారహితుడు అను ధర్మము ప్రకారము, తన ధర్మమును అతిక్రమించకుండ మనిషివలె వచ్చి జ్ఞానము చెప్పినప్పటికీ అతను పూర్తి మనిషి కాకపోవడము ఆయనలోని ప్రత్యేకత. రెండవమారు వచ్చినప్పుడు కృష్ణునికి పూర్తి భిన్నముగా పేదవానిగా, పెళ్ళికానివానిగా, ఒక బాటసారిగా ప్రజలకు కనిపించి, మూడు సంవత్సరములు ప్రజల మధ్యనయుండి జ్ఞానమును బోధించాడు. అయినా ఆయనను పదకొండు మంది శిష్యులు అనుసరించారు తప్ప మిగతా మనుషులు ఎవరూ ఆయనను విశ్వసించలేదు. చివరికి పదకొండు మందిలో ఒకరు లేక ఇద్దరు తప్ప మిగతావారు కూడా పేరుకు శిష్యులే అని తెలిసిపోయినది. కృష్ణునిగా వచ్చిన కాలములో ఆయనకు ఒక్కరు కూడా శిష్యులుగా లేరు. ఇట్లు గోప్యముగా రెండవ జన్మను ఇజ్రాయేల్ దేశములో జెరూసలెమ్ (బెత్లేహేమ్) అను పట్టణమున తీసుకొన్న ఏసు, కృష్ణుడు గీతలో చెప్పిన సారాంశమునే తన బోధలో చెప్పాడు. అలా చెప్పినా ఇప్పటికీ ఆ రెండు బోధలు ఒక్కటేననిగానీ, ఆ ఇద్దరూ ఒక్కడేయనిగానీ ఎవరూ ఏమాత్రము తెలియక పోవడమేకాక మా ఏసుకు మీ కృష్ణునికి ఏమి పోలిక, మా ఏసు పెళ్ళి చేసుకోకుండా సుఖాలకు దూరముగా ఉండిపోయాడు, మీ కృష్ణుడు ఎనిమిది మందిని పెళ్ళి చేసుకొన్నాడని క్రైస్తవులు అనుచున్నారు. అదే కోవలో హిందువులు ఏసును దూషించుచున్నారు. ఇట్లు ఒక్కరినే రెండుగా అజ్ఞానము చేత అనుకోవడము జరుగుచున్నది. అట్లు అనుకోవడము వలన ఇద్దరుగా చెప్పిన బోధలలో వాక్యములు వేరుగాయున్నా భావమూ, జ్ఞానమూ ఒక్కటేనని తెలియలేకపోవుచున్నారు.

ఐదువేల సంవత్సరముల పూర్వము కృష్ణుడు చెప్పిన జ్ఞానమునే రెండు వేల సంవత్సరముల పూర్వము ఏసు చెప్పాడనుటకు గుర్తుగా ఒక వాక్యమును వివరిస్తాను చూడండి. భగవద్గీతలో మోక్ష సన్న్యాస యోగ మందు 17వ శ్లోకమున ఇలా కలదు.

*శ్లో॥ యస్యనాహంకృతో భావో బుద్ధిర్యస్యనలిప్యతే ।*
*హత్వాపి స ఇమాన్ లోకాన్న హన్తి నని బధ్యతే ॥*

భావము :- "ఎవని భావములో అహంకారము లేదో, ఎవని బుద్ధియందు ఫలితము మీద ధ్యాసలేదో, అతడు ఈ లోకములోని వారందరినీ చంపినప్పటికీ నిజముగా అతడు హంతకుడు కాడు. అతనికి హత్యాపాపము అంటదు." ఈ మాట కొందరికి విచిత్రముగా కనిపించినా ఇది వాస్తవముగా జ్ఞానసూత్రమే. ఇదే విషయమును బైబిలులో మత్తయి సువార్త 5వ అధ్యాయములో 28వ వాక్యమును గమనిస్తే "ఒక స్త్రీని మోహపు చూపుతో చూచు ప్రతివాడు అప్పుడే తన హృదయమందు ఆమెతో వ్యభిచారము చేసినవాడగును." అని కలదు. ఇక్కడ చేయకున్నా చేసినట్లేనని చెప్పడము విచిత్రమే. ఇప్పుడు భగవద్గీత శ్లోకములోని అర్థమును చూస్తే హత్య చేసినా చేయనట్లేనని ఆయన (కృష్ణుడు) చెప్పాడు. బైబిలులోని వాక్యములో చేయకున్నా అనుకుంటే చేసినట్లేనని ఈయన (ఏసు) అంటాడు. రెండు వాక్యములు వేరు మాటలుగా ఆశ్చర్యమును కలిగించునట్లుయున్నా, రెండూ ఒకే అర్థమునిచ్చు జ్ఞానపు వాక్యములని గుర్తించలేనట్లు యున్నవి. కొంత వరకు ఆలోచిస్తే రెండు వాక్యములు ఒకదానికొకటి భిన్నముగా కనిపించినా రెండూ ఒకే జ్ఞానమును బోధించుచున్నవని తెలియగలదు. వేరుగా కనిపించు ఇద్దరూ ఒక్కరే అయినా ఇద్దరుగా కనిపించినట్లు,

వేరుగా కనిపించు రెండు వాక్యములు ఒకే జ్ఞానమైనా వేరువేరు భావములున్న వాక్యములవలె కనిపించుచున్నవి. ఈ విధముగా మనము కొంత వివరముగా గమనించగలిగితే భగవద్గీత బైబిలులో తేడాలు కనిపించవు.

అదే విధముగా భగవద్గీతలో చెప్పిన జ్ఞానమే ఖుర్ఆన్ గ్రంథములో కూడా కలదు. అలా బైబిలు ఖుర్ఆన్‌లోనున్న జ్ఞానము ముందు భగవద్గీతలో చెప్పబడినదని మనుషులు గ్రహించలేకపోయారు. ఖుర్ఆన్‌లో కూడా భగవద్గీత సారాంశమైన జ్ఞానమే ఉన్నదనుటకు ఉదాహరణగా భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమున 16, 17 శ్లోకములు కలవు.

*16. శ్లో॥* *ద్వావిమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర ఏవచ ।*
*క్షర స్సర్వాణి భూతాని కూటస్థో క్షర ఉచ్యతే ॥*

*17. శ్లో॥* *ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః ।*
*యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ~~ఈశ్వరః~~ ॥*

16) భావము :- "లోకములో రెండు రకముల పురుషులున్నారు. వారినే క్షరుడని ఒకనినీ, అక్షరుడని మరొకనినీ అనవచ్చును. క్షరుడు అనబడు జీవాత్మ సర్వ జీవరాసులలోగలడు. అక్షరుడనబడు ఆత్మ సర్వ జీవరాసుల శరీరములలో కూటస్థునిగా (దర్శకునిగా) అమరియున్నాడు."

17) భావము :- "జీవాత్మ, ఆత్మ అనబడు వీరు ఇద్దరూ కాకుండా మూడవ పురుషుడు గలడు. మూడవవాడు క్షరునికంటెనూ, అక్షరునికంటెనూ ఉత్తమ పురుషుడు కావున ఆయనను పురుషోత్తముడనీ, పరమాత్మయనీ చెప్పుచున్నాడు. పరమాత్మయని పిలువబడువాడే ప్రపంచమునకంతటికీ అధిపతియై దేవుడని పిలువబడుచున్నాడు."

ఈ రెండు శ్లోకములను గమనించితే సకల జీవరాసులలో జీవాత్మ అనబడు ఒకడూ, ఆత్మ అనబడు రెండవవాడూ, పరమాత్మ అనబడు మూడవ వాడూ ఆత్మలుగా ఉన్నారనియూ వారినే క్షరాత్మ, అక్షరాత్మ, పరమాత్మ అని అంటున్నామనియూ తెలియుచున్నది. ఐదువేల సంవత్సరముల పూర్వము చెప్పినమాట సృష్ట్యాదిలో దేవుడు చెప్పిన మాటగా మనము గుర్తుంచుకోవాలి. ఆ మాట ప్రథమ దైవ గ్రంథమైన భగవద్గీతలో ఉన్నదని చెప్పుకొన్నాము కదా! అదే సృష్ట్యాదిలో చెప్పిన జ్ఞానమునే ఒక దూత ద్వారా, ఒక గ్రహము ద్వారా ఇజ్రాయేల్ దేశములో చెప్పబడినదనుటకు ప్రమాణముగా ఖుర్ఆన్ గ్రంథములో 50వ సూరా అయిన ఖాఫ్ సూరాలో 21వ ఆయత్‌నందు ఇలా కలదు చూడండి. ప్రతి మనిషి వానిని తోలేవాడు ఒకరు, సాక్ష్యముగా ఉండేవాడు ఒకడు కలిగివస్తాడు. దీనినిబట్టి చూస్తే ప్రతివ్యక్తిని ఒక తోలేవాడూ, ఒకడు సాక్షిగా చూచేవాడు కలిగియున్నాడని అర్థమగుచున్నది. ఈ వాక్యమును చూస్తే ఇది భగవద్గీతలో పురుషోత్తమ ప్రాప్తి యోగమున చెప్పిన మూడు ఆత్మల జ్ఞానమని ఎవరూ గుర్తించలేరు. అయితే వాస్తవముగా భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమున చెప్పిన రెండు శ్లోకములలోని జ్ఞానమే ఖుర్ఆన్‌లో 50వ సూరా 21వ ఆయత్‌నందు కలదు. భగవద్గీతలో క్షర, అక్షర, పురుషోత్తమ అను మూడు ఆత్మలను గురించి చెప్పడము జరిగినది. ఇక్కడ ఖుర్ఆన్‌లో కూడా అదే మూడు ఆత్మలను గురించి చెప్పియున్నారు. వివరముగా చెప్పుకొంటే ప్రతి వ్యక్తి ఒక జీవాత్మగాయున్నాడు. ప్రతి వ్యక్తిని వాని శరీరములోగల ఆత్మ నడిపించుచున్నది. అందువలన ప్రతి వ్యక్తి ఒక తోలేవాడు కలిగివస్తాడని చెప్పడమైనది. ప్రతి వ్యక్తిని (జీవాత్మను) నడిపించేది ఆత్మకాగా, ఏమీ చేయక కేవలము సాక్షిగా చూస్తూ ఊరకయుండు పరమాత్మయనబడు

(దేవుడు అనబడు) మూడవవాడు కూడా కలడని ఆ వాక్యములో కలదు. ఒకడు తోలబడేవాడూ, రెండు తోలేవాడు, మూడు చూచేవాడు అను ముగ్గురు ప్రతి మనిషి శరీరములో ఉన్నారను విషయమునే ఖుర్‌ఆన్ గ్రంథములో తెలియజేయడమైనది.

దీనినిబట్టి భగవద్గీతలోని జ్ఞానమే ఖుర్‌ఆన్ గ్రంథములోయున్నదని చెప్పవచ్చును. భగవద్గీత ఆది దైవ గ్రంథమైనందున తర్వాత వచ్చిన గ్రంథములలో భగవద్గీతలో చెప్పిన జ్ఞానమే ఉండడమైనది. అయితే ఒకే జ్ఞానము భగవద్గీతలో శ్లోక రూపముగాయుండగా, మిగతా బైబిలు, ఖుర్‌ఆన్ గ్రంథములలో వాక్యముల రూపములోయున్నది. అట్లుండుట వలన అందులోని భావము చాలామందికి అర్థము కాకుండా పోయినది. చాలామందికి మా గ్రంథము వేరు, వారి గ్రంథము వేరను భావముండుట వలన భగవద్గీతతో వారి గ్రంథమును పోల్చుకోలేక పోవుచున్నారు. కొందరైతే మా గ్రంథములోనున్న దేవుడే గొప్పవాడు, మిగతా గ్రంథములలో చెప్పిన దేవుడు నిజంగా దేవుడే కాడు అంటున్నారు. ఇట్లు కొందరిలో సంకుచిత భావములుండుట వలన భగవద్గీతలోని జ్ఞానమే అన్నిటిలోనూ ఉన్నదనీ, భగవద్గీత అన్ని గ్రంథములకు పుట్టినిల్లులాంటిదని తెలియలేక పోయారు.

భూమిమీదికి వచ్చి తెరచాటునయుండి సూర్యగ్రహము ఆదిలో తనకు తెలిసిన జ్ఞానమునంతటిని భారతదేశములో చెప్పడమైనది. మానవ జాతికి "మానవు" లు అని పేరు తెచ్చిన "మనువు" అను వ్యక్తికి సూర్యుడు జ్ఞానమును బోధించి మానవులందరికీ ఆది గురువైనాడు. ఆది గురువైన సూర్యుడు (సూర్యగ్రహము) బోధించిన జ్ఞానమునే, మానవులలో అంతరించి పోవు సమయములో దేవుడు భగవంతుడను మానవకారముగా వచ్చి తన

జ్ఞానమును నేరుగా మనుషులకు ఏదో ఒక రకముగా తెలియజేయడము జరిగినది. ఇట్లు ఒకమారు గ్రహమూ, మరొకమారు భగవంతుడను మారు రూపములోనున్న దేవుడూ దేవుని జ్ఞానమును భారతదేశములో చెప్పడము జరిగినది. అలా చెప్పిన జ్ఞానము ప్రథమముగా గ్రంథరూపముగా మారినది. అందువలన దానినే "ప్రథమ దైవగ్రంథము" గా చెప్పుచున్నాము. దేవునికి సృష్టి తర్వాత రూప, నామ, క్రియలు లేవు అను ధర్మము ప్రకారము దేవుడు మనిషిగావచ్చి జ్ఞానమును బోధించినా, చూచేవారికి భగవంతుడు మనిషిగా కనిపించినా, ఆయన వాస్తవముగా మనిషి కాకుండా మనిషికున్న సూత్రము లకు భిన్నముగా ఉండుట వలన దేవుడు మనిషిగా రాలేదని చెప్పవచ్చును. దేవుడు మానవునిగా కనిపించినా ఆ మనిషి మనిషి కాడు, అతడు భగవంతుడు. తల్లిగర్భము నుండి (భగము నుండి) సజీవముగా పుట్టిన శరీరమైనందున దేవుడు మనిషివలె వచ్చిన శరీర ఆకారమును భగవంతుడు అనుచున్నాము. అంతేకాక మనిషి శరీరములో జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అను మూడు పేర్లుగల ఆత్మలు గలవు. దేవుడైన భగవంతుని శరీరములో జీవాత్మ, ఆత్మలు రెండూ వుండవు. ఆ రెండూ ఉంటే అతను మనిషి కాగలడు, ఆత్మ, జీవాత్మలు లేనందున మనిషివలె కనిపించు భగవంతున్ని మనిషితో పోల్చుటకు అవకాశమే లేదు. ఈ విధముగా దేవుడు వచ్చి మనిషితో మాట్లాడినా మాట్లాడనట్లే, కనిపించు మనిషిగానున్న భగవంతునిగా దేవుడు భూమిమీద అవతరించినా ఆయన భూమిమీదికి రానట్లే. అందువలన సృష్టి పూర్వము అన్నీయున్న దేవుడు సృష్టి తర్వాత ఏమీ లేనివాడైనాడు.

దేవుని జ్ఞానము దేవునికి తప్ప ఇతరులెవరికీ తెలియదని అంతిమ దైవ గ్రంథమైన ఖుర్ఆన్ గ్రంథములో మూడవ సూరా, ఏడవ ఆయత్‌నందు

చెప్పడమైనది. దానికంటే ముందు పుట్టిన ప్రథమ దైవ గ్రంథమైన భగవద్గీతలో రాజవిద్యా రాజగుహ్య యోగమను అధ్యాయమున “ఇది రహస్యమైన జ్ఞానము, ఎవరికీ తెలియని రహస్యమైన విద్య. దీనిని నీకు చెప్పుచున్నాను జాగ్రత్తగా విను” అన్నాడు. రెండవ దైవ గ్రంథమైన బైబిలులో యోహాన్ సువార్తయందు 16వ అధ్యాయమున 25వ వాక్యమున ఇలా చెప్పారు. “ఈ సంగతులు గూఢార్థముగా మీతో చెప్పితిని. అయితే నేనిక ఎన్నడును గూఢార్థముగా మీతో మాట్లాడక తండ్రిని (దేవున్ని) గూర్చి మీకు స్పష్టముగా తెలియజేయు గడియవచ్చుచున్నది.” ఈ విధముగా చెప్పిన మాటలలో మనకర్థమగునది ఏమనగా! దేవుని జ్ఞానము దేవునికి తప్ప మరి ఇతరులెవరికీ తెలియదనీ, అలాంటపుడు ఆయన చెప్పితేనే అసలైన జ్ఞానము తెలియుననీ అర్థమగుచున్నది. అయినప్పటికీ ఆయన మనిషిగా రాడు అను సూత్రము ప్రకారము మనిషివలె వచ్చిన దేవున్ని కూడా ప్రక్కకు నెట్టివేయుచున్నారు. ఆయన మనిషిగా రానన్నాడు, నేను పుట్టనన్నాడు. ఆ మాటలన్నీ వాస్తవమే! అయితే ఆయన పుట్టకుండా పుట్టి, మనిషి కాకుండా మనిషి అయి తన జ్ఞానమును తెలియచెప్పితేనే దేవుని జ్ఞానము భూమిమీద సంపూర్ణముగా తెలియుటకు అవకాశము కలదు. మనుషులు తన మానవ ఆకారమును గుర్తించలేరని, తాను వచ్చిన విషయమును ఎక్కడైనా ఒకచోట చెప్పి నేను వచ్చానని సాక్ష్యమిచ్చుటకు చెప్పినా తన మాటను గుర్తించరను ధీమాతో కృష్ణుడు నేను మనిషిగా కనిపించినా, ఈ సృష్ఠికంతటికీ దేవున్ని అయినా, ఎవరూ నన్ను గుర్తించక సాధారణ మనిషివలె లెక్కించి నన్ను అవమానింతురని భగవద్గీతయందు రాజవిద్యా రాజగుహ్య యోగమున పదకొండవ (11) శ్లోకములో చెప్పడ మైనది. చూడండి.

శ్లో॥ అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్ ।
పరం భావ మజానన్తో మమ భూత మహేశ్వరమ్ ॥

భావము :- "సర్వ జీవరాసులకు అధిపతియై, దేవుడైవున్న నేను మానవ శరీరము ధరించియుండగా, నా యొక్క శ్రేష్టత్వమును, దైవత్వమును గుర్తించ లేని మూఢజనులు నన్ను అవమాన పరచుదురు." అని చెప్పడము జరిగినది. ఈ విధముగా దేవుడు కృష్ణునిగా వచ్చినప్పుడు మాత్రము తన ఉనికిని నిరాటంకముగా చెప్పాడు. ఆయన మాటలలోనే నర శరీరమును ధరించిన నన్ను చూచి నా దైవత్వమును మూర్ఖులు మూఢులైన మనుషులు గుర్తించ లేరని చెప్పాడుగా! అందువలన ఆయన ఎప్పుడు వచ్చినా మనిషి గుర్తించలేడు.

భగవద్గీతయందు నేను దేవున్ని, అందువలన ఎవరైనా నన్ను మ్రొక్కడమే శ్రేష్టమని చెప్పుచూ రాజవిద్యా రాజగుహ్య యోగమున చివరి 34వ శ్లోకమున ఈ విధముగా చెప్పారు చూడండి.

శ్లో॥ మన్మనా భవ మద్భక్తో, మద్యాజీ మాం నమస్కురు ।
మామే వైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః ॥

భావము :- "నీ మనస్సులో నా మీదే దృఢ నిశ్చయముగా భక్తి కల్గియుండుము. దానిప్రకారమే నన్ను నా జ్ఞానము ద్వారా తెలుసుకొనుము. నన్నే ఆశ్రయించు, నన్నే నమస్కరించు, చివరకు నన్నే పొందగలవు" అని చెప్పడమైనది కదా! ఇంత గట్టిగా, ఇంత దృఢముగా చెప్పినవాడు తిరిగి ధర్మములు తెలియనిచోట, అధర్మములున్నచోట ఉద్భవిస్తానని చెప్పినట్లు మూడువేల సంవత్సరముల తర్వాత ఇస్రాయేల్ దేశమున ఒక అనామకుడుగా ఏసు అను పేరుతో పుట్టడము జరిగినది. అయితే భారత

దేశములో పుట్టిన కృష్ణుడు, ఇశ్రాయేల్ దేశములో పుట్టిన ఏసు ఇద్దరూ ఒక్కరేనన్న విషయము ఎవరూ గ్రహించలేకపోయారు. ఏసు పుట్టి ఇప్పటికి 2044 సంవత్సరములైనా, ఇంతకాలము గడచినా, కృష్ణుడు చెప్పిన భగవద్గీత, ఏసు చెప్పిన బైబిలు రెండూ మనుషుల ముందరే యున్నా ఆ ఇద్దరూ ఒక్కరేనను విషయము తెలియకుండా పోయినది. దేవున్ని పూర్తి విశ్వసించిన వారికే దేవుని విషయము తెలియును అను దేవునిమాట ప్రకారము దేవున్ని పూర్తి విశ్వసించని వారికి దేవుని విషయము తెలియదనియే చెప్పవచ్చును. దేవుని మీద విశ్వాసములేని కారణముననే భూమిమీద ఇటు హిందువులకు (ఇందువులకు) అటు క్రైస్తవులకు కృష్ణుడు, ఏసు ఇద్దరూ ఒక్కరేనను విషయము తెలియకుండా పోయినది. ఇక్కడ కొందరు ఒక ప్రశ్న అడుగవచ్చును. అదేమనగా! భూమిమీద అన్ని దేశములలో ఏసు చెప్పిన బైబిలును అనుసరించుచూ, అదే జ్ఞానమును బోధించు బోధకులు ఎందరో కలరు. అలాగే భారత దేశములోనైనా కృష్ణుడు చెప్పిన భగవద్గీతను అనుసరించుచూ అదే భగవద్గీతను చెప్పువారుగా స్వామీజీలూ కలరు. సామాన్య మనుషులకు ఏసు, కృష్ణుని విషయము తెలియకపోయినా, అటు క్రైస్తవ బోధకులకూ, ఇటు హిందూ స్వాములకూ ఏసు, కృష్ణుడు ఒక్కరేనను విషయము ఎందుకు తెలియకుండా పోయినదని అడుగవచ్చును. దానికి మా సమాధానము ఈ విధముగా కలదు.

ఇక్కడ ముఖ్యముగా ఒక సూత్రమును గుర్తుచేసుకొంటే దేవుని మీద ఎవనికి శ్రద్ధ, ఆసక్తికలదో వానికి మాత్రము దేవుడు తెలియును అను సూత్రం తెలియగలదు. దానిప్రకారము అంతరంగమున శ్రద్ధ, ఆసక్తి యున్న వానికే తెలియునుగానీ, బయట ప్రపంచములో గొప్ప ధనికుడైనా, గొప్ప పదవిలోయున్నా, గొప్ప బోధకుడని పేరుగాంచియున్నా, అట్లే పెద్ద

స్వామీజీయని ప్రఖ్యాతి చెందియుండినా దేవుని విషయము తెలియదని చెప్పవచ్చును. దాని ప్రకారము ఎవరికీ తెలియకపోవడమేకాక కృష్ణున్ని ఏసును ఒక్కరిగా పోల్చడము కూడా సరిపోనివారున్నారు. ఇంకా కొంతమందికి ప్రత్యేకించి హిందువులకు కృష్ణుడంటే ఇష్టమున్నా లేకపోయినా ఏసు అంటే ఏమాత్రము సరిపోదు. అలాగే కొందరు క్రైస్తవులు ఏసుమీద ప్రేమవున్నా లేకపోయినా కృష్ణుడంటే సరిపోదు. కృష్ణుడు హిందూ మతమువాడనీ, ఏసు క్రైస్తవ మతమువాడనీ మతద్వేషముతో వారు అలా అనుకోవడము జరుగుచున్నది. కొందరు మతమును ప్రక్కన పెట్టి జ్ఞానము ప్రకారము కొంత ఆలోచించినా, వారిలో పూర్తి విశ్వాసము లేకపోవడము వలన కృష్ణుడు, ఏసు ఒక్కరేనను విషయము పూర్తి తెలియకుండా పోయినది. వారిలో దేవుని మీద కొంత విశ్వాసమున్నా ఒక విధముగా దేవుడే వారికి తెలియకుండా పోవునట్లు మార్గము ఏర్పరచాడని చెప్పగలము. ఎందుకనగా! భగవద్గీత గ్రంథములో మనిషిగా వచ్చిన కృష్ణుడు నేనే దేవున్ని అని ప్రకటించి చెప్పి, తర్వాత ఇజ్రాయేల్ దేశములో మనిషిగానే పుట్టి వచ్చినపుడు నేను దేవుని కుమారుడినని చెప్పడము జరిగినది. కొంత పరోక్షముగా ఏసే దేవుడను భావము వచ్చునట్లు కొన్ని వాక్యములలో అర్థమైనా, కొన్ని వాక్యములలో తండ్రివేరు, కుమారుడువేరనీ అలాగే ఏసు తాను దేవుని కుమారుడననీ, నా తండ్రి వాక్యములనే నేను చెప్పుదును అనీ చెప్పడము వలన ఏసు దేవుని కుమారుడని అర్థమైనది. ఎక్కడైనా కొందరు ఏసును దేవుడని చెప్పినా వెంటనే తమ మాటలలో ఏసు దేవుడు కాదు, ఏసు దేవుని కుమారుడని చెప్పుచుందురు. రెండు గ్రంథములలో వేరువేరు వాక్యములుండుట వలన వాటిలోని అంతరార్థము తెలియని వారికి ఏసు, కృష్ణుడు కాదని దృఢముగా తెలిసిపోయినది.

ఏసు పెద్ద జ్ఞాని అనీ, అందువలన తాను దేవుని కుమారుడినని చెప్పుచున్నాడనీ, ఇప్పుడు జ్ఞానము తెలిసిన తర్వాత అందరి తండ్రి అయిన దేవుడు పరలోకములో ఉన్నాడనీ, అందరివలె ఏసు కూడా ఒక మనిషే కావున, ఏసు తమకు అన్న అవుతాడని చెప్పుచూ కొందరు క్రైస్తవులు మా పెద్దన్న ఏసు అని అంటున్నారు. ఈ విధముగా ఏసు ఎవరో కూడా తెలియలేని క్రైస్తవులు ఏసు వెనుక జన్మలలో కృష్ణుడని ఎలా తెలియగలరు? పెద్ద బోధకులైన వారికే ఏసుగానీ, ఏసు బోధలుగానీ అర్థముకానప్పుడు, ఎక్కడో భారతదేశములో పుట్టి గీతను బోధించి ఇందువుగా చెలామణి అయిన కృష్ణుడు ఎవరో ఎలా తెలియగలరు? అదే విధముగానే భారత దేశములో పుట్టిన కృష్ణుడు ఎవరో ఆయన జ్ఞానమేమిటో నేటికినీ సరిగా అర్థముకానప్పుడు, ఆయనే ఏసుగా పుట్టాడని మేము అనినా విని ఓర్చుకోలేని స్థితిలో ఉన్నారు. కృష్ణుడు హిందూమతములో పుట్టిన ప్రవక్త అని కొందరు చెప్పుచుండగా, కృష్ణున్ని జ్ఞానిగానే గుర్తించక జారునిగానూ, చోరునిగానూ చెప్పువారు కలరు. ఇజ్రాయేల్ దేశములో పుట్టిన ఏసును క్రైస్తవ మత ప్రవక్తగా చెప్పు క్రైస్తవులు ఆనాడు ఏమాత్రము ఆయనను గుర్తించక, గౌరవించక, అనవసర ఆరోపణలతో న్యాయస్థానమునకు రప్పించి, శిక్ష వేయించి దగ్గరుండి చంపించారు. నేడు ఆయన చనిపోయిన శిలువను గొప్పగా పెట్టుకొని ఆయన ఫోటోను కూడా సరిగా ఉంచుకోలేదు. దేవుడు మనిషిగా వచ్చి ఏసుగా పిలువబడగా, ముందు వచ్చినప్పుడు కృష్ణునిగా పిలువబడినాడని తెలియకపోవడము పెద్ద అజ్ఞానమనియే చెప్పవచ్చును. భారతదేశములో పుట్టిన కృష్ణునికి అంతకుముందు ఎవరికీ పెట్టనిపేరు పెట్టడము జరిగినది. అలాగే ఇజ్రాయేల్ దేశములో పుట్టిన ఏసుకు కూడా అర్థముతో కూడిన పేరే పెట్టడము జరిగినది.

భారత దేశములో ఎన్నో ప్రాంతీయ భాషలున్నపటికీ ఎక్కువ విస్తీర్ణములో హిందీ భాష మాట్లాడుచున్నారు. దేశ భాషలలో చాలా తక్కువ మంది సంస్కృతమును మాట్లాడినా దానిని కొందరు స్వార్థముతోనో, అభిమానముతోనో గొప్ప భాషగా చెప్పుచున్నారు. ఇన్ని భాషలలో "కృష్ణ" అను పదము పూర్తిగా ఏ భాషలోనిదో చెప్పలేనుగానీ, పదమునకున్న అర్థమును పూర్తిగా చెప్పగలను. కృష్ణా అనగా నల్లని అని అర్థము. నల్లని జింకలను కృష్ణజింకలనడము జరుగుచున్నది. నలుపును కృష్ణ అనడము వలన కృష్ణుడు నల్లగా పుట్టాడని 'కృష్ణుడు' అని పేరు పెట్టడము జరిగినదని కొందరంటున్నారు. నల్లగావుంటే నల్లటోడు అని పేరు పెట్టడము ఆయనను హేళన చేసినట్లుండును కదా! అందువలన ఆ ఉద్దేశ్యముతో పేరు పెట్టడము జరిగియుండదు. ఆయనకు పేరు పెట్టు దినమున వారిలోని ఆత్మే ఆ విధముగా ప్రేరేపించి గొప్పవారి చేతనే పేరుపెట్టించడము జరిగివుంటుంది. ఏది ఏమైనా వచ్చినవాడు ఎవడో ఆత్మకు తెలియును కనుక ఆయనకు తగిన పేరును నిర్ణయించినదని అనుకుంటాను. కృష్ణ అంటే నలుపు, నలుపు అంటే కనిపించని చీకటని అర్థము. నల్లని తెరవలెనున్న చీకటిలో ఏదీ కనిపించదు, ఏదీ తెలియదు. మనకు దృష్టివున్నా చీకటిలో లేనట్లేననీ, ఎవరూ చూడలేని స్థితి చీకటియనీ చెప్పవచ్చును. ఎవరికీ తెలియనివాడే దేవుడు, కనుక చీకటితో పోల్చి చెప్పుచూ ద్వాపరయుగములో వచ్చిన దేవున్ని కృష్ణా అని పిలువడమూ, ఆయనను కృష్ణుడని చెప్పడమూ జరిగినది. కృష్ణా అంటే దేవుడను భావము తెలియనివారు నల్లనివాడైన దానివలన అలా పేరు పెట్టారనుకొన్నట్లు, ఆయన శరీర ఛాయకూడా నల్లగా వుండడము వలన ఆయన విషయములో పేరులోని అర్థమును కూడా ఎవరూ గుర్తించ లేకపోయారు. ఈ దినము మేము కృష్ణా అను పదమునకు తెలియని

దేవుడని అర్థము చెప్పితే మా మాటను కల్పన అనువారు కూడా కలరు. ఎవరు గ్రహించినా గ్రహించకున్నా కృష్ణుడు మనిషిగావచ్చినా, నేను మీకు తెలియని వాడినేయని చెప్పినట్లు ఆయన పేరు కలదు.

ఇజ్రాయేల్ దేశములో పుట్టిన ఏసు పేరు కూడా విశేష అర్థమును కల్గియున్నది. అప్పుడు ఆ ప్రాంతములో గల హెబ్రీ భాషలో ఏసు అంటే రక్షకుడు అని అర్థమని చెప్పడము విన్నాము. జ్ఞానశక్తి నిచ్చి కర్మలను లేకుండ చేయు విధానమును తెలిపి, కర్మలనుండి రక్షించువాడు గనుక అతనికి ఏసు అని పేరు పెట్టి పిలువడము జరిగినది. అయినా ఆనాడు కనిపించు ఆ వ్యక్తిలో నిజముగా అటువంటి శక్తి యున్నదని ఎవరూ తెలుసు కోలేకపోయారు. తనను తాను రక్షించుకోలేనివాడు ఇతరులను ఎలా రక్షించుతాడని అనుకొన్నారు తప్ప ఆయన రక్షణ విధానమును గ్రహించ లేకపోయారు. ప్రత్యక్షముగా హింసించి పేరుకు తగినట్లు లేడే అనిన వారు కూడా కలరు. ఈ విధముగా దేవుడు ప్రత్యేక మనిషిగా భూమిమీదికి వచ్చునప్పుడు, ప్రత్యేకమైన పేరుతోనే రాగలడని అర్థమగుచున్నది. ఈ మారు ప్రత్యేకమైన పేరుతో వచ్చినా, మనుషులు ఎవరూ గుర్తించలేనట్లే ఆయన ఉండగలడు. మొదట తెలియనివానిని అనునట్లు కృష్ణయనీ, రెండవమారు కర్మలనుండి రక్షించువాడనన్నట్లు ఏసు అని పేరుతో వచ్చాడు. ఈ మారు నాకంటే మించినవాడు లేడు అను అర్థముతో రాగలడను కుంటాను. అయినా ఆయన ఏ పేరుతో వచ్చినా ఎవరూ గుర్తుంచుటకు వీలులేకుండానే వచ్చును. ఎప్పుడు వచ్చినా తనకు తగిన అర్థమునిచ్చు పేరుతోనే రాగలడు. భగవద్గీత, బైబిలును చెప్పినవాడు ఒక భగవంతుడే అయినా, ఖుర్ఆన్ గ్రంథమును చెప్పినది మనిషివలెనున్న భగవంతుడు కాదు. అంతిమ దైవ గ్రంథమని పేరుగాంచిన దానిని చెప్పిన జిబ్రయేల్

ఒక గ్రహమని మరువకూడదు. సూర్యగ్రహము జ్ఞానమును భూమిమీద బోధించినట్లు జిబ్రయేల్ అను గ్రహము కూడా దేవుని జ్ఞానమును బోధించడము జరిగినది. అంతేగానీ ఖుర్ఆన్ను భగవంతుడు వచ్చి చెప్పలేదు.

ముఖ్యముగా గమనించితే బైబిలును భగవంతుడు, ఖుర్ఆన్ను ఖగోళ గ్రహము చెప్పగా, భగవద్గీతను గ్రహమూ, భగవంతుడూ ఇరువురూ చెప్పారు. ఒకప్పుడు సూర్యగ్రహమూ, ఒకప్పుడు భగవంతుడూ ఇరువురూ చెప్పడము వలన, భగవద్గీతను రెండు గ్రంథములకంటే ముందు చెప్పడము వలన, అది ప్రథమ దైవ గ్రంథమని పేరుగాంచినది. ఇద్దరు బోధించిన జ్ఞానము ఉండుటవలన ఒక విధముగా ప్రథమ గ్రంథమైతే, అన్నిటికంటే ముందు గ్రంథరూపమైన దానివలన కూడా గీతయే ప్రథమ దైవ గ్రంథమైనది. ద్వితీయ గ్రంథముగా వ్రాయబడిన బైబిలును ఏసు ఒక్కరు చెప్పినా, అంతిమ దైవ గ్రంథముగా వ్రాయబడిన ఖుర్ఆన్ను జిబ్రయేల్ ఒక్కరే చెప్పినా, బైబిలు జ్ఞానమును మూడు సంవత్సరములు, ఖుర్ఆన్ గ్రంథ జ్ఞానమును ఇరువది మూడు సంవత్సరములు చెప్పినా ఇటు ఏసుగానీ, అటు జిబ్రయేల్ గానీ వేరువేరు జ్ఞానమును చెప్పక, ఒకే జ్ఞానమును చెప్పడమేకాక ఇరువురూ ప్రథమ గ్రంథమును ధృవీకరిస్తూ చెప్పారు. దానినిబట్టి చూస్తే ప్రథమ గ్రంథమైన భగవద్గీతకు మిగతా రెండు గ్రంథములు సాక్ష్యమిచ్చునట్లు కనిపించుచున్నది. ఎక్కడగానీ ఒక గ్రంథమును మరొక గ్రంథము ఖండించడముగానీ, భిన్నముగా చెప్పడముగానీ లేదు. అట్లు లేకపోవడమే కాకుండా భగవద్గీతను సమర్థించుటకే మేము వచ్చాముగానీ, తప్పు పట్టుటకుగానీ, ఖండించుటకుగానీ కాదని గ్రంథములలోనే చెప్పడమైనది. ద్వితీయ దైవ గ్రంథమైన బైబిలు క్రొత్త నిబంధనలో మత్తయి సువార్తయందు

5వ అధ్యాయమున 17, 18 వచనములలో ఏసు ఇలా చెప్పాడు (17) "ధర్మశాస్త్రమునైనను, ప్రవక్తల వచనములనైననూ కొట్టివేయవచ్చితినని తలంచవద్దు. నెరవేర్చుటకేగానీ కొట్టివేయుటకు నేను రాలేదు." (18) "ఆకాశము భూమియు గతించి పోయినా గానీ, ధర్మశాస్త్రమంతయు నెరవేరు వరకు దానినుండి ఒక పొల్లయిననూ, ఒక సున్నయైననూ తప్పిపోదని నిశ్చయముగా మీతో చెప్పుచున్నాను." ఈ రెండు వాక్యములలో విశేషముగా ధర్మశాస్త్రమనునదే గలదు. ధర్మశాస్త్రమనునది ఏది అను ప్రశ్నించుకొని చూస్తే ఏసు పుట్టకముందు గల పాత నిబంధనలలో ధర్మశాస్త్రమును గురించియున్నా, వారు దేనిని గురించి చెప్పుకొన్నారో నాకు తెలియదు. నాకు తెలిసిన ధర్మశాస్త్రము దేవుడు చెప్పినదొక్కటే. మనుషులు చెప్పినది ఏదికానీ ధర్మశాస్త్రము కాదు. ఏసు రాకముందు గల ధర్మశాస్త్రము ఒక్కటే గలదు. దేవుని ధర్మములతో కూడుకొన్నదే ధర్మశాస్త్రము. అందువలన అంతకుముందు ఒకే ఒక ధర్మశాస్త్రమున్నది. అదియే ఆది దైవ గ్రంథమైన భగవద్గీత. భగవద్గీత తర్వాత తయారైన రెండవ ధర్మశాస్త్రము బైబిలు. బైబిలుకంటే ముందు ఒకే ఒక భగవద్గీత ప్రపంచమునకంతటికీ ధర్మ శాస్త్రమైనందున ఆ దినము ఏసు తన గ్రంథములో మొదటి గ్రంథమును గురించి చెప్పుచూ 'ధర్మశాస్త్రము' అను పదమును ఉపయోగించాడు.

ఏసు చెప్పిన వాక్యములో ధర్మశాస్త్రము తర్వాత ప్రవక్తల వచనముల నైననూ అని అన్నాడు. ముందు ఏక వచనములో ధర్మశాస్త్రమును చెప్పి తర్వాత బహువచనములో ప్రవక్తలనైననూ అన్నాడు. దీనిని గురించి నేను ఏమి చెప్పుచున్నానంటే, దేవుని జ్ఞానమును బోధించు వారందరూ ప్రవక్త లేనని మా రచనలలోని **"ప్రవక్తలు ఎవరు?"** అను గ్రంథములో చెప్పాము. దీనిప్రకారము దేవుని బోధను బోధించువారు ఎందరైనా, ఎవరైనా ప్రవక్తలు

కావచ్చును. అయితే ధర్మశాస్త్రము ఒక్కటే ఉంటుంది. రెండు మూడు వుండవు. బైబిలును, ఖుర్ఆన్‌ను వేరువేరు పేర్లతో దైవగ్రంథములనినా అవన్నియు ఒకే ధర్మశాస్త్రమునకు సంబంధించినవే. ఒకే ధర్మశాస్త్రమునే వేరువేరు దేశములలో చెప్పుకొని వారు వేరువేరు పేర్లు పెట్టుకోవడము జరిగినది. ధర్మశాస్త్రము ఎప్పటికీ ఒకటేవుండును. కానీ ప్రవక్తలు ఎందరైనా ఉండవచ్చును. ధర్మశాస్త్రమునుగానీ, ధర్మశాస్త్రములోని జ్ఞానమును బోధించు ప్రవక్తల వచనములనుగానీ నేను ఖండించుటకు రాలేదు, నెరవేర్చుటకే వచ్చానని ఏసు చెప్పాడు. ఇక్కడ ఇంకొకమాట చెప్పునదేమనగా! ధర్మశాస్త్రమును బోధించువారే ప్రవక్తలగుదురుగానీ, ప్రవక్తలను పేరు పెట్టుకొన్న వారందరూ బోధించినది ధర్మశాస్త్రము కాదని చెప్పవచ్చును. అందువలన 17వ వాక్యములో ముందు ధర్మశాస్త్రమని చెప్పి తర్వాత ప్రవక్తల వచనములని చెప్పారు.

బైబిలు కూడా ధర్మశాస్త్రమునకు సంబంధించిన గ్రంథమే అయినందున బైబిలును బోధించినవాడు ధర్మశాస్త్రమునకు వ్యతిరేఖముగా మాట్లాడడు. కావున ఏసు ధర్మశాస్త్రమును నేను ఖండించుటకు రాలేదు అన్నాడు. కృష్ణుడుగానీ, ఏసుగానీ వీరు ఇరువురు ధర్మశాస్త్రములోని విషయములను బోధించుట వలన ఇద్దరినీ ప్రవక్తలని చెప్పవచ్చును. ముందు చెప్పబడిన ధర్మశాస్త్రము భగవద్గీత, దానిని చెప్పినవాడు మనిషి రూపములోనున్న దేవుడే అయినా, దేవుని జ్ఞానము బోధించువాడు ప్రవక్త అను సూత్రము ప్రకారము కృష్ణున్ని ప్రవక్త అని చెప్పవచ్చును. కృష్ణుడు భగవంతుడుకాదా అని అంటే మానవ అవతారములోనున్న దేవుడైనందున, ఎవరికీ తెలియని దేవుని జ్ఞానమును చెప్పువాడు భగవంతుడు అను సూత్రము ప్రకారము కృష్ణుడు భగవంతుడే అవుతాడు. కృష్ణుడు భగవంతుడు మరియు

ప్రవక్త అని చెప్పవచ్చును. అంతేకాక కృష్ణుడు ప్రవక్తగా కనిపించు భగవంతుడని చెప్పవచ్చును. భగవద్గీతను బోధించిన కృష్ణున్ని ప్రవక్త అన్నాము. తర్వాత ఆ గ్రంథమును (ధర్మశాస్త్రమును) ఎవరు బోధించినా ప్రవక్తలే అగుదురు. ఆ విధముగా ప్రవక్తలు ఎందరైనా కావచ్చును. భగవంతుడు మాత్రము ఒక్కడే ఉండును. అలాగే ధర్మశాస్త్రమును అనుసరించిన గ్రంథములు ఎన్నైయినా ఉండవచ్చును. కానీ ధర్మశాస్త్రము మాత్రము ఒక్కటే ఉండును.

ధర్మశాస్త్రము ఒక్కటే, దానిని బోధించు భగవంతుడు ఒక్కడే. అయితే ధర్మశాస్త్రము వేరురూపములోయున్నా, దానిని బోధించు భగవంతుడు వేరు రూపములో ప్రవక్తగాయున్నా భగవంతుడు ఎప్పటికీ తన ధర్మశాస్త్రమునకు వ్యతిరేఖముగా మాట్లాడడు. అలాగే ధర్మశాస్త్రమును బోధించు ప్రవక్తలకు వ్యతిరేఖముగా మాట్లాడడముగానీ, ఖండించడముగానీ ఉండదు. అలా వ్యతిరేఖముగా మాట్లాడితే తన ముఖమునకు తానే మసి పూసుకొన్నట్లు, తన చేతులను తానే నరుకుకున్నట్లగును. ఏసు ఇశ్రాయేల్ దేశమున బైబిలు గ్రంథమును చెప్పినా, ఆ బైబిలు ధర్మశాస్త్రమైన భగవద్గీతను అనుసరించియే ఉండును. ఏసు కనిపించు మనిషిగా బైబిలును చెప్పినా, ఆయన గతజన్మలో కృష్ణుడే అయినందున తన శాస్త్రమును తానే ఖండించడముగానీ, తన జ్ఞానమునే బోధించు ప్రవక్తల బోధలకు వ్యతిరేఖముగా మాట్లాడడముగానీ జరుగదు. అందువలన మత్తయి సువార్త ఐదవ అధ్యాయములో 17వ వచనమందు "ధర్మశాస్త్రమునైననూ, ప్రవక్తల వచనములనైననూ కొట్టివేయ వచ్చితినని తలంచవద్దు. నెరవేర్చుటకే గానీ కొట్టివేయుటకు నేను రాలేదు" అని అన్నాడు. ఈ వాక్యములోనున్న ధర్మశాస్త్రము అంటే ఏమిటో, ఏ ఉద్దేశ్యములో ఆ మాట చెప్పాడో అర్థమై

ఉంటుంది. అలాగే ప్రవక్తల మాటలని దేనిని గురించి అన్నాడో కూడా తెలిసియుంటుంది. కొట్టివేయవచ్చితినని తలంచవద్దు అన్నాడు. ఆ మాటలు కూడా తన జ్ఞానమును తానే ఖండించడు, కొట్టివేయడని కూడా అర్థమైనది. ఇకపోతే వాక్యము చివరిలో "నెరవేర్చుటకే గానీ కొట్టివేయుటకు నేను రాలేదు" అని అన్నాడు. ఆ మాటను గురించి వివరించుకొంటే ధర్మ శాస్త్రమును బ్రహ్మావిద్యాశాస్త్రము అని మనము చాలామార్లు చెప్పుకొన్నాము. బైబిలు, ఖురాన్ రెండూ కూడా బ్రహ్మావిద్యాశాస్త్రమునకు సంబంధించినవే నని కూడా చెప్పాము. ద్వాపరయుగములోనే గ్రంథరూపముగా మారిన భగవద్గీతను మొదటి దైవ గ్రంథము అని చెప్పుకొన్నాము. భగవద్గీతలో చెప్పిన ధర్మములు ఎక్కడ లేకుండా పోతాయో అక్కడ దేవుడు భగవంతునిగా అవతరిస్తాడని కూడా చెప్పాము. అలా అవతరించినవాడు తన ధర్మములను ఆచరించి చూపించి, ప్రజలను కూడా వాటి ప్రకారము నడుచునట్లు చేయును. ఆ విధముగా ధర్మశాస్త్రములోని ధర్మములను ఆచరించి చూపించుటకు వచ్చిన ఏసు వాటిని సమర్థించునుగానీ, ఖండించడు కదా! అందువలననే నేను నెరవేర్చుటకేగానీ కొట్టివేయుటకు రాలేదు అన్నాడు. ఒక్క 17వ వాక్యములో నిగూఢముగా ఇమిడియున్న ఆనాటి ఏసు భావమును వివరముగా చెప్పుకొంటే ఈ వాక్యము ఎంతో దగ్గరగా అర్థమగుచున్నది.

ధర్మశాస్త్రమును నెరవేర్చుటకు వచ్చాను అని అనినప్పుడు ధర్మ శాస్త్రము ముందే భూమిమీద ఉందను భావము అందరికీ తెలిసిపోయినా, వాస్తవముగా అదేదో ఎవరికీ తెలియకుండాపోయినది. దేవుడు ముందే భగవంతునిగా వచ్చి చెప్పిన దానిని వదలి మనుషులు వ్రాసుకొన్న ఏదో ఒక గ్రంథమును ధర్మశాస్త్రము అనుకొన్నారు. ఈ ప్రపంచములో ధర్మ

శాస్త్రమును మించిన గ్రంథము మరొకటి ఉండదు. బ్రహ్మవిద్యను (దేవుని విద్యను) సూత్రబద్ధముగా చెప్పిన దానిని బ్రహ్మవిద్యాశాస్త్రము లేక ధర్మ శాస్త్రము అని అంటున్నాము. ఏసు రాకముందే సృష్ట్యాదిలోనే చెప్పబడి, తిరిగి రెండవమారు భగవంతుని ద్వారా చెప్పబడి, మొదట గ్రంథరూపమైన శాస్త్రము ఏదైతే వుందో దానినే నెరవేర్చుటకు ఏసు వచ్చాడు. ఆయనకంటే ముందు మూడువేల సంవత్సరముల పూర్వమే వచ్చిన ధర్మశాస్త్రమే భగవద్గీతయని కనీసము ఒక్కరైనా తెలియలేకపోయారు. భగవద్గీతలో చెప్పిన జ్ఞానమును బోధించుటకు వచ్చిన ఏసు దానిని పూర్తి ఆచరించి చూపిస్తాననీ, దానిలోని ఏ విషయమునైనా ఎవరూ ఖండించలేరని బలముగా చెప్పుచూ, మత్తయి సువార్త 5వ అధ్యాయము, 18వ వాక్యములో "ఆకాశము భూమియు గతించిపోయినాగానీ, ధర్మశాస్త్రమంతయు నెరవేరువరకు దానినుండి ఒక పొల్లయిననూ, ఒక సున్నయైననూ తప్పిపోదని నిశ్చయముగా మీతో చెప్పుచున్నాను" అని అన్నాడు. ఈ వాక్యములో గ్రంథములోని పొల్లు (కామా) గానీ, సున్నగానీ అన్నప్పుడు బాహ్యముగా వ్రాతలోయున్న కామాను సున్నను చెప్పాడని అనుకోకూడదు. కామా సున్నా అనడములోని ఉద్దేశ్యమేమనగా! ధర్మశాస్త్రములోని ఏ చిన్న సూత్రము కూడా తప్పిపోదు అన్నీ జరిగితీరునని చెప్పుటకు పోలికగా పొల్లు, సున్నా అన్నాడని గ్రహించ వలెను. వ్రాతలో పొల్లులు సున్నాలున్నట్లు ధర్మములలో ప్రతీదీ శాసన బద్ధముగా నిర్దేశింపబడినదని తెలుపుటకు అలా చెప్పడమైనది. శాసన రూపమైనది శాస్త్రము. శాస్త్రము అమలు జరిగి నెరవేరునది. దేవుని శాసనములతో ఉన్నదే ధర్మశాస్త్రము. అందులోని ప్రతి శాసనము చిన్నదిగానీ పెద్దదిగానీ నెరవేరునని నిశ్చయముగా భగవంతుడైన ఏసు చెప్పాడు. ఈ వాక్యములో మొదటనే ఆకాశము భూమియు గతించిపోయినాగానీ అని

అన్నారు. ఆ మాటను ఎందుకు ఉపయోగించి చెప్పాడో వివరించుకొని చూస్తాము.

విశ్వముంది అంటే పైన ఆకాశము, క్రింద భూమి, ఆ రెండిటి మధ్యలో గాలి, అగ్ని, నీరు మూడు గలవు. పైన ఆకాశమును ఆధారము చేసుకొని గాలి ఉండగా, క్రింద భూమిని ఆధారము చేసుకొని నీరు, నిప్పు రెండూ గలవు. పైనగల ఆకాశము గతించిపోతే దానిని ఆధారము చేసుకొన్న గాలి కూడ పోవును. అలాగే క్రింద భూమిపోతే దానిని ఆధారము చేసుకొన్న నీరూ, నిప్పు రెండూ పోవును. మొత్తము పంచ భూతములనబడు ఐదూ పోవును. దానితో ఈ విశ్వమే లేకుండా పోవునని అర్థము. సృష్ఠి గతించినా దేవుడుగానీ, దేవుని జ్ఞానము (ధర్మములు) గానీ నశించవు అని మేము పలుమార్లు చెప్పాము. దీనితో సృష్ఠికంటే గొప్పది దేవుని జ్ఞానమని తెలియు చున్నది. మొత్తము సృష్ఠికంటే గొప్పది ధర్మశాస్త్రము అని అందరికీ తెలియు నట్లు 18వ వాక్యములో ఆకాశమూ, భూమియూ గతించినా అని గట్టిగా చెప్పడమైనది. అంతగా ఏసు ధర్మశాస్త్రమును గురించి చెప్పితే అది ఎంత గొప్ప శాస్త్రమైవుంటుందో ఎవరికైనా అర్థముకాగలదు. అయితే ఏసు రాకముందే భూమిమీదవున్న ధర్మశాస్త్రమేది అని అందరూ ఆలోచించ లేకపోయారు, దానిని తెలియలేకపోయారు. కొందరు మోషే ప్రవక్త, యెషయా ప్రవక్త, యిర్మియా ప్రవక్త చెప్పిన వాక్యములనే ధర్మశాస్త్రమను కొన్నారు. బైబిలులో అక్కడక్కడ కొన్ని సంఘటనలు జరిగినప్పుడు "ఇది యిర్మియా ప్రవక్త చెప్పినట్లు నెరవేరెను" అని వ్రాయడమూ, అట్లే కొన్నిచోట్ల "యెషయా ప్రవక్త మోషే ప్రవక్త ముందే వ్రాసియున్న లేఖనము నెరవేరెను" అని వ్రాసియుండుట చేత చాలామంది పొల్లు పోకుండా నెరవేరడమంటే అదేనని అనుకొన్నారు. ఏసును గురించి ముందే భవిష్యత్తును చెప్పినట్లు

యెషయా వ్రాసియుంచిన వాక్యములు అన్నీ నెరవేరుచూ వచ్చాయి. అలా ముందే వ్రాసిన లేఖనములు ఒకదాని తర్వాత మరొకటి నెరవేరడమును చూచిన అక్కడి మనుషులు ఆ లేఖనముల గ్రంథమునే ధర్మశాస్త్రమను కొన్నారు. ధర్మశాస్త్రము తప్పక నెరవేరునని ఏసు చెప్పినట్లు యెషయా ప్రవక్త ముందే ఏసు జననమును గురించి, ఆయన జీవితమును గురించి వ్రాసిన వాక్యములు నెరవేరడమును చూచిన వారందరూ యెషయా వ్రాసినదే ధర్మశాస్త్రమనుకొన్నారు. అక్కడే పెద్ద పొరపాటుపడిపోయి ధర్మశాస్త్రమనునది మరొకటున్నదను ఆలోచన చేయలేక పోయారు. ధర్మశాస్త్రము మనుషులైన ప్రవక్తలు వ్రాసినది కాదని, ప్రవక్తగా యున్న భగవంతుడు (దేవుడు) వ్రాసిన గ్రంథమని తెలియలేకపోయారు. అందువలన క్రైస్తవులందరూ ముఖ్యమైన ఘట్టములో పొరపడిపోయి అసలైన ధర్మశాస్త్రమును తెలియలేకపోయారు.

ఉదాహరణగా మీకు ఒక విషయమును చెప్పుతాను చూడండి. యెషయా ప్రవక్త ఏసు జీవితమును తనలోనున్న అద్భుతశక్తిచేత ముందే వ్రాసియుంచాడు. అలా వ్రాసిన ప్రతి వాక్యము ఒకటి కూడా పొల్లు పోకుండా ఏసు జీవితములో నెరవేరింది. ఆ విషయము క్రైస్తవులందరికీ తెలుసు. ముందు జరుగబోవు విషయములను ప్రవక్త చెప్పినా లేక సాధారణ మనిషి చెప్పినా వాటిని జ్యోతిష్య శాస్త్రమును అనుసరించి చెప్పినవని అనాలి గానీ, ధర్మశాస్త్రము ప్రకారము చెప్పినవని అనుకోకూడదు. చెప్పినవాడు జ్యోతిష్యుడైనా అయివుండవచ్చు లేక ప్రవక్తయైనా అయివుండవచ్చు, చెప్పిన విషయమునుబట్టి అది జ్యోతిష్యశాస్త్రమునకు సంబంధించినదా లేక ధర్మశాస్త్రమునకు సంబంధించినదా అని ఆలోచించాలి. జరుగబోవు భవిష్యత్తును గురించి చెప్పియుంటే అది ఎప్పటికీ ధర్మశాస్త్రముకాదు.

దానిని జ్యోతిష్యశాస్త్రమనియే చెప్పాలి. భారతదేశములోని ఆంధ్రప్రదేశ్ (ఇప్పుడు సీమాంధ్ర) లో కడపజిల్లాలోని కందిమల్లయ్యపల్లెలో విశ్వ బ్రాహ్మణ కులమున నాలుగువందల సంవత్సరముల క్రిందట పోతులూరి వీరబ్రహ్మము అను వ్యక్తి జన్మించి ఆధ్యాత్మికవేత్తగా కొంత పేరు సంపాదించుకొన్నాడు. అంతేకాక కాలజ్ఞానమను పేరుతో ముందు జరుగబోవు అనేక విషయము లను వ్రాసి దివ్యజ్ఞాని అని అందరిచేత అనిపించుకొన్నాడు. ఆయన చెప్పిన జ్ఞాన విషయములు ప్రజలకు అంతగా తెలియకపోయినా, ఆయన చెప్పిన భవిష్యత్తు విషయములు ప్రజలను బాగా ఆకర్షించాయి. ఆయన తన కాలజ్ఞానమున వ్రాసిన అనేక విషయములు అప్పుడప్పుడు నెరవేరుచూ వచ్చాయి. ఇంకా నెరవేరబోవు విషయములు ఎన్నో గలవు. మిగిలినవి కూడా నెరవేరుననీ, ఆయనమాట కూడా పొల్లు పోకుండా చెప్పినవి చెప్పినట్లు నెరవేరుచున్నవని ప్రజలు అనుకొనుచున్నారు.

మాకు తెలిసిన విచిత్రమేమంటే! ఎప్పుడో మూడువందల యాభై సంవత్సరముల క్రితమే ఆయన నా పేరుతో సహా, మా ఆశ్రమము పేరుతో సహా కొన్ని వాక్యములు వ్రాసిపెట్టియుంచాడు. ఈ మధ్యకాలములో ఆ విషయము మాకు తెలిసినది. ఆయన వ్రాసిన వాటిలో ఉదాహరణకు రెండు వాక్యములను చెప్పుచున్నాను చూడండి. **1) ప్రబోధాశ్రమము ఉన్నతమైన జ్ఞానము కలది. 2) ప్రబోధాశ్రమము వారు శయనాధిపతి గుణములు కల్గియున్నారు.** ఈ రెండేకాక ఇంకా అనేకము కలవు. ఈ రెండులో ముఖ్యముగా మా పేరు, మా ఆశ్రమము పేరు ఉండడము గమనించదగ్గ విషయము. శ్రీ వీరబ్రహ్మముగారు చెప్పినట్లే మాకు సంబంధించిన కొన్ని విషయములు ఇప్పటికే నెరవేరినవి. అంతమాత్రమున మేము బ్రహ్మముగారు చెప్పిన కాలజ్ఞానమును ధర్మశాస్త్రము అనలేము

కదా! ఎందుకనగా ఈ విషయములన్నియు జరుగబోవు కాలమునకు సంబంధించినవి. కావున అన్నియు జ్యోతిష్యశాస్త్ర విషయములనియే చెప్పవచ్చును. అంతేకాక జరుగబోవు విషయములను ముందే తెలిసి వ్రాసిన దివ్యజ్ఞాని అయిన బ్రహ్మముగారు కూడ తాను వ్రాసిన గ్రంథమును కాలజ్ఞానమని చెప్పాడు తప్ప బ్రహ్మజ్ఞానమని చెప్పలేదు. ఒకవేళ తెలియనివారు ఎలా అనుకొనినా వారిమాటను లెక్కించక ఆయన చెప్పిన కాలజ్ఞానములోని కొన్ని వాక్యములు మా జీవితములో నెరవేరినా మేము అది ధర్మశాస్త్రముకాదు జ్యోతిష్యశాస్త్రము అని అంటున్నాము. అలాగే యెషయా వ్రాసిన గ్రంథములోని వాక్యములు (లేఖనములు) ఏసు జీవితములో నెరవేరినప్పటికీ ఆ లేఖనములను వీరబ్రహ్మముగారు చెప్పిన వాటిగా లెక్కించవచ్చునుగానీ, ధర్మశాస్త్రము యొక్క వాక్యములుగా లెక్కించకూడదు. ఏది ధర్మశాస్త్రమో, దాని విధానము, దానిలోని ధర్మములు ఎట్లుండునో తెలియనివారు పొరబడి యెషయా వ్రాసిన గ్రంథమును ధర్మశాస్త్రముగా లెక్కించుకొన్నారు. దానిలోని పొల్లయినా నెరవేరక ఉండదని చెప్పుచున్నారు.

వాస్తవానికి ధర్మశాస్త్రము ఏసుకంటే ముందు మూడువేల సంవత్సరముల పూర్వమే భారత దేశమందు కృష్ణుని చేత చెప్పబడి వ్యాసుని చేత గ్రంథముగా వ్రాయబడినది. అందులోని జ్ఞానము సృష్ట్యాదిలో వచ్చిన దైనా ద్వాపరయుగము వరకు గ్రంథముగా వ్రాయబడలేదు. కృతయుగము మొదలులో చెప్పిన జ్ఞానము ద్వాపరయుగము చివరిలో గ్రంథరూపమైనది. ఆ విధముగా దేవుని ధర్మముల చేత కూర్చబడిన జ్ఞానమును భగవద్గీతయని చెప్పుచున్నాము. భగవద్గీత ప్రథమ దైవ గ్రంథమగుటయేగాక, విశ్వము మొత్తమునకు ధర్మశాస్త్రముగా నిలబడినది. ఇది అందరికీ కొంత

ఆశ్చర్యమును కల్గించు విషయమైనా ముమ్మాటికీ సత్యము. ఆ దినము ఏసు ధర్మశాస్త్రమును నెరవేర్చుటకు వచ్చినానని చెప్పి, చెప్పిన విధము గానే ధర్మశాస్త్రములోని సారాంశమునే చెప్పుచూ, అందులోని ఒక్కొక్క విషయమును ప్రజలకు బోధించాడు. అయినా ఆయన ఏమి చెప్పాడని చూచుకొను స్థితిలో మనుషులు లేరు. ఆనాటి నుండి నేటివరకు అలాగే కొనసాగుతూవుంది.

ఇగ్రాయేల్ దేశములో ముందు దేవుని దూత అయిన ఏసు వచ్చాడు. ఇంతకుముందే చెప్పాను. ఆయన పేరుకు దూతయేగానీ స్వయముగా దేవుడేనని చెప్పాను. అలాగే ఆయన పేరుకు ప్రవక్తయేగానీ, సాక్షాత్తు ప్రవక్తలకంటే గొప్పవాడైన భగవంతుడని చెప్పాను. నేను చెప్పడమే కాకుండా ఒక సందర్భములో తాను ప్రవక్తలకంటే గొప్పవాడినని కూడా చెప్పాడు. మత్తయి సువార్త 11వ అధ్యాయమున, 9వ వచనమున "ప్రవక్తకంటే గొప్పవానినని మీతో చెప్పుచున్నాను" అని అన్నాడు. ఏసు వచ్చిపోయిన తర్వాత ఆరు వందల (600) సంవత్సరములకు జిబ్రయేల్ అదే దేశమునకే వచ్చి ముహమ్మద్ ప్రవక్తకు 23 సంవత్సరములుగా దేవుని జ్ఞానమును చెప్పాడు. అలా ఏసు తర్వాత జిబ్రయేల్ గ్రహము ద్వారా చెప్పబడిన జ్ఞానము ప్రవక్త యొక్క చివరిదశలో ఇతరుల చేత ప్రవక్తగారు వ్రాయించగా ఖురాన్ గ్రంథమైనది. ముహమ్మద్ ప్రవక్తగారికి చదువురాదు, కనుక ప్రక్కనున్న వారితో వ్రాయించడము జరిగినది. చెప్పినది జిబ్రయేల్, వినినది ముహమ్మద్ ప్రవక్త, వ్రాసినది ముహమ్మద్ ప్రవక్త అనుచరులు. ఈ విధముగా ముగ్గురి మధ్య ఖుర్ఆన్ గ్రంథము తయారైనది. ముగ్గురిలో మొదటి జిబ్రయేల్ మహాజ్ఞాని అయినందున దూత వచ్చి చెప్పినచోట గ్రహము కూడా చెప్పవలెనను ఉద్దేశ్యముతో ఒకే దేశములోనే జిబ్రయేల్

కూడా చెప్పడమైనది. భారతదేశములో ముందు గ్రహము తర్వాత దూత వచ్చాడు. ఇగ్రాయేల్ దేశములో ముందు దూత వచ్చాడు తర్వాత గ్రహమైన జిబ్రయేల్ వచ్చాడు. దూతలుగా వచ్చినవారు ప్రత్యక్షముగా చెప్పిన జ్ఞానము భగవద్గీత, బైబిలుగా రూపొందగా, కేవలము గ్రహము చెప్పినది మాత్రము ఖుర్ఆన్ గ్రంథముగా తయారైనది. ఏ విధముగానైనా మూడు గ్రంథములలో దేవుని ధర్మములే ఉండుట వలన మూడూ భూమిమీద దైవ గ్రంథములైనవి.

మూడు దైవ గ్రంథములలో ముందు పుట్టిన భగవద్గీత ప్రథమ దైవ గ్రంథముకాగా, తర్వాత పుట్టిన బైబిలు మధ్యమ దైవ గ్రంథమైనది. చివరిలో పుట్టిన ఖుర్ఆన్ అంతిమ దైవ గ్రంథమైనది. ఇక్కడ కొందరికి ఒక ప్రశ్న వచ్చుటకు అవకాశమున్నది. అది ఏమనగా! భూమిమీద దేవుడు చెప్పిన గ్రంథము ఒక్కటుంటే సరిపోదా? మూడు ఉండుట వలన ఏది గొప్పనో, ఏది తక్కువనో అర్థముకాక పోవును కదా! అని కొందరు ప్రశ్నించవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! మీకు వచ్చిన ప్రశ్న మంచిదే. భారతదేశములో చెప్పిన జ్ఞానము మూడు వేల సంవత్సరములైనా బయటి దేశములకు ప్రాకకుండా పోవడము వలన ఇగ్రాయేల్ దేశములో చెప్పడమైనది. ఒక విధముగా మానవులలోని భక్తిని వడపోయుటకు మూడు గ్రంథములు వచ్చునట్లు దేవుడే చేశాడని మనము అనుకోవచ్చును. మూడు గ్రంథములుగా దేవుని జ్ఞానముండుట వలన నిజమైన శ్రద్ధకలవానికి, నిజమైన భక్తిగలవానికి మూడు గ్రంథములలోని జ్ఞానము ఒక్కటేనని, ఒక్క దేవునిదేనని తెలియును. పైకి జ్ఞానము మాట్లాడుచూ భక్తిగా కనిపించినా అంతరంగమున మూడు గ్రంథముల మీద ఒకే భావము లేనివారికి అవి వేరువేరు విధానములు బోధించునట్లు కనిపించును. అందువలన కొందరు ఒక గ్రంథమును ఆశ్రయించి మిగతా రెండు గ్రంథములను

వ్యతిరేఖించుచూ, భేద భావముతో మాట్లాడుచుందురు. అటువంటి వారు మూడు గ్రంథములను మూడు మతముల బోధలుగా వర్ణించుకొని మిగతా వారికి కూడా అదే బోధించుచున్నారు. దేవుడు చెప్పినది ఒక్కటైతే, మనుషులు మూడుగా చేసుకోవడము వలన వారికి జ్ఞానములో పరిపక్వత లేదని తెలిసిపోవుచున్నది. ఎవరి జ్ఞానము వారికి గొప్పగ కనిపించగా దేవుడు చెప్పిన మార్గమును వదలి ప్రక్కదారిలో పోవుచూ తనదే సరియైన మార్గమనుకొనుచున్నారు.

దేవుడు ఎవరిది ఎంత భక్తియో వారికే తెలియుటకు తన జ్ఞానమును మూడు గ్రంథములుగా భూమిమీదికి పంపాడు. ఇదియంతయు ఒక పథకము ప్రకారము చేసిన పనియని అర్థమగుచున్నది. మూడు గ్రంథములుగా దేవుడు ఇచ్చినా వాటిలో వెనుక వచ్చిన రెండు గ్రంథములు ముందు వచ్చిన గ్రంథములోని జ్ఞానము నిజమైనదని సాక్ష్యము చెప్పుటకు వచ్చాయనీ, వెనుక రెండు గ్రంథములు ముందు వచ్చిన గ్రంథమును ఇది నిజమైన దైవ గ్రంథమని దృఢపరచుటకు వచ్చినవేగానీ, ఆ గ్రంథములలోని జ్ఞానము గొప్పదని చెప్పుటకు కాదనీ, దేవుడు మిగతా రెండు గ్రంథముల యందు తెలిపాడు. బైబిలులో మత్తయి సువార్త ఐదవ అధ్యాయమున 17వ వాక్యములో అదే విషయమునే ఏసు చెప్పాడు. భగవద్గీతను ధృడపరచుటకు బైబిలులోని మత్తయి సువార్త ఐదవ అధ్యాయము 17వ వచనమున్నదని ఎవరికీ అర్థము కాలేదు. కొందరికి నా మాట నచ్చక పోవచ్చును. అటువంటి వారు తమకు తామే ప్రశ్నించుకొని 17వ వచనము యొక్క వివరము తెలుసుకోమంటున్నాను. కొందరు హిందూమతములోని భగవద్గీతను గొప్పగా చేసి, మిగతా గ్రంథములను తక్కువ చేయుచున్నారని కూడా అనవచ్చును. నేను ఉన్న సత్యమును చెప్పుచున్నానుగానీ, అన్ని

గ్రంథములలోని సారాంశము ఒక్కటేనని నాకు తెలుసు. దేశములో ఎవరికైన మతముల పిచ్చియుండవచ్చునుగానీ ఇక్కడ అటువంటిది ఏ కోణములోనూ కనిపించదు. ప్రథమ దైవ గ్రంథమును ద్వితీయ, అంతిమ దైవ గ్రంథములు రెండూ ధృఢపరచుచున్నవని ఆయా గ్రంథములలోని విషయములను ఎత్తి చూపుచున్నాను.

అంతిమ దైవ గ్రంథమైన ఖుర్ఆన్ గ్రంథములో ఆరవ సూరా యందు 92వ వాక్యమున ఇలా కలదు చూడండి. “ఇది (ఖుర్ఆన్) కూడా మేము అవతరింపజేసిన గ్రంథమే. ఎంతో శుభప్రదమైనది. తనకంటే ముందున్న గ్రంథాలను ధృవీకరించేది” అని కలదు. దీనిప్రకారము ఖుర్ఆన్ కంటే ముందు గలవి ప్రథమ, మధ్యమ దైవ గ్రంథములైన భగవద్గీత, బైబిలు కలవు. ఆ రెండు గ్రంథములను ఖుర్ఆన్ గ్రంథము తన జ్ఞానము ద్వారా ధృవీకరించుచున్నది. ఈ రెండు గ్రంథములు సత్యమని చెప్పడమే ధృవీకరణ అని తెలియాలి. రెండవ గ్రంథము మొదటి గ్రంథమును బలపరుచుచున్నది. కావున మూడు గ్రంథములలో మొదటి గ్రంథమును మిగతా రెండు గ్రంథములు సమర్థించుచున్నవి. మొదటి గ్రంథము వచ్చినప్పుడు మిగతా రెండు గ్రంథములూ లేవు, కనుక వాటి ప్రస్తావన దానిలోలేదు. అయినప్పటికీ మొదటి గ్రంథములోని విషయములే మిగతా రెండు గ్రంథములయందు కలవు. గ్రంథములుగానీ, వాటిని చెప్పిన ప్రవక్తలుగానీ, ఎక్కడా విభేదము కల్గియున్నట్లు కనపడలేదు. అయితే ఎవరి కొరకు ఈ గ్రంథములను దేవుడిచ్చాడో, ఎవరికొరకు దేవుడు తన గ్రంథములలో జ్ఞానమును పొందుపరచాడో, వారే నేడు మూడు గ్రంథముల ఆధారముతో మూడు మతములను సృష్ఠించుకొని, తమను తాము మూడు గుంపులుగా విభజించుకొన్నారు. దేవుడు చెప్పినదొకటైతే మనిషి చేసినది మరొకటిగా యున్నది.

దేవుడు మూడు గ్రంథములను మూడు సమయములలో ఇచ్చాడు. అలా ఇచ్చినవాడు మిగతా రెండు గ్రంథములను చూచిన ప్రజలందరూ మొదట చెప్పిన గ్రంథమును అనుసరించమని చెప్పాడు. అన్నిటికి సంపూర్ణ దారి ప్రథమ దైవ గ్రంథమేనని సూచన చేశాడు. అయినా దేవుడు చేసిన సూచనను మనిషి ఏమాత్రము గ్రహించక, వెనుక వచ్చిన రెండు గ్రంథములను ఆధారము చేసుకొని, వేరువేరు మతములను సృష్ఠించుకొని, బైబిలును ఆశ్రయించిన వారందరూ క్రైస్తవులనీ, ఖుర్‌ఆన్ గ్రంథమును ఆశ్రయించిన వారందరూ ముస్లీమ్‌లనీ చెప్పుకోవడము జరుగుచున్నది. అంతేకాక ముస్లీమ్‌ల దేవుడు అల్లాయనీ, క్రైస్తవుల దేవుడు యెహోవాయనీ చెప్పుకొనుచూ ఒకే దేవున్ని రెండుగా చీల్చుకొన్నారు. వీరు ఇట్లుండగా భగవద్గీతను ఆశ్రయించిన వారందరూ హిందువులని చెప్పుకొనుచు మా దేవుడు ఫలానాయని చెప్పక ఎవరికి ఇష్టమొచ్చిన వారిని వారు పూజించుచూ చివరకు తమ దేవుడు ఎవరను విషయము కూడా మరచిపోయి ఒక్కొక్కరు ఒక్కొక్కరిని తమ దేవుడని చెప్పుచున్నారు. అట్లు చెప్పడములో కొందరు జంతువులను కూడా తమ దేవుళ్ళుగా చెప్పుకోగా, కొందరు మనుషులను, కొందరు క్షుద్రదేవతలను తమ దేవుళ్ళుగా చెప్పుకొనుచున్నారు. మొదట సర్వ ప్రపంచములో శ్రేష్టమైన జ్ఞానముకల్గి మేము ఇందువులము (జ్ఞానులము) అనిపించుకొన్నవారు నేడు జ్ఞానశూన్యులై పోయారు. ఈ విధముగా ఒకే జాతి మనుషులు మూడు మతములుగా విభజింపబడి యున్నారు.

అలా మూడు మతములుగా కనపడు వారిని నీ మతగ్రంథమేది అని అడిగితే బైబిలనో, భగవద్గీతయనో, ఖుర్‌ఆన్ అనియో చెప్పుచున్నారు. ఏదో ఒక గ్రంథమును మత గ్రంథముగా చెప్పుకొనినా ఫరవాలేదుగానీ,

ఆ గ్రంథములోయున్నట్లయినా (చెప్పినట్లయినా) ఎక్కడైన ఆయా మతముల మనుషులు ఉన్నారాయంటే, అలా కూడా లేరు. గ్రంథములో చెప్పిన వాటిని వదలి తమ మత పెద్దలు చెప్పిన విషయములనే ఎక్కువ ఆచరించు చుందురు. ఇదేమిటని అడిగితే ఇది మా మతాచారము అంటారు. ఆ మతాచారము ఏమైనా వాని జీవితమునకు పనికి వస్తుందా అని చూస్తే అట్లు కూడా ఏ ఉపయోగమూ ఉండదు. గ్రంథములో లేనివి, జ్ఞానము కానివి, మూఢత్వమును తెలియజేయునవియైన మతాచారములు కనపడు చుండును. అదే విధముగా దేశమంతా ఏదో ఒక మతములో లగ్నమై, ఇది మా మతము అను అభిమానము కల్గి, ఇతర మతముల మీద అసూయను కల్గియున్నారు. దేవుడు చెప్పిన మూడు గ్రంథములకు పూర్తి వ్యతిరేఖముగాయున్నది మతమని తెలియవలెను. ఒక గ్రంథమును అనుసరించువారు ఒక మతముగా కనిపించినా, వాస్తవానికి వాని గ్రంథానికి వారికి ఏమాత్రము సంబంధముండదు. ప్రతి మతము వారు మేము మా గ్రంథమును అనుసరించియున్నామని చెప్పుకొనుచుండినా, వారు ప్రత్యేకముగా గ్రంథమును అతిక్రమించి నడుచుచుందురు. ఉదాహరణకు హిందువుల విషయానికి వస్తే కొందరు మహర్షులు గడ్డము పెంచి, జుట్టు పెంచి, కాషాయవస్త్రములు ధరించియుందురు. అయితే మహర్షి అయినవాడు గానీ, జ్ఞాని అయినవాడుగానీ, సన్యాసి అయినవాడుగానీ అలా ఉండవలెనను నియమము దైవ గ్రంథమైన భగవద్గీతలో ఎక్కడా లేదు. అయినా హిందువుల దైవ గ్రంథము భగవద్గీతగానే చెప్పుకొనుచూ, ఎక్కడో పురాణ గ్రంథములలో వ్రాసిన విషయమును అనుసరించుచుందురు. వారి జుట్టు గడ్డముల విషయముగానీ, కాషాయ వస్త్రధారణగానీ, బయట ఆచరణలు ఏవిగానీ, భగవద్గీతకు సంబంధముండవు. అట్లే ముస్లీమ్‌ల

విషయమునకు వచ్చి చూస్తే, ముస్లీమ్‌ల గ్రంథము ఖుర్‌ఆన్ అని చెప్పు చున్నప్పటికీ, వారి బయట ఆచరణలలో, అలంకారములలో ఏదీ దైవ గ్రంథమైన ఖుర్‌ఆన్‌లో ఉండవు. వారు ఆచరించు ఆచరణలన్నీ హదీసు గ్రంథములోనివే ఎక్కువగా ఉండును. హిందువులు పురాణములను వదలి భగవద్గీతను ఒక్కదానినే ఆధారము చేసుకొంటే చివరకు దైవమార్గములో నడువగలరు. అదే విధముగా ముస్లీమ్‌లు హదీసులను వదలి దేవుడు ఇచ్చిన ఖుర్‌ఆన్ గ్రంథమును అనుసరిస్తే వారు కూడా దైవ మార్గములో నడువగలరు. అయితే మతములు మనుషులను దైవ గ్రంథముల ప్రకారము నడువనివ్వడము లేదు.

మనిషిలో మతము ఉన్నంతవరకు అది దేవుని మార్గమునకు ఆటంకమై, దేవుడు చెప్పిన జ్ఞానమును తెలియకుండా చేయుచుండును. మతము అను మాయ నీవు సరియైన దేవుని మార్గములోనే ప్రయాణించు చున్నావనిపించుచూ, తనకు ఏమాత్రము తెలియకుండ ప్రక్క మార్గములో నడిపించుచుండును. ఎప్పుడైతే మనిషి మతముపట్ల అప్రమత్తమై, నేను ఫలానా మతస్థుడనను ధ్యాసను వదిలి, ముస్లీమ్ ఖుర్‌ఆన్ గ్రంథమును చదివి దానిని అనుసరిస్తే తప్పక దేవున్ని చేరుకోగలడు. అట్లే హిందువు అయినవాడు కూడా నేను ఫలానా మతస్థుడను భావమును వదలి, ప్రథమ దైవ గ్రంథమైన భగవద్గీతను చదివి అర్థము చేసుకొని దాని ప్రకారము నడువగల్గినప్పుడు అతడు నిజముగా దైవమార్గములో నడిచినట్లేయగును. దానివలన ఇదే జన్మలో కర్మను జయించి ముక్తిని పొందగలడు. ఎవరైనాగానీ ఈ భూమిమీద మతాతీతముగా యుంటూ, దేవుడు గ్రంథముల ద్వారా అందించిన జ్ఞానమును తెలుసుకొనుచూ, మూడు దైవ గ్రంథముల మీద ఒకే అభిప్రాయము కల్గి భేదము లేకుండా ఉండునో, అప్పుడు నిజమైన

దైవత్వమును తెలియగలిగి మోక్షమును పొందగలరు. ప్రథమ దైవ గ్రంథమే భగవద్గీతయనీ, ద్వితీయ దైవ గ్రంథము బైబిలనీ, అంతిమ దైవ గ్రంథము ఖుర్‌ఆన్ అనీ నీవు తెలుసుకోవడమేకాక ఇతరులకు కూడా తెలుపుచూ మూడింటినీ సమానముగా చూడవలెను. అట్లే ప్రథమ దైవ గ్రంథమును ధర్మశాస్త్రమనీ, మిగతా గ్రంథములలో కూడా తెలిపారనీ, అది సంపూర్ణ ధర్మశాస్త్రమని తెలిసి అనుసరించిన వాడు ధన్యుడగును, దేవునియందు చేరిపోవును.

నేను పద్ధతిగా దేవుని జ్ఞానమును తెలిసి మొదటినుండి ప్రథమ దైవ గ్రంథమని పేరుగాంచిన భగవద్గీతను అనుసరిస్తూ, అది సంపూర్ణ ధర్మశాస్త్రమని తెలిసి, అన్ని మతములవారికి సమానముగా జ్ఞానము చెప్పితే, నేను హిందువునుకాననీ తమ మతమును తామే గుర్తించలేని హిందువులు నన్ను పరమతములను బోధించువానిగా ఆరోపణలు చేశారు. అటువంటి వారికి నేను చెప్పు బోధలకు ప్రజలు ఎట్లు స్పందించుచున్నారో తెలియుటకు ఈ మధ్య నాకు వచ్చిన లేఖలను క్రింద జతపరుస్తున్నాను చూడండి. వాటిని చూచిన తర్వాతనైనా నాలోని శ్రేష్టత్వమును గ్రహించగలరని అనుకుంటూ ముగిస్తున్నాను.



**పి. ఆదినారాయణ**
ముద్దిరెడ్డిపల్లి, ఇందూపురం (హిందూపురం).

శ్రీశ్రీశ్రీ ప్రబోధానంద యోగీశ్వరులకు,
సాకారంలో కనిపించే నిరాకార దైవమునకు
ఎన్నో జన్మల పుణ్యఫలమున దొరికిన దైవ సమానులకు...

నా మనః పూర్వకంగా నమస్కరించి వ్రాయు జాబు. ఈ శరీరము పేరు ఆదినారాయణ. ఇప్పుడు వుండేది ముద్దిరెడ్డిపల్లి ఇందూపురం (హిందూపురం) ఈ శరీర తల్లిదండ్రుల పేరు సుబ్బరాయుడు, నాగమ్మ. అప్పుడు మేము ఉన్న ఊరు కోటంపల్లి, చెన్నేకొత్తపల్లి దగ్గర నాకు 7,8,9 సంవత్సరముల నుండి జరిగినవి బాగా గుర్తున్నవి. మా ఇంటికి కొంతమంది స్వామీజీలు కానీ, గురువులు కానీ, హరికథదాసులు కానీ, నటీనటులు కానీ, తోలు బొమ్మలాట ఆడేవారు కానీ మా ఇంటివద్దకు వచ్చి మా నాన్నతో చర్చించి ఎన్ని రోజులుకావాలో అన్ని రోజులు మా ఇంటిలో ఉండి వారి కార్యక్రమములు పూర్తి అయిన తరువాత వెళ్ళిపోయేవారు. అప్పటినుండి మా ఇంటిలో తత్వాల విషయముకానీ, పద్యాల అర్థముకానీ, వేమన శతకంకానీ, నారాయణ శతకం కానీ పారాయణం చేస్తూవుండేవారు. అప్పటి నుండి ఈ ప్రపంచములో ఏదో ఉన్నదని ఈ ప్రపంచము గురించి తెలుసుకోవాలని ఉండినది. ఒకసారి గోవానుండి ఒక స్వామి వచ్చారు. అప్పుడు మా నాన్నతో ఆ స్వామీజీ వారంరోజులు మా ఇంటిలోనే ఉండి రోజూ సత్సంగం చేసి, తను మళ్ళీ ఊరికి పోయేటప్పుడు నన్ను దగ్గరకు పిలిచి గోవాకు వస్తావా? నా మాదిరి స్వామీజీ అవుతావా అని నన్ను అడిగేవారు. అప్పుడు నేను మా నాన్న పొమ్మంటే వస్తాను స్వామి అని చెప్పెడివాడిని. ఆ విధంగా ఎంతమంది స్వామీజీలు వచ్చినా మా ఇంటివద్దనే ఉండి సత్సంగాలు చేసి పోవుచుండేవారు. మా ఇంటిలో ఒక పద్ధతి ఉండెడిది. అది ఏమిటంటే ప్రతిరోజూ సాయంత్రము

నారాయణ శతకము చదవనిదే భోజనం చేసేది లేదు. నారాయణ శతకం పూర్తి అయిన తరువాతనే ప్రతి ఒక్కరూ భోజనం చేయాలి. ఇది ఒక నియమంగా ఉండెను. తరువాత నాకు 12 సంవత్సరములు ఉన్నప్పుడు అమ్మ చనిపోవడం. నాన్నకు ఎంత జ్ఞానం తెలిసినా తాగుడికి బానిస అయి అమ్మ బాధలో ఉండిపోవడం, మా గురించి, అంటే ఏడుమంది పిల్లలు మా నాన్న తల్లి ఇంత పెద్ద కుటుంబం గురించి పట్టించుకునేవాడు కాదు. ఆ చిన్నవయస్సు నుండే కుటుంబ బరువు బాధ్యతలు నేనే చూసుకోవలసి వచ్చినది. నా అన్నయ్య కూడా నేను చెప్పితేకానీ కొన్ని విషయాలు తెలుసుకునేవాడు కాదు. అందువలన అన్ని పనులూ నాకే చెప్పెడివారు.

కోటంపల్లి నుండి 1972 ముద్దిరెడ్డిపల్లి రావడం, ఇక్కడ మగ్గాలు నేర్చుకొని ముగ్గురి చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు చేయడం, మేము పెళ్ళిళ్ళు చేసుకోవడము ఒక ఇల్లు కట్టుకోవడం, ఇలా సంసార జీవనం సాగిపోతున్న సమయంలో నాన్న చనిపోవడం, నాన్న చనిపోయిన కొన్నాళ్ళకు నాకు యాక్సిడెంట్ కావడం, యాక్సిడెంట్ కావడం వల్ల నేను ఇంటిలోనే ఆరు నెలలు ఉండవలసిరావడం జరిగినది. అప్పుడు అన్ని గ్రంథాలూ, అష్టాదశ పురాణాలూ, ప్రపంచ పుస్తకాలూ ఎన్నో చదవడం జరిగినది. ఎన్ని పుస్తకాలు చదివినా భగవంతుని గురించి, పరమాత్మను గురించి ఏదీ సరిగ్గా అర్థము కాకుండెడిది. ఈ గుళ్ళు గోపురాలు అప్పటికే చాలా తిరగడం అయినది. ఎక్కడికి పోయినా ఈ ప్రపంచం గురించి ఏమీ అర్థము అయ్యేది కాదు. అప్పుడే అంటే 1986లో భగవద్గీత చదవడం జరిగినది. భగవద్గీతను నాలుగు, ఐదుసార్లు చదివినా అర్థము అయ్యేది కాదు. భగవద్గీతలో కూడా రకరకాల అర్థాలతో ఏదీ సరిగ్గా అర్థం కాకుండా ఉండెడిది. ఆ సమయములోనే అంటే 1988వ సంవత్సరములో బ్రహ్మకుమారి సమాజంవారు మా ముద్దిరెడ్డిపల్లిలో ఏదో సర్వీస్ పెట్టినారు అని మా ఇంటిలో మగ్గం నేసే గోవిందు అనే అతను వచ్చి చెప్పడం, దేవుడు నిరాకారుడంట, ఆకారంవుండేవాడు దేవుడు కాదంట, పరమాత్మనే ఈ సృష్టి లోకి వచ్చినాడనడం,

నేను గోవిందుకు10 రూపాయలు ఇచ్చి ఒక పుస్తకం తీసుకురమ్మని చెప్పి పంపడం, అతను పోయి 10 రూపాయలకు రెండు పుస్తకాలు చిన్నవి తీసుకురావడం జరిగినది. ఒక పుస్తకం పేరు పరమాత్మ పరిచయం, రెండవ పుస్తకం పేరు జీవితమును వజ్రతుల్యం చేసుకోవటం ఎట్లు అనే పుస్తకాలను నేను చదవడం, నిరాకార పరమాత్మ ఒక దాదాలేక్‌రాజ్ అనే శరీరములోకి ప్రవేశం అయి జ్ఞానం ఇస్తున్నారని వారు చెప్పడం, నేను ఆ సంస్థలోకి పోవడం జరిగినది. ఎందుకు అంటే అక్కడ నిరాకారుడు ఒక శరీరము ఆధారం చేసుకొని జ్ఞానం ఇస్తున్నాడంటే అది నిజమని పోవడం జరిగినది. అక్కడి నుండి ఆ జ్ఞానం వింటూ, ఈ ప్రపంచానికి భిన్నమైన జ్ఞానం కాబట్టి ఆ జ్ఞానములోనే ఉండడము జరిగినది. కానీ అక్కడ కూడా అర్థంకాని కొన్ని విషయములు తెలిసినవి. అవి ఏమి అంటే పరమాత్మ వచ్చి ఒక జీవితకాలము జ్ఞానం ఇస్తాడని, తరువాత మనందరినీ తన జతలోనే ఇంటికి పిలుచుకొని పోతాడనీ, ఈ జ్ఞానం 70 సంవత్సరములు ఉండుననీ, ఈ జ్ఞానం 70 సంవత్సరముల తర్వాత అందరినీ పరంధామము అనే ఇంటికి పిలుచుకొని పోయి మరల ఈ జ్ఞానం ఎవరైతే విన్నారో వారిని సత్యయుగానికి, త్రేతాయుగానికి తీసుకుపోయి దేవతలుగా చేస్తాడని చెప్పివున్నారు. ఈ జ్ఞానంలోకి వచ్చేవారు మాత్రమే సత్య, త్రేతాయుగంలోకి వచ్చి దేవతలుగా పుట్టి మాములు మనుషులుగా మారి, ద్వాపరయుగములో రాజులు అయి, కలియుగంలో అజ్ఞానులు అయిపోయిన తరువాత మరల పరమాత్మవచ్చి, మళ్ళీ జ్ఞానం చెప్పి, మళ్ళీ ఇంటికి పిలుచుకొనిపోతాడు, ఇదే కల్పము జరుగుతుందని చెబుతున్నారు. ఇప్పటికి 77 సంవత్సరము అయినది. వారు చెప్పిన 70 సంవత్సరములకు ఈ జ్ఞానం నిలిచిపోవాలి. సత్యయుగం మొదలు కావడానికి మిగిలినది 23 సంవత్సరములే! ఇప్పటికే సత్యయుగము మొదలు కావలసినది. కానీ కాలేదు, సత్యయుగము రాలేదు. అక్కడ సంస్థలో నియమములు, పద్ధతులు అన్నీ మారిపోయినాయి. ఏమి ఈ విధంగా అయినది అని అడిగితే చెప్పేవారే లేరు. ఇంకా ఓంశాంతి

గురించి చెప్పాలంటే ఒక పెద్ద పుస్తకం అవుతుంది. ఇది నేను మీతో కలిసినప్పుడు ఎంత మోసం జరుగుతూవున్నదనీ, మాయ ఏ విధంగా లక్షల మందిని మోసం చేస్తూవున్నదనీ వివరముగా మాట్లాడుతాను.

ఈ సమయంలోనే నేను ప్రబోధానంద యోగీశ్వరుల వారి గ్రంథములు చదవడం జరిగినది. నాలుగు గ్రంథములు చదివిన తరువాత ముఖ్యముగా త్రైత సిద్ధాంత భగవద్గీత చదివిన తరువాత ఈ సృష్ఠి రహస్యములు అంతా ఎవరికైతే తెలుసో వారు తప్ప మరెవరూ ఈ గ్రంథములు రాయలేరని అర్థం అయినది. త్రైత సిద్ధాంత భగవద్గీత చదివిన తరువాత నేను ముందు చదివిన భగవద్గీత అర్థమే కాకుండెడిది. కానీ ఈ భగవద్గీత చదివిన తరువాత అర్థం అయినది ఏమి అంటే, ఈ ప్రపంచాన్ని, ఆత్మని, జీవాత్మని సృష్ఠించినది పరమాత్మేనని, మొత్తం ప్రపంచ విషయం అంతా జీవుని విషయములు, ఆత్మ విషయము, ప్రకృతి విషయము, పరమాత్మ విషయము, బ్రహ్మయోగం అంటే ఏమి, కర్మయోగం అంటే ఏమి, భక్తియోగం అంటే ఏమి అన్నీ అర్థం అయినవి. జీవున్ని ముక్తికి తీసుకుపోయే మార్గం పూర్తిగా అర్థం అయినది. అదే త్రైత సిద్ధాంత భగవద్గీత ద్వారా ఈ ప్రపంచంలో అదే జీవుడు, అదే ఆత్మ, అదే పరమాత్మ క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడుగా ఉన్నారని వారితో పాటు ప్రకృతి ఇంతే ప్రపంచము అని అర్థం అయినది.

జనన మరణ సిద్ధాంతము గ్రంథము చదివిన తరువాత జనన మరణ సిద్ధాంతం అంటే ఏమిటి? అని అర్థం అయినది. జనన మరణ రహస్యం అర్థం అయినది. సమాధి గ్రంథము చదివిన తరువాత సమాధి అంటే ఏమి, మృత శరీరం అంటే ఏమిటి? జీవుడు అంటే ఏమి, సమాధి అనునది ఏది అని అర్థము అయినది. త్రైతారాధన గ్రంథము ద్వారా త్రైతము అనగా మూడు అని సూర్య, చంద్ర, నక్షత్రాలను విషయము త్రైతారాధన విషయము, త్రైతారాధన ఏ విధంగా చేయాలనే విషయము తెలిసినది. ప్రబోధ, సుబోధ గ్రంథములలో ఎన్నో రహస్యములను తెలుసుకోవడము జరిగినది. యజ్ఞములు అనే గ్రంథములో

యజ్ఞము అంటే ఏమి, యజ్ఞాలు ఎన్ని బాహ్యాయజ్ఞము, ద్రవ్యయజ్ఞము, జ్ఞాన యజ్ఞము ఈ మూడు యజ్ఞములు గురించి పూర్తిగా అర్థమైనది. ప్రవక్తలు ఎవరు? గ్రంథము చదివినప్పుడు పరమాత్మ అంటే ఎవరు, భగవంతుడు అంటే ఎవరు, ప్రవక్తలంటే ఎవరు అర్థమైనది. సృష్ఠికర్తకోడ్-963 అను గ్రంథము చదివినప్పుడు పరమాత్మ-9, ఆత్మ-6, జీవుడు-3 అని ఈ ప్రపంచ మాయ కోడ్-666 అని బాగా అర్థమైనది. మతాతీత దేవుని మార్గం అనే గ్రంథము చదివినప్పుడు దేవుడంటే ఎవరు, మతం అంటే ఏమి, మనిషి పెట్టుకొన్నదే మతము, మతానికి అతీతమైనది, ప్రపంచములో అందరి మతాలకూ సంబంధం లేని జ్ఞానమే మతాతీత జ్ఞానం అని అర్థమైనది. గురుప్రార్థనా మంజరి అను గ్రంథం చదివిన తరువాత గురువు అంటే ఎవరు, ప్రపంచములో గురువులు అనేవారు ఎంతమంది వుంటారు, గురువు అనేవారు ప్రపంచానికి ఒక్కరే వుంటారనీ, పరమాత్మ మనిషిగా వచ్చినప్పుడు ఆయనే గురువనీ, పరమాత్మవచ్చి గురువుగా వుండి జ్ఞానం ఇచ్చి పోయిన తర్వాత కూడా గురువు ఒక్కరేననీ, మిగతావారందరూ బోధకులేననీ. గురువు అంటే ఊరిలో ఉన్నవారే గురువనీ తెలిసింది. అంతేకాక గురువుకి మహత్యములు ఉండునా, గురువుని ఎవరు గుర్తిస్తారు, ఎవరు గుర్తించరు, గురువుకి శిష్యులు ఉంటారా, ఉండరా, గురువును దూషించినవారిని గురువు ఏమి చేస్తారు. వారికి ఏమైనా అయితే అది గురువుద్వారా కాకుండా గురువుని గుర్తించిన వారి ద్వారా మాత్రమే అవుతుంది అని అర్థమైనది. అలాగే ప్రబోధానంద నాటికలు కానీ, సామెతల జ్ఞానం కాని, మన పండుగలు కాని, మన సాంప్రదాయములు కాని, ప్రబోధ తరంగాలు కానీ, దేవాలయ రహస్యాలు కానీ, ఆత్మలింగార్థం కానీ, ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులుకానీ, తిట్లజ్ఞానము దీవెనల అజ్ఞానము, ప్రవక్తలు ఎవరు, కలియుగము ఎప్పటికీ యుగాంతముకాదు అను గ్రంథములు కానీ, ఆయా గ్రంథముల ప్రత్యేకతలు, వాటిలోవున్న రహస్యము అర్థం అయినది. ముఖ్యముగా 'గుత్తా' అను గ్రంథములో జీవుడునికానీ, ఆత్మనికానీ, పరమాత్మని కానీ మన చేతిలోనే

చూపినారనీ గుత్తా అను గ్రంథములో గురువుని తెలుసుకొన్నాను. గురువు సాధారణ వ్యక్తిగానే వుంటూ అసాధారణ జ్ఞానము ఇస్తూ ఉంటారని ఇవే కాకుండా ఒక్కొక్క గ్రంథములో ఒక్కొక్క రహస్యము అన్ని గ్రంథములలో ఈ ప్రపంచ రహస్యము ప్రకృతికాని, జీవుడుకాని, ఆత్మకాని పరమాత్మకాని అర్థం అయినది. అద్వైతం అంటే ఏమిటి, విశిష్టాద్వైతం అంటే ఏమి, ద్వైతం అంటే ఏమి, పురాణం అంటే ఏమి, వేదాలంటే ఏమి అన్నీ అర్థమైనవి. ముఖ్యముగా అర్థము అయినది ఏమిటంటే ప్రపంచమే త్రైతము త్రైతమంటే ప్రపంచం. ఇది ఎవరైతే తెలుసుకొంటారో వారు చేరవలసిన చోట ఏదైతే ఉన్నదో అక్కడికే చేరుతారని అర్థం అయినది. ఇంత అర్థము అయ్యేలా చేయించిన ప్రబోధానంద యోగీశ్వరులవారికి కోటి శతకోటి వందనాలు. ఇంతటితో ముగిస్తున్నాను. ఇంకా మీతో కలిసినప్పుడు, ఆ అదృష్టం వచ్చినప్పుడు డైరెక్ట్‌గా మాట్లాడే సమయం వచ్చినప్పుడు మాట్లాడుతాను. ఆ సమయంకోసం ఎదురుచూసూ ఉన్న జీవుడు జీవాత్మ...

నమస్కారములు

పి. ఆదినారాయణ



**యం. రాజేశ్వర్**

హైదరాబాద్.

01) శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వర్ల వారు రచించిన త్రైత సిద్ధాంత భగవద్గీత, ఇప్పటివరకు వచ్చిన భగవద్గీతలన్నిటికంటె సవివరంగా జీవాత్మ, ఆత్మ మరియు పరమాత్మ తత్త్వములు సులభశైలిలో, అర్థవంతమైన రీతిలో వివరించబడినవి.

02) స్వామివారు రచియించిన ప్రతి గ్రంథమూ సంచలనాత్మకమే. ఇంత వరకు ఎవరూ తెలుపని ఆత్మజ్ఞానమునకు సంబంధించిన మర్మములను మరియు

ఎన్నో రహస్యములను మనందరికీ అందించడం మానవాళి చేసుకున్న మహాద్భాగ్యం.

03) బైబిల్, భగవద్గీత మరియు ఖురాన్ గ్రంథములలో దేవుడు చెప్పిన ఆత్మజ్ఞానమే ఉన్నదనీ, కాలగమనములో మాయ ప్రభావం వల్ల ఏ మతము వారూ దేవుని జ్ఞానమును సరిగా అవగాహన చేసుకోలేక పోయారనీ, మతముల కతీతమైన పథము ఒక్కటేననీ, అదే దేవుని జ్ఞానమును తెలియజేయునని స్వామి వారి రచనల ద్వారానే నాకు అవగతమైనది.

04) దేవుడు సూక్ష్మమని, కర్మకూడ సూక్ష్మమని, సూక్ష్మబుద్ధికే దేవుని జ్ఞానము అందుతుందని, కర్మలో భావము ముఖ్యమని తెలుసుకొంటిని.

05) దేవుడే సాకారముగా మానవ రూపములో అవతరించిన భగవంతుడే శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు.

06) శాస్త్రములు ఆరు అని వాటిలో బ్రహ్మవిద్యాశాస్త్రమే పెద్దది, గొప్పదని స్వామివారి రచనల ద్వారానే నాకు సుబోధకమైనది. నలుబది యైదుకు పైగా రచించిన రచనలన్నింటిలో అద్భుతమైన ఆత్మజ్ఞానమే నిక్షిప్తమైయున్నది. దైవజ్ఞానమును శాస్త్ర ప్రమాణంగా, సహేతుకమైనదిగా మానవునికి ఉదయించు అన్ని ప్రశ్నలకు సరియైన సమాధానాలిచ్చేదిగా సమగ్రంగా సంపూర్ణంగా సుసంపన్నమయం చేసినారు స్వామివారు.

07) బ్రహ్మంగారు కాలజ్ఞానములో అన్ని మతాలను ఏకం చేసే ఆనంద గురువు అవతరిస్తాడని తెలిపియున్నారు. జాతి, మత, కుల, స్త్రీ పురుష బేధం లేకుండా సర్వులు అందరూ ప్రబోధానంద ఆశ్రమం చిన్నపొడమల గ్రా॥, తాడిపత్రి మం॥ అనంతపూర్ జిల్లాలో ప్రతి పౌర్ణమి రోజున స్వామి నిర్వహించు సత్సంగములో పాల్గొంటారు. నేను కూడా ప్రతి పౌర్ణమి సత్సంగములో పాల్గొంటున్నాను. బ్రహ్మంగారు తెలిపిన ఆ ఆనంద గురువే శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు.

08) భారతదేశం సుసంపన్నులైన ఆత్మజ్ఞానులకు నిలయం. మనందరిదీ ఇందూ మతమని, కాలగమనంలో హిందు మతముగా మారినదని, హిందువు అనే పదమునకు ఎలాంటి అర్థము లేదని, అసలైన పదము "ఇందువు" అనగా ఆత్మజ్ఞానియని స్వామివారు రచనల ద్వారానే నాకు అవగతమైనది. ఈ అసలు సిసలైన ఆత్మజ్ఞానం ఒక్కటే హిందుమతాన్ని పరిరక్షించి, సమైఖ్య పరుస్తుంది, సంఘటితం చేస్తుంది. మనందరినీ సత్యంవైపుకు నడిపిస్తుంది.

09) మానవ జీవిత సత్యాన్వేషణలో ఉన్న వారందరికీ నామనవి ఏమనగా! స్వామి వారు రచించిన గ్రంథములన్నిటినీ చదివి అవగాహన చేసుకుంటేనే సత్య సుబోధకమౌవుతుంది. అపుడే సంపూర్ణ ఆత్మజ్ఞానులమవుతాం. ఈ అసలు సిసలైన ఆత్మజ్ఞానం ఒక్కటే మన కర్మలనన్నింటినీ కాల్చివేసి జీవన మరణ చక్రం నుండి విడిపించి మోక్షానికి దారి చూపుతుంది. జన్మను సార్థకం చేస్తుంది. అందుకే మనందరం ఈ గ్రంథములను అన్నిటినీ చదువుతూ, అవగాహన పెంచుకుంటూ, గ్రహించిన సత్యాన్ని ఇతరులకు పంచుకుంటూ పోతే అదే నిజమైన దైవసేవ అవుతుంది. రండి! దైవసేవలో విరివిగా పాల్గొనండి. మానవ జన్మను సార్థకం చేసుకోండి!

ఇట్లు

దైవజ్ఞాన జిజ్ఞాసి (యం. రాజేశ్వర్)



**యం. ఏ. వెంకటేశ్వర్లు**

తుగ్గలి మం॥, కర్నూల్ జిల్లా.

ఇందూ ధర్మప్రదాత,

సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త,

శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వర్లు

త్రైత సిద్ధాంతము అంటే మూడు ఆత్మలైన జీవాత్మ, ఆత్మ, పరమాత్మల విషయము గురించి చెప్పినది.

జీవాత్మ శరీరమునందు ఏడవనాడీకేంద్రములో ఒక్క చుక్కగావుందని తెలుసుకొన్నాను. అలాగే ఆత్మ కూడా శరీరము అంతా వ్యాపించివున్నదని తెలుసుకున్నాను. అలాగే పరమాత్మ నాలో ఉంటూ బయట ప్రపంచము అంతటా వ్యాపించియున్నదని తెలుసుకున్నాము.

ఈ జ్ఞానములోకి రాకముందు పూజా విధానములో, దీపారాధన యొక్క ప్రాముఖ్యత ఏమిటో పూర్తిగా నాకు తెలియదు. ఈ జ్ఞానం ఇప్పుడు తెలుసుకోవడం ద్వారా పూర్తి వివరము తెలిసినది. అది ప్రమిద అనగా శరీరము, నూనె అనగా కర్మయని, రెండు ఒత్తులు అనగా జీవాత్మ, ఆత్మలు అని, అగ్ని అనగా జ్ఞానం అని తెలియబడినది.

మంగళహారతి వివరము కూడా తెలియబడినది. మంగళము అనగా శుభము అని హారతి అనగా మిశ్రమము అని తెలియబడినది. అది ఎలాగ కర్పూరము అను నామముతో ఆకారము కలిగివుండి, ఈ ఆకారము కలిగినటువంటి కర్పూరము బయట అగ్ని ద్వారా ఎలాగైతే మిశ్రమమయి పోతుందో అదే విధంగా జీవాత్మ అయిన నేను కూడా జ్ఞానమనే అగ్నిని సంపాదించి కర్పూరములాగ మిశ్రమముతో కలిసిపోతానని తెలుసుకున్నాము.

ఇట్లు

దేవుని బిడ్డ (యం. ఎ. వెంకటేశ్వర్లు)



**సి. యోగీంధర్**

గుత్తి.

మహారాజశ్రీ శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరుల వారికి

గురుదేవుల పాదపద్మములకు మా నమస్కారములు...

మా వ్యవహారిక నామము సి. యోగీంధర్. మేము ఇంతవరకు అనగా మా మిత్రుడు శ్రీ ఆదిశేషయ్యగారు మీ గురించి తెలియచెప్పేవరకు ఆధ్యాత్మికంగా

ఎదగాలని ఎన్నో ప్రయత్నాలను చేస్తూ వచ్చాను. ఎన్నో గ్రంథాలను చదివాను. కానీ అన్ని విషయములు అర్థమైనట్లుగానే ఉన్నాయి కాని అందులో ఇంకా ఏమో కొంత వివరము కావలసివున్నది అన్న అనుమానము ఉండెడిది. త్రైత సిద్ధాంత పరిచయము తరువాత కూడా ఎన్నో అనుమానములు కలిగినవి. కొన్ని పెద్దల వివరణముల తర్వాత ఏది సత్యము ఏది అసత్యము, ఏది ఆచరణాత్మకము, ఏది అభూతకల్పన ఇలా ఎన్నో విషయములు మీ గ్రంథముల ద్వార మరియు మీ యొక్క ప్రసంగముల ద్వారా మా యొక్క జ్ఞాన పరిధి పెంచుకోవడము జరిగినది. గురువుగారూ! మీ యొక్క చలువ వలన మొట్టమొదట అందరిమీద గౌరవము పెరిగినది. ఇంకా ఎన్నో చెప్పాలనివుంది కాని వాక్య నిర్మాణము చేయలేక పోతున్నాను.

మీ ద్వారా, మీ గ్రంథముల ద్వారా ఏది సరియైనదో, ఏది సరిగాదో తెలుసుకుని శాంతమును పొంది, వితండవాదములను వదలి జ్ఞానుల ఉ పదేశములతో సాధన నిరంతరముగా జరుగునట్లు ప్రయత్నము చేస్తున్నాను. ఇందు వాక్య నిర్మాణములో తప్పులున్న క్షమించండి...

ధన్యవాదములు...

ఇట్లు
మీ విధేయుడు,
సి. యోగీంధర్



**విశ్వనాథ్**
తుగ్గలి.

ప్రపంచములో జీవిస్తున్న ప్రతియొక్క జీవరాశికి సంబంధించినటు వంటి ఎంతో జ్ఞానాన్ని, ఈ జ్ఞానము ద్వారా కర్మలను కాల్చివేయు విధానము వున్నదన్న సత్యాన్ని తెలియ చేస్తూ ముఖ్యంగా అజ్ఞానంలో ఉన్న జనులకు జ్ఞానపు వెలుగును ప్రసాదిస్తున్నటు వంటి శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరుల పాదపద్మములకు నమస్కరిస్తూ వ్రాయునది.

దేవుడు అనికాని, జ్ఞానము అనికాని నాకు ఏమాత్రము తెలియదు. ఎక్కడ కాని విగ్రహారాధన లేక మ్రొక్కడం వంటివి కూడా చేసేవాడినికాను. అంతా మనము చేస్తేనే పనులు జరుగుతాయని, వీటన్నింటిని ఎవరూ ప్రత్యేకించి చేసిపెట్టరు అనుకునేవాన్ని. మా కుటుంబములోని వారందరూ దేవుడున్నాడని కనీసం ఎప్పుడో ఒక్కసారి కూడ పూజలు చేయకపోతే ఎలా అనేవారు.

దేవుడే లేడు అని ఇంతటి అజ్ఞానములో వున్న నాకు ఇంత తొందరగా ఎంతో విలువైనటువంటి జ్ఞానమును తెలుసుకోనేదానికి అర్హత కలిగినందుకు చాలా ఆనందంగా ఉంది.

మొట్టమొదటిసారిగా జ్ఞానమను దారిలోనికి ప్రయాణం చేసింది. త్రైత సిద్ధాంతము ద్వారానే. మా నాన్న త్రైత సిద్ధాంత భగవద్గీత గ్రంథమును తెచ్చుకున్నాడు. ఈ గ్రంథము చాలా అర్థముతో నిండివున్నదని అన్నాడు. అప్పుడు ఆ గ్రంథమును తీసుకొని చూసి ఏమి భగవద్గీతనో ఏమో అని టైంపాస్‌గా కొద్దిగా చూసా! టైంపాస్‌గా చూసిన ఆ గీతయే నా తల వ్రాతను మార్చేదని అప్పుడు తెలిసింది.

ముఖ్యంగా శ్రీశ్రీశ్రీ యోగీశ్వర్లు చెప్పిన విషయంలో ఒకటి సంతోషము వేరు ఆనందము వేరు అని. ఆ విషయము వారివారి యొక్క అనుభవమునకు మాత్రమే తెలుస్తుందన్నారు. ప్రపంచ విషయముతో కలిగేది సంతోషం, జ్ఞాన విషయంలో జీవునికి కలిగేది ఆనందం.

ఈ ఆనంద విషయంలో నా అనుభవానికి వచ్చినటువంటి గీతా శ్లోకములలో ఒకటి

*శ్లో॥ అపిచేనసి పాపేభ్య స్సరేభ్యం పాపకృత్తమం*
*సర్వం జ్ఞానప్లవేనైన వృజనం సంతరిష్యసి.*

భావం :- అఖిల పాపాత్ములయందు నీవెంత అధమ పాపహితుడైనా కాని పాపమను సముద్రమను జ్ఞానమను చిన్న ఓడ ద్వారా దాటగలవు అని తెలుపబడింది.

ఇంతటి మూర్ఖులమైన మనకు అణువణువున వ్యాపించిన దేవుడు ఇంతటి సులభ విధానాన్ని తెలిపాడు కదా! అని జీవాత్మగా వున్న నాకు ఆనందము అంటే ఇది అని తెలిసింది. అంతా నేను అనుకునే నాకు నీవు వేరు, శరీరము వేరు అందులో నిన్ను నడిపించువారు వేరని ఈ జ్ఞానంలోకి రావటం వలననే తెలుసుకున్నాను. జ్ఞాన విషయములో వెనుకబడిన మాకు గుత్తిలో ప్రతి ఆదివారము శంకరన్న మరియు ఆదిశేషయ్యసారుగారు జ్ఞాన విషయంలో ముందుకుపోవటానికి సహకరిస్తునందుకు చాలా ఆనందంగా ఉన్నది.

ఇట్లు

ప్రస్తుతము ఈ శరీరము పేరు విశ్వనాథ్. ఇందులో నివాసమున్న జీవాత్మయైన నన్ను నా పొరుగువాడు ఎల్లప్పుడు జ్ఞానమార్గంలో ప్రయాణించే లాగా చేయమని కోరుకుంటు ఇంతటితో ముగిస్తున్నాను.



**కె.షేక్షావళి**

గుత్తి.

గౌరవనీయులు

శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులుగారికి
మీ పాదపద్మములకు సవినయముగా నమస్కరించి వ్రాయునది.

కె.షేక్షావళి అను నేను గుత్తి గ్రామపు వ్యక్తిని. నేను అనుకోకుండా ఒక రోజు శ్రీ ఆదిశేషయ్య (టీచర్) వారి ఇంటినందు సత్సంగమునకు హాజరు కావడం జరిగినది. తరువాత క్రమం తప్పకుండా హాజరవుతూ రావడం జరిగినది.

17-11-2013 (పౌర్ణమి) తేదీన నేను మీ మందిరముకు వచ్చి మీ అమూల్య ప్రసంగమును విని మిమ్ములను కలవడం కూడా జరిగినది.

నేను ప్రతి మతమును, వారి పవిత్ర గ్రంథములను గౌరవిస్తాను. మీరు రచించిన కొన్ని గ్రంథములు కూడా చదువుతూ ఉన్నాను. అన్ని మతాల గ్రంథముల సారమును మీ గ్రంథముల ద్వారా ఎటువంటి తప్పు, వ్యతిరేక అర్థం లేకుండా తెలుసుకోవడం జరుగుచున్నది. మా అమ్మ, నా భార్య కూడా మీ గ్రంథములను చదువుచూ ఉన్నారు.

దేవుడు ఒక్కడే అని, అది భగవద్గీతలో కానీ, బైబిలులో గానీ, ఖురాన్‌లో గానీ ఉన్నదని నా నమ్మకము. మతం అనేది మనుష్యుల మధ్య అడ్డుగోడగా నిలిస్తే, త్రైత సిద్ధాంతం ప్రకారము అన్ని మతాల సారాంశం ఒక్కటేనని మీ ద్వారా నేడు ఎంతోమందికి తెలుస్తున్నది.

భవిష్యత్తులో మీ ద్వారా అందుతున్న జ్ఞానాన్ని ప్రతి ఒక్కరూ తెలుసు కోవాలనీ, మతమనే ముసుగులో కప్పబడి మూఢుల్లో మూఢులై కర్మచక్రంలో నలిగే చాలామంది అజ్ఞానులకు త్రైత సిద్ధాంతము ద్వారా మోక్షం కలిగే రోజు వీలైనంత త్వరగా రావాలనీ నా ప్రార్థన.

మీ గ్రంథములు చదువుట నా అదృష్టం అని భావిస్తున్నాను. నాతో పాటు మరికొందరికి ఈ అదృష్టాన్ని అందించుటకు నా శాయశక్తులా ప్రయత్నిస్తాను.

ఇట్లు
కె. షేక్షావలి



**మేకల చిన్నబాలయ్య**

ఓం త్రైత సిద్ధాంత ఆదికర్త, సంచలనాత్మక రచయిత శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానందయోగీశ్వర్లు గౌరవనీయులు, పూజ్యులు అయిన స్వామి వారికి,

ఎన్నో జన్మలనుండి వచ్చిన నా శరీరము పేరు మేకల చిన్నబాలయ్య.

నేను మొట్టమొదటిసారిగా మీ యొక్క గ్రంథములు చదవటానికి ప్రేరేపించిన మరియు పరిచయం చేసిన గుత్తిశాఖ నుండి వచ్చే శ్రీ ఆదిశేషయ్య మరియు శ్రీ చక్రినాయక్‌ల గారికి కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను. ఆ తర్వాత నేను మీరు రచించిన మొదటి గ్రంథం "జనన మరణ సిద్ధాంతం" ను తీసుకొని చదవడం జరిగింది. ఆ గ్రంథములో మీరు జననము గురించి వివరించిన తీరు చదివేసరికి ఇది ఎవరో డాక్టర్లు, సైంటిస్ట్‌లు వ్రాసినది కాదు. ఇందులోని విషయాలు ఏదోశక్తి ద్వార బయల్పడినవి అనే ఆలోచన రావడం జరిగింది. ఆ తర్వాత మరణం ఎలా సంభవిస్తుందో, మరణంలోని రకాలు చదివిన తర్వాత మహా అద్భుతంగా అనిపించింది. మళ్ళీ నేను "దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు" అనే గ్రంథం పఠించడం ద్వారా సూక్ష్మం అంటే ఏమిటో? స్థూలం అంటే ఏమిటో, మన శరీరములో తెలుసుకొనే సరికి, అప్పటి వరకు నేను సైన్స్ ఎక్కువగా నమ్మే నేను, దయ్యం అంటే ఎవరు? దేవుడు అంటే ఎవరు? అనే విషయాల పట్ల పూర్తి వివరము తెలుసుకోవడం జరిగింది.

ఆ తర్వాత ఈ గ్రంథాలు రచించిన యోగీశ్వర్లు ఎక్కడ ఉంటారు? ఎలా ఉంటారు? అనే ప్రశ్నలు రావడం తెలుసుకోవడం జరిగిన తర్వాత మీ యొక్క ఆశ్రమము మరియు మీరు ఇచ్చే (ప్రతి నెల పౌర్ణమి) జ్ఞాన సందేశమునకు రావాలనే కోరిక కలగడం జరిగింది. ఆ తర్వాత అక్కడకు రావడం కుదరకపోవడంతో " ప్రబోధ సేవా సమితి" కి నా వంతుగా 300 రూపాయలను ఇచ్చి సభ్యునిగా చేరిన తర్వాత నెలకి మీ యొక్క దర్శన భాగ్యం మరియు జ్ఞాన సందేశం (దశలు-దిశలు) కలగడం జరిగింది.

నాకు ఊహ తెలిసినప్పటినుండి దేవుడు, దయ్యం మీద అనేక అపోహలు, సందేహములు ఉండేవి. మీ యొక్క గ్రంథాలు పఠించడం ద్వారా నిజంగానే దేవుడు ఉన్నాడని, దయ్యం కూడా ఉన్నదని నేను కొలిచే, పూజించే, ఆరాధించే దేవుళ్ళంతా "దేవతలు" అనే నమ్మకం దృఢంగా కలిగినది. మీరు రచించిన మరియు వివరించిన గ్రంథమైన "దయ్యాలు- భూతాల యదార్థ

సంఘటనలు" లో వర్షాలు ఎలా కురస్తాయి. నీరు ఆవిరికావడం ఎప్పుడు జరుగుతుంది? ఆరిపోవడం ఎప్పుడు జరుగుతుంది? ఇదంతా పంచ భూతాల లోని ఉప భూతాలలో ఒకరైన "మేఘముల" పని అని చదివిన తర్వాత ప్రస్తుతం సైన్సు ఉపాధ్యాయునిగా ఉండే నాకు చాలా ఆశ్చర్యము కలిగి అందులోని సత్యమునకు, అంతవరకూ సముద్రములలో నీరు ఆవిరై మేఘాలుగామారి చల్లబడి తర్వాత వర్షాలు కురుస్తాయి అని విద్యార్థులకు చెప్పే నాకు దిక్కుతోచని పరిస్థితి అని, ఇందులోని విషయాలు సైన్సుకే అంతుపట్టని "సూపర్‌సైన్సు" అని అవగతం కావడం జరిగినది.

నాకు గత 10 సంవత్సరముల నుండి మద్యం సేవించడం అలవాటు ఉండేది. (అపుడపుడు) మీ యొక్క గ్రంథములు చదివిన తర్వాత ఆ మద్యం సేవించడం గురించి అనుకుంటేనే, నాలో తెలియకుండానే వణుకు (భయం) పుట్టినట్లు అన్పించే భావన కలుగుతుంది. ఎందుకంటే మిత్రద్రోహం, నమ్మకద్రోహం అయినా చేయవచ్చునేమో కాని "ఆత్మద్రోహం" చేయరాదు. ఈ జన్మలోనైన మరియు నాకు కల్గే అనేక జన్మలలోనైనా అనే భావన మనసులో నాటుకొని పోవడం జరిగినది. మీరు రచించిన "త్రైతారాధన" గ్రంథంలో "నీ ముఖమున నామము, బొట్లు కన్నా ఆది, సోమ, మంగళ వారాలలో చేయు ఆరాధనే ముఖ్యమని, నిజమైన ఇందువు అని తెలియజేయడం మరియు ఆదివారం సృష్ఠికి గుర్తు అయిన సూర్య భగవానుని, సోమవారం జ్ఞానముకు చిహ్నమైన చంద్రుడిని, మంగళవారం మోక్షానికి మార్గము అయిన నక్షత్రము (న చత్రము–చత్రము లేనివాడు) ను ఆరాధించమని చెప్పిన తీరు, పూర్వులు పాటించారు. ఇప్పుడు హిందువులు (అజ్ఞానులు)గా మారి పాటించడంలేదని చెప్పిన తీరు చూస్తుంటే నిజంగా ఆ దేవదేవుడే దిగివచ్చి జ్ఞాన సందేశమిచ్చు చున్నాడను సందేహం కల్గుచున్నది. ఏది ఏమైనా ఇప్పటికైనా దేవుని జ్ఞానములోనికి అడుగుపెట్టడానికి నాకు ద్వారం ఏర్పాటు చేసిన మీ యొక్క గ్రంథాలకు నా శతకోటి వందనాలు తెలియజేసుకుంటున్నాను. అలాగే "ఇందూ

సాంప్రదాయాలు" అనే గ్రంథం పఠించుచున్నప్పుడు పెళ్ళి అను సాంప్రదాయము పూర్వం ఎలా ఉండేది ఇపుడు ఎలా భ్రష్టుపట్టి పోయినది అను జ్ఞానం మహా అద్భుతంగా తోచినది. నిజంగా నాకు ఈ జ్ఞానం తెలిసిన తర్వాత పెళ్ళి జరుగకుండా ఉండివుంటే ఇందూ సాంప్రదాయబద్ధంగా చేసుకొని ఆ దేవదేవుని జ్ఞానం ఇంకా మెరుగు పరచుకొనేవాడిని.

ఇప్పటికి నా వయస్సు 32 సంవత్సరాలు. ఇంతవరకు మాకు అందుబాటులో ఉన్న ఇతిహాసాలు అయిన రామాయణం, మహాభారతం, భాగవతం ఏ గ్రంథాలూ చదవలేదు. కానీ నాకు మొట్టమొదటిసారే అసలైన, విశ్వాన్ని సృష్టించిన పరమాత్మ జ్ఞానం ఆనాడు "శ్రీకృష్ణ" భగవంతుడు (దేవుడు) చెప్పిన 'భగవద్గీత'ను నేడు శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వర్లు గారైన మీరు రచించిన "త్రైత సిద్ధాంత భగవద్గీత" రూపంలో చదివే భాగ్యం కల్గినందుకు నాకు నేను చేసుకొన్న 'పూర్వజన్మ సుకృతమే' అనే భావన నాలో ముద్రించ బడినది. ఎందుకంటే మిగతా గ్రంథాలు చదివి ఉన్నచో మీరు చెప్పే వాటిని నమ్మటానికి నాకు చాలా సమయం పట్టెది. నేను మొదట మీ యొక్క గ్రంథాలు చదివిన నెలకే ఇదే అసలైన దేవుని జ్ఞానమనీ, ఈ జ్ఞానం ప్రచారం చేయడం ద్వారా ప్రత్యక్షంగా దేవుని సేవలో ఉన్నట్లే అనే భావన కలగడం జరిగినది.

నిజమైన దేవుని సేవంటే యజ్ఞాలు, యాగాలు, వేదాద్యయనం కాదని "దేవుని ధర్మాలు ప్రచారం చేయడమే" అని మీ యొక్క గ్రంథాల ద్వారా తెలుసుకోవడం జరిగినది. ఇప్పటి నుండి నేను ఖర్చుచేసే అన్యదేవతారాధన, పూజలకు, దానాలు ఇచ్చే డబ్బునంతా దేవుని జ్ఞానం ప్రచారానికే వినియోగించి మరికొందరిని "ఇందువులు" గా మార్చడానికి నా సర్వశక్తులా కృషి చేస్తానని మనవి చేసుకుంటున్నాను. ఇలా రాసుకుంటూపోతే మీరు రచించిన ప్రతి గ్రంథం ఒక ఆణిముత్యం! ఒక వజ్రం!! అందులోని విషయములు చర్చించు కొంటూ పోతే నాకు ఎన్నో పేజీలు కావాలి. కాబట్టి నాకు మీ యొక్క గ్రంథాలపైన, ఆత్మ సందేశములపైన లేఖ వ్రాయుటకు, నాలోని భావాలను

స్వేచ్ఛగా వెలిబుచ్చుకోవాడానికి అవకాశం కల్పించిన మీకు శతకోటి వందనాలు తెలియజేసుకుంటూ ముగిస్తున్నాను.

ఇట్లు
మేకల చిన్నబాలయ్య



**యం. మద్దిలేటి**
గుత్తి.

శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వర్ల పాద పద్మములకు నమస్కారములు

"జ్ఞానం" అనగా తెలుసుకోవడం అని అర్థము. జ్ఞానం ఈ ధరణిలో రెండు విధాలుగా కలదు. ఒకటి ప్రాపంచిక జ్ఞానం, రెండు బ్రహ్మ జ్ఞానం. పై రెండింటిలో మొదటిది అనగా ప్రాపంచిక జ్ఞానం చాలామందికి తెల్సు కానీ బ్రహ్మజ్ఞానం చాలామందికి తెలియదు, పండితులు, గురువులని చెప్పుకొను చున్న వారికి కూడా బ్రహ్మజ్ఞానం లోతుగా తెలియదు. దీనివలన చాలామందికి బ్రహ్మజ్ఞానం తెలియని ఒక జడ పదార్థముగా ఉండిపోయింది. దీని రహస్యము తెలుసుకొనువారు చాలా అరుదుగా వున్నారు. అందువలన ఈ రహస్యమును తెలుసుకొనుటకు ఎవరూ ప్రయత్నించడము లేదు. ఎందుకనగా! ఈ రహస్యము విప్పి చెప్పేవారు దొరకపోవడం వలన ఈ జ్ఞానం ముడివిప్పని మూటవలెవుంది. ముడి విప్పని మూటలో ఏదో వుందని ఎవరికి వారు ఊహించుకొని చెప్పుచున్నారు. దీనివలన బ్రహ్మజ్ఞానం తెలియని ఒక నిగూఢమైన రహస్యంగా ఉంది. ధనరాశులున్నా లోభి తన ధనమును వినియోగించుటకు ఎలా సమ్మతించడో అదే విధముగా బ్రహ్మజ్ఞానం అర్థము తెలియక ఉండిపోయింది.

అంధుడైన మనిషి ప్రకృతి సౌందర్యమును ఏ విధముగానూ తిలకించ లేడు. భగవంతుని జ్ఞానం కూడా మరుగున పడిపోయింది. ఈ విధముగా అసలు సిసలైన దేవుని ఉనికి ప్రశ్నార్థకముగా మారింది. దీనివలన ప్రజలు

మూఢ నమ్మకాల సుడిగుండములో కొట్టుమిట్టాడుతున్నారు. శిలలకు చిత్తం మొక్కి చిత్తం చెడకొట్టుకుంటున్నారు. ఇలాంటి సమయంలో అసలు సిసలు దేవుడు తెలియక పరాయి మతంలోనికి వెళ్ళుచున్నారు. అక్కడ కూడా దేవుని మార్గం ప్రశ్నార్థకముగా మారింది. మతం మారినా, దేవుని పథము తెలియక అసలు దేవుడు ఎక్కడా లేడని ఒక నిర్వేదంలో పడిపోతున్నారు.

ఇలాంటి సమయంలో చీకటికమ్ముకొని అజ్ఞానాంధకారంలో మగ్గుచున్న భరత భూమికి జ్ఞాన సూర్యునిగా ఆవిర్భవించారు. జ్ఞాన ప్రదాత, త్రైత సిద్ధాంతకర్త శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వర్లు. నిజమైన దేవుని మార్గము తెలియజేయుటకు "నేను" అవతరించానని చెప్పి పరమాత్మ మార్గమును పండితులకు, పామరులకు అర్థమయ్యేరీతిలో చెప్పుతూ నిజమైన దేవుడు "నిరాకారుడని", ఆయనకు రూపము, నామము, క్రియ లేదని ఆయన సర్వాంతర్యామి (Omni Present) అని చెప్పుచూ, సర్వ జీవరాసులందు ఆయన కలడని ఆయన తెలిపారు. సర్వమతముల సారం "గీత" యందు కలదని గీతను పఠించు! పరమాత్మను చేరుకో! అని తెలిపాడు. ప్రకృతి, పరమాత్మలు, సకల జీవరాశులకు జననీ జనకులని ఆయన ఉద్బోధించారు. భగవద్గీత పఠనము వలన దేవుడు చెప్పిన జ్ఞానం అంతా అందులో కలదని, గీతను పఠించుట వలన నిన్ను నీవు తెల్సుకుంటావని నీలోని జీవాత్మ, ఆత్మ, పరమాత్మలను నీవు తెల్సుకుంటే నీ కర్మ ఫలమును నీవు పోగొట్టుకొని నీవు పరమాత్మలో ఐక్యమగుతావని ఆయన తెలిపారు. మోక్షప్రాప్తి కొరకు నిన్ను నీవు తెల్సుకో (Know yourself) అప్పుడే పరమాత్మను చేరుటకు మార్గము సుగమం అవుతుంది. మూడు ఆత్మల వివరమే త్రైత సిద్ధాంతము అని ఆయన తెలిపారు. సకల సృష్ఠికి ఒకే ఒక సృష్ఠికర్త కలడు. అతడే పరమాత్మ. ఇందూ ధర్మము, అందు ఇందు కలదని తెలిపిన త్రైత సిద్ధాంతకర్త శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వర్ల పాదపద్మములకు సాష్టాంగ నమస్కారాలు తెలియజేస్తూ సెలవు తీసుకుంటున్నాను.

పద్యం

సకల జీవరాశులకు, జననీ జనకులు
ప్రకృతి, పరమాత్మలు, సర్వమతముల
సారం గీతయందు కలదు గీతను పఠించు
పరమాత్మను చేరుకో!
మద్దివారి మాట మంచిమాట!!

ఇట్లు
మద్దిలేటి



**కె.వి.రవి శంకర్ శ్రావణ్**
గుత్తి.

శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరుల వారి పాదపద్మములకు నమస్కరించి వ్రాయునది ఏమనగా!

ఇంతవరకు గడచిన జీవితంలో అన్నీ ప్రశ్నలుగా ఉండినవి. అవి కొన్ని మీకు వివరించెదను.

1. ఇంతమంది దేవతలను ప్రార్థించవలయునా అని నాలోని ఆత్మ ప్రశిస్తూ ఉండినది, ఎక్కడను నాకు సరియైన సమాధానము దొరకలేదు.

2. చనిపోయినవారికి దిన (కర్మకాండ)ములు ఎందుకు చేయాలి అని నాలో ప్రశ్న ఎప్పుడూ వేధిస్తూ ఉండినది.

3. భర్త చనిపోయిన విధవరాలును చూస్తే అపశకునమని భావిస్తారు కదా అలా ఎందుకు భావిస్తున్నారు? అది తప్పా? కాదా? ప్రశ్నగా మిగిలిపోయినది.

4) అమావాస్య రోజున ఏ పనీ చేయవద్దు, ఎక్కడికీపోవద్దు అని పెద్దలు చెప్తూవుంటారు. నాలోమాత్రం ఎందుకు చేయకూడదు, ఎందుకు పోకూడదు అని ప్రశ్నగానే ఉండినది. ఆ పెద్దలు మాత్రము ఫలానా కారణము అని ఖచ్చితముగా చెప్పలేకపోయారు.

5. శివలింగము గురించి శివుడు ఆయననే, శంకరుడు అయనే అని అనుకొనివుంటిని, పై ప్రశ్నలకు నాకు ఈ జన్మలోనే పరిష్కారము లభిస్తుందా అని అనుకొనేవాడిని.

6. నాకు 14 సం.ల వయస్సులో ఊరి బయట చేనుకుపోయి బండిలో కట్టెలు వేసుకొని ఇంటికి వస్తుండగా కొండక్రింద రక్షణకై వేసిన ఒక రాళ్ళకట్టవ సుమారు 6 అడుగులు పైన వుంటుంది. ఆ కట్టవను ఒక పెద్ద ఆజానుబాహుడు చాలా మామూలుగా దాటడము చూసి నాకు ఆశ్చర్యమేసింది. భయము కూడా కల్గినది. ఆ కట్టవను మామూలుగా దాటి నడిచి వెళ్ళినట్లుగా వెళ్ళడము నా కళ్ళతో చూసి అందరికీ చెప్పగా అందరూ దెయ్యంలే అని అన్నారు. ఆయన ఎవరో ఏమిటో నాకు తెలియదు. ఇది కూడా ప్రశ్నగానే మిగిలిపోయినది. మీరు అందించిన ఇంత గొప్ప జ్ఞానము తెలుగులో రావడము అందునా గుత్తిలో నేను ఉండడము ఎన్నో జన్మల అదృష్టంగా భావిస్తున్నాను.

మీ ఆశీర్వాదము ఉండడము వలననే నాకు ఈ జ్ఞానము లభించినదని నా భావన. గతంలో సాయిలీలామృతము, గురుచరిత్ర ఎన్నోసార్లు పారాయణ చేస్తూవుంటిని, వాటిని కోరికల కోసమే పారాయణ చేసేవాడిని. వాటిలో కూడా ప్రశ్నలు వచ్చేవి. కానీ సమాధానము దొరకలేదు. గుత్తిలో ప్రతి ఆదివారము, మంగళవారము చెప్తున్న సత్సంగము వింటుంటే ఎప్పుడూ సత్సంగము వినని, ఎక్కడా చెప్పని గొప్ప దైవజ్ఞానము మాకు లభిస్తోంది. ఇన్ని సంవత్సరములకైనా ఈ జ్ఞానము లభించినందుకు మీకు ఎన్ని నమస్కారములు చేసినను తక్కువే అని నాలోని భావన. మొదట నేను దేవాలయ రహస్యములు, ఇందూ సాంప్రదాయములు, గీతాపరిచయము, ప్రవక్తలు ఎవరు?, కర్మపత్రము అను గ్రంథములు చదివినాను. నాలోని ఆత్మ అందించిన ప్రకారము ఈ సృష్ఠి లోని గొప్పగొప్ప రహస్యములు అన్నీ మీరు ఒక్కొక్కటిగా అందిస్తున్నా, ఈ మానవులు ఎందుకు అర్థం చేసుకోలేకపోతున్నారో నాకు అర్థం కావడం లేదు. మరుజన్మ లేకుండా నాకు ఈ జన్మలోనే మోక్షాన్ని ప్రసాదించమని, నా కర్మలన్నీ

కాల్చివేయ బడాలని ఆ సంచిత కర్మకూడా లేకుండా ఉండేందుకు కావలసిన జ్ఞానాగ్నిని నాలోని (ఆత్మకు) బుద్ధికి నూరు శాతము అందించాలని కోరుకుంటూ సర్వ ఆత్మలకు అధిపతి అయిన మీకు నా హృదయపూర్వక పాదాభివందనములు తెలియజేసుకొనుచున్నాను.

ఇట్లు
మీ భక్తుడైన
కె.వి.రవి శంకర్ శ్రావణ్,



**మార్ల మనోహర్**
గుత్తి.

అజ్ఞానంధకార ప్రపంచంలో జ్ఞాన జ్యోతులు వెలిగించి మూఢులను జ్ఞానులను, చేయ విచ్చేసిన జ్ఞానజ్యోతి శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరుల పాదపద్మములకు నమస్కరించి గుత్తినుండి జ్ఞాన జిజ్ఞాసి మార్ల మనోహర్ వ్రాయులేఖ.

స్వామిగారు!

ప్రపంచావనిలో భాగమైన ఈ ప్రాంతంలో మూఢత్వంతో జీవితాలని కొనసాగిస్తున్న మూఢులను మూర్ఖులను మేల్కొలుపుటకు, మీరు నెలకొల్పిన వేదిక త్రైత సిద్ధాంతిక వేదిక ద్వారా ప్రతి ఒక్కరి మస్తిష్కంలో జ్ఞాన జ్యోతులని వెలిగించి వారిని జ్ఞానమార్గం వైపుకి నడిపిస్తున్నందుకు ముందుగా మీకు మా హృదయపూర్వక ధన్యవాదాలు తెలియజేస్తున్నాను. సృష్ఠి ఆదిలో జన్మించిన మానవుడు తన జన్మేంటో? తన జన్మకి కారణం ఏంటో తెలియక పరమాత్మ జ్ఞానం వైపుకికాక ప్రపంచజ్ఞానంవైపు నడుస్తూ తమ జన్మలన్నీ వ్యర్థ పరుచుకుంటున్నారు. అసలైన పరమాత్మని తెలుసుకోలేక, హేతువాదం, నాస్తికవాదంవంటి వింతవాదనలతో ఆది దేవుడైన ఆ పరమాత్మని చులకన

భావంతో చూస్తున్నారు. అలాంటి మూఢులని తమరి బోధనల ద్వారా తమరి రచనల ద్వారా వారికి నిజమైన పరమాత్మ జ్ఞానాన్ని బోధించి వారిని జాగృతం చేసినందుకు మీకు మరొక్కసారి మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనలని తెలియజేస్తున్నాను. హేతువాదం, నాస్తికవాదం నరనరాన జీర్ణించుకున్న నేను కూడా ఈ ప్రాంతములో ప్రబోధకులైన శ్రీ ఆదిశేషయ్యగారి ప్రసంగానికి ప్రభావితుడై, నేను ప్రతివారం జ్ఞానం తెలుసుకోవటానికి, శ్రీ ఆదిశేషయ్యగారి జ్ఞానాశ్రమమునకు వస్తున్నాను. ఈ ప్రాంతంలో జ్ఞానాభివృద్ధికి తోడ్పాటు అందిస్తున్న శ్రీ ఆదిశేషయ్యగారికి నేను నా హృదయపూర్వక అక్షరాల వందనాలు తెలియజేస్తున్నాను. అలాగే ప్రతివారం తాడిపత్రి నుండి గుత్తికి వచ్చి తన చక్కటి ప్రసంగంతో సందర్భోచితమైన ఉపమానాలతో సామెతలతో ప్రతి ఒక్కరూ సంపూర్ణముగా అర్థం చేసుకునేటట్లు చక్కని జ్ఞాన బోధ చేస్తున్న శ్రీ శంకరన్నగారికి మా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు తెలియజేసుకుంటున్నాము. మొత్తానికి మొత్తం వాస్తవ జ్ఞానం తెలుపుతూ దేవుడు గుడిగోపురంలో లేడు. ఈ సమస్త సృష్టియందు నింగి నేల మధ్య తెల్లనివర్ణంతో మన అందరి మధ్య ఆవతరించినవాడే నిజమైన దేవుడు అని విశేషముగ తెల్పిన మీకు మరొక్కసారి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు తెలియజేస్తూ మీ మన త్రైత సిద్ధాంత వేదిక మరింత పురోభివృద్ధి వైపుకు నడవాలని కాంక్షిస్తున్నాను.

ఇట్లు

మీ జ్ఞాన జిజ్ఞాసి (మార్ల మనోహర్)



**ఎ.వి. రంగారావు**

గుత్తి.

శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులవారికి

నా హృదయపూర్వక నమస్కారములు...

నేను 30 సం॥ నుండి ఆధ్యాత్మిక విషయాలు మరియు గురువులు

మరియు దేవుళ్ళను మరియు మంత్రాల యొక్క మర్మమును తెలుసుకోవడానికి ఎంతో మందితో చర్చించి వాటిని తెలుసుకోవడము నాకు చాలా ఆసక్తి. చాలామంది నుండి దైవ ఉపదేశాలు మరియు వారి వీడియో ద్వారా ప్రసంగాలు చాలా విన్నాను. నేను ఒక గురువు దగ్గర ఆధ్యాత్మిక విషయాలు మరియు జ్యోతిష్యశాస్త్ర విషయాలు దాదాపు 3 సం॥ విన్నాను. నాకు చిన్ననాటి నుండి చాలా కష్టములు ఉండేవి. వాటిని దాటడానికి ఎన్నో దేవుళ్ళ గుళ్ళు తిరిగాను. దైవకార్యాలు చాలా చేశాను. ఎంతోమందితో ఈ విషయాలపై చర్చించేవాడిని. కాని నాకు ఒక విషయము మాత్రము అర్థము అయ్యేదికాదు. ఎందుకంటే మా గురువు అయినవారు నీవు కష్టాలు అనుభవించు, కర్మను దగ్ధము చేసుకో! అనేవాడు కష్టము వచ్చినప్పుడు నేను గురువు ఫోటో చూచేవాడిని. ఆయన ఒకేఒక మాట చెప్పేవాడు. నీ కర్మను పూర్తి చేయి అనేవాడు. నేను ఎంతకాలం ఇలా నా ఈ కర్మను అనుభవించాలి దీనికి మార్గము లేదా అనుకునేవాడిని.

నేను ఈ మధ్య ఇంగ్లీషు స్పోకెన్ క్లాస్‌లకు ఆదిశేషయ్య అనే టీచర్ దగ్గరకు పోతున్నాను. సారుగారు నాకు జ్ఞానము తెలుసుకోవాలి అపుడు ఈ కర్మలు మరియు ఈ దుఃఖానికి మార్గము తెలుస్తుంది అనేవారు.

నాకు ఒక ప్రశ్న ఉదయించింది. అది ఏమనగా! జ్ఞానము అంటే ఏమిటి? జ్ఞానము తెలుసుకోవడం ద్వారా ఈ కర్మ ఎలా పోతుంది? అని అనుకొనెడివాడిని. సార్‌గారు "ఆదివారం మా ఇంటినందు క్లాస్‌లు జరుగుతాయి, మీకు వీలు అయితే రండి సార్" అని చెప్పినారు. నేను క్లాస్‌లకు పోయినాను. అక్కడ మొదట్లో నాకు అర్థం కాలేదు. అసలు నా ప్రశ్నకు సమాధానములు దొరుకుతాయా లేదా అనే సందిగ్ధంలో పడినాను. కానీ చూద్దాం అని ఆదివారం రోజున నాకు ఎంత ఇబ్బంది ఉన్నా నేను ఏదో ఒక టైంలో క్లాస్‌కు పోయేవాడిని. నాకు లాస్ట్ క్లాస్‌నందు నా ప్రశ్నకు సమాధానం దొరికింది. నా మనస్సుకు ఎంతో సంతోషము కల్గింది, ఎంతో తృప్తి కూడా కల్గింది.

నేను ఇప్పుడు ఏ కష్టము వచ్చినా ఆ కష్టాన్ని హృదయపూర్వకముగా స్వీకరిస్తున్నాను. ఎందుకనగా, నా కర్మలు అన్నియూ పూర్తి చేసుకుంటున్నానని నాకు ఈ జన్మనందే ఈ కర్మలు అన్నియు దాదాపు పూర్తి చేసుకుంటే వచ్చే జన్మనందైనా ఇంతకంటే ఉత్తమ జన్మ వస్తుందని ఇలా ప్రతి జన్మనందు ఈ కర్మలు పూర్తి చేసుకుంటే ఆ దైవమునందు ఐక్యము కావచ్చునని నేను నా హృదయపూర్వకంగా తలంచుచున్నాను.

ఈ విషయము తెలిసిన తరువాత, నేను నా దగ్గర ఉన్న కొంతమంది ఆధ్యాత్మిక విషయాలపై ఆసక్తి ఉన్నవారివద్ద ఈ విషయము మరియు స్వామివారి గ్రంథము ఇచ్చి చర్చించినపుడు వారు చాలా ఆసక్తితో విని సార్ మేము కూడా ఆ క్లాస్‌లకు వస్తామని చెప్పడం జరిగినది.

నేను స్వామి వారికి, ఇంతటి మర్మాన్ని ప్రజలకు అందించినందులకు వారికి నా హృదయపూర్వక నమస్కారము తెలియజేసుకొనుచున్నాను.

ఇట్లు
రంగారావు



**జి. శేఖర్‌రావు, జి. లక్ష్మీబాయి**
పామిడి, అనంతపురం జిల్లా.

ఓం శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరాయనమః
పరమ పూజ్య శ్రీ గురుదేవుల పాదపద్మంబులకు ఓ భక్త పరమాణువు. నమస్కరించి వ్రాయునది.

అల్పులను జ్ఞానులన్‌జేయ బయల్పడిన ఓ గురురాయా! మీకు మా హృదయపూర్వక వందనములు.

మీ యొక్క అనంతమైన జ్ఞాన సముద్రంలో నుంచి వెలువడిన వెలుగులు కొన్ని గ్రంథములలోని జ్ఞానరూపములో మా తలకు ఎక్కినది. మా జీవితం 40 సం॥లు కాలము వృథా అయిపోయినదని నిరాశా నిస్పృహలలో మునిగి ఇక ఈ జీవితం వ్యర్థం, బ్రతుకుటకు ఏమాత్రం అధికారము లేదు అని నిర్ణయించుకొని బలవన్మరణము పొందడమా లేక ఈ మానవ సమాజమును విడిచి దూరముగా పోవడమా అని సందిగ్దంలో మునిగి నిజమైన జ్ఞానమును (ఆత్మ విద్యను బాల్యమునుంచే కోరుకున్నవారమై) తెలియక ఇది నిజమని నమ్మి 1993వ సం॥లలో వనం రాఘవేంద్ర శర్మ అను బోధకుడు మాకు ఉపదేశించిన (చెవిలో రహస్యముగా) మంత్రములు రెండును 1) ఓం హంస సహంసాయ విద్మహే పరమ హంసాయ ధీమహి తన్నో హంస ప్రచోదయాత్ 10 సం॥ జపం చేశాము. 2) తర్వాత 2006వ సం॥ లో ఓం ఐం క్లీం సౌః క్లీం ఏం అమృతం స్రావయ స్రావయ స్వాహా. ( ఇవి రెండూ ఆత్మవిద్యకు సంబంధించి మహా విద్యలని, ఇవి సిద్ధిస్తే మోక్షం లభిస్తుందని బోధకుని బోధ) రెండవ మంత్రం (మరియు మధ్యలో 1996లో చండీ పారాయణం చెప్పడం మేము చేస్తూ వస్తున్నాము.) 6 నెలల కాలంలో దీక్షగా 3 లక్షలు చేయండి. మీ జన్మకు ధన్యత లభిస్తుందని, అనుకూలిస్తే 6 లక్షలు జీవితకాలములో చేయండని చెప్పి నియమాలు 3 పెట్టారు. 1) ఏకభుక్తం, 2) బ్రహ్మచర్యం 3) భూ సయనం ఆచరించండి అని చెప్పారు. మేము చేశాము. పూర్తి అయిన వెంటనే సిద్ధిస్తుందని హోమం కూడా చేశారు. 2006-2007 సం॥లలో మా స్నేహితులు, బంధువులు అయిన కొంతమంది సలహాలిచ్చి ప్రవేటు సంస్థలలో వారు కొంతధనం పెట్టుబడి పెట్టి పెట్టిన తక్కువ సమయంలో ఎక్కువ రాబడి ఆదాయం వస్తుందని చెప్పి మమ్ములను అందులో దించి ఆ కంపెనీ తరపున మాకు "మహరాష్ట్ర" రాష్ట్రంలో పెట్టనున్న బ్రాంచిలో మేనేజరు ఉదోగ్యము ఇస్తామని మమ్మల్ని నమ్మించినారు. మేము నమ్మి సర్వము అందులో కోల్పోవడము జరిగింది. మా తండ్రిగారు మా కులము పెద్దకావున అవమాన భారముతో దిక్కుతోచని పరిస్థితిలో 2007-2008 సం॥లలో పామిడినందు చేరుకుని

జీవించడం మొదలైనది. మా జీవితంలో పూజలు, జపాలు ఎన్ని సం॥ లు చేసినా సంతృప్తిలేక ఎన్నోమార్లు బోధకున్ని ఎన్నో సంవత్సరములు ప్రశ్నిస్తూనే వస్తున్నాము. మా ధాటికి తట్టుకోలేక ఆయన కొంతకాలము నిరీక్షించండి, మేము మాకంటే పెద్ద బోధకులను మీకు చూపుతామని చెబుతూవచ్చారు. మేము విశ్వాసముతో ఎన్నో సేవలు కూడా చేశాము. అయినా జీవితమంతా ఆత్మ తృప్తిలేదు, సంతృప్తి లేదు. అంతా అసంతృప్తియే మిగిలింది. "ఇన్ని సం॥ మీకు పూజలు పునస్కారములు చేసి సర్వమూ కోల్పోయి హీనాతి హీనంగా జీవిస్తున్నారను ధ్యాస మామీద లేదాయని" ఆ అమ్మను శ్రీలలిత త్రిపుర సుందరి (ప్రకృతి) ని ప్రశ్నిస్తూనే వస్తున్నాము. అటువంటి సమయంలోనే విసిగి జీవితంపై విరక్తి భావము ఇంతింతై కొండంతై ఏదోఒక నిర్ణయం తీసుకుందామనుకున్న సమయంలో మాకు చేతివృత్తి చేసుకుని పొట్టకూటికోసం చేయు టైలర్ వృత్తిలో ఒకరిద్దరితో పరిచయం ఏర్పడి, వారిరువురి వలన మా జీవితాలు నిజంగా మలుపు తిరిగినవని ఒప్పుకుంటున్నాము. అది 12-12-2012 గజరాంపల్లి రామాంజనేయులు (అడ్వకేట్), శ్రీనివాసులు (ఆటో) వారి ద్వారా అద్భుతమైన, మహోన్నతమైన, సత్యమైన, పవిత్రమైన, మహిమాన్వితమైన, ఎంత చెప్పినా వన్నె తగ్గని వజ్రాలుగా, ఇంకా ఎంతో గొప్పవిగా చెప్పుకొను గ్రంథములు లభించినవి. వాటిలో ఒకటవ గ్రంథముగా మేము చదివిన మొదటి గ్రంథం అవి 1) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు, 2) తల్లి-తండ్రి, 3) మరణ రహస్యము, 4) గురువు, 5) త్రైతారాధన, 6) ప్రబోధ, 7) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా! ఇందులో చివరి గ్రంథం మా జీవితాలకు అర్థం చెప్పిన గ్రంథము. ముఖ్యముగా మా బాల్యంలో నుంచే మాకు ఎన్నో ప్రశ్నలు. అవి ఏమనగా! ఎవరు నీవు? ఎక్కడి నుండి వచ్చావు? ఏం చేస్తున్నావు? ఎక్కడికి పోతావు?

తరువాత యవ్వనంలో వచ్చిన ప్రశ్నలు, ఆత్మవిద్య నేర్చుకో? ఆధ్యాత్మికం తెలుసుకో? నిజంగా భూమిమీద దయ్యాలున్నాయా? అసలు దేవుడు ఉన్నాడా భ్రమా? దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు గ్రంథం ముందు మాట

పూర్తికాకనే మాలోని చపలచిత్వం, అన్యమనస్కం, అసంతృప్తి, నిస్పృహ, ఇంకా అన్నీ వెంటనే క్షణంలో ప్రక్కకుపోయి "నీవు వెతుకుతున్నది ఇదే" నీకు కావలసినది ఇదే! ఇది సత్యం... ఇది సత్యం.... అని మా అంతరాలలో నుండి ఆదేశించినారు. అదే ఆత్మప్రబోధం అనుకుంటున్నాను. ఆ తర్వాత గ్రంథం పూర్తి అయినది. అలౌకికానందం, అశ్రువుల రూపంలో 3 రోజులు 9 రోజులు... ఆగలేదు. ఆపతరం కాలేదు. తల్లి-తండ్రి చదివిన తరువాత అపుడు అనిపించినది ఇన్ని సం॥ లు మేము సేవ చేసినది ప్రకృతి అమ్మకి అని, ఆమెయే పరీక్షించి మమ్ములను అసలైన "తండ్రి" జగద్భర్త, పరమాత్మ అంశమున ఈ భూమండలమును ఏకతాటిపైకి తెచ్చి ఏకేశ్వరోపాసన చేసే విధంగా అల్పులను జ్ఞానులన్ జేయ వచ్చిన భగవంతుడు, గురురాయుడు అని ఆత్మ పులకించినది. ఈ భూమండలానికి నిజంగా గురువు వచ్చినాడని మా రెండు జంట ఆత్మలు (మేము, మా భార్య) అమితానందము పొందుతూ చిన్న పిల్లలకు మంచి డ్రస్సులు, స్కూల్లో చాక్లెట్లు, బిస్కెట్లు ఇచ్చి మంచి పుస్తకాలు ఇస్తే ఎంత నూతన "శ్రద్ధ" తో చదువుకుంటారో అటువంటి శ్రద్ధ నిజంగా మాకు కలిగినందులకు, ఆ దేవుని దృష్టి ప్రసారం మాపై కలిగినందుకు మేము ఈ జీవితాంతం కృతజ్ఞులమై ఉంటామని ఆత్మ పూర్వకంగా చెప్పుకొంటున్నాము.

అసలు జీవాత్మ గుణచక్రంలో చిక్కుకొని ఉన్నాడని తెలిసి ఆశ్చర్యానికి లోనయ్యాము. బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రముల విశేషములు తెలియుట మానవులకు ఎంతో పూర్వజన్మ సుకృతంగా మేము చాలా విశ్వసిస్తున్నాము. ఒక ప్రక్క గ్రంథములో మానవుని జన్మ, మరణ రహస్యములు తెలుపుతూ, మరొక గ్రంథంలో దైవమును, దైవ ధర్మములను, నిజమైన దైవపూజను త్రైతారాధన ద్వారా ఆచరణలు తెలుపుతూ మాలోని సంశయాన్ని పటాపంచలు చేసి మావంటి అల్పులను జ్ఞానులన్ జేయ ధరణియందు భగము నుండి భగవంతునిగా వచ్చిన స్వామికి మనఃపూర్వక వందనములు తెలుపుతూ శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా? గ్రంథంలోని 49వ పేజీలో మాలాంటి వారు ఎందరో

మోసపోవుచుందురని స్వామివారు వ్రాసినది అక్షర సత్యం. ఆ 49వ పేజీ సారాంశము :-

"పుట్టినప్పటినుండి తిండికోసము, పెరిగినప్పటినుండి బ్రతుకు తెరువు కోసం ప్రాకులాడు మనుషులకు జీవితములో ముఖ్యమైనది దైవజ్ఞానమని తెలియకుండాపోయినది. ఒకవేళ కొన్ని వేలమందిలో అరుదుగా ఎవనికైనా దైవజ్ఞానము మీద ఆసక్తి కలిగినా, వానికి దైవజ్ఞాన రూపములో మాయ జ్ఞానము తెలియుచున్నది. అలా మాయ జ్ఞానము అంటుకున్న కొన్ని లక్షల మందిలో ఎవడైనా అరుదుగా దైవజ్ఞానము ప్రత్యక్షముగా ఉన్నదని, ఇంతవరకు తనకు తెలిసినది దైవజ్ఞానము కాదని తెలియగలడు." ఇది సత్యము అని పదే పదే తెలుపుకుంటున్నాము. మేము "అందరిపతి" వైద్యుల చూపులోని భవ రోగులమైనందుకు ఎంతో ఆనందిస్తున్నాము. ఒక ఇందువుగా చాలా సంతోషిస్తున్నాము. దేవుని ధర్మాలు, దేవుడు మతాలకు అతీతమని మా ప్రగాఢ విశ్వాసం దానికి మీరు బలం చేకూర్చారు. మానవులకు ఎంతో అందిస్తున్నారు. మాకు నిజంగా ఈ దేవుని మార్గం దొరకని, తెలియని పరిస్థితి కొంతకాలం ఆలస్యం అయివుంటే సూక్ష్మాలుగా మిగిలేవాళ్ళం. ఇప్పుడు భయములేదు, ఇంతకు 2 నెలలు క్రితం వరకు మానవ జన్మ ఎందుకు, మానవ జన్మ ఇంత నరకమా అనిపించేది. ఇప్పటి స్థితిలో ప్రతి రోజు ఆత్మానందం పొందుతున్నాము. బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రాలు నుదుట ధరించి ఆది, సోమ, మంగళ వారములు 3 సమయాలు, మూడు రకముల త్రైతారాధన ద్వారా అనంతమైన శక్తిని, ఆత్మశక్తిని పొందుతూ ప్రతి ఆదివారము గుత్తి ఆదిశేషయ్యగారి ఇంట్లో సత్సంగములో, శంకరయ్యగారి దివ్య సందేశముతో, నెలలో ఒకసారి వచ్చు పౌర్ణమికి చిన్నపొడమల క్షేత్రంలో గల ప్రబోధ ఆశ్రమమునందు శ్రీ కృష్ణుడుని దర్శించుకొని స్వామి దివ్య సందేశము శ్రవణము గావించి అంతరములో "స్వార్థవరులుగా" బాహ్యమున "నిస్వార్థవరులుగా" ప్రవర్తిస్తూ, ఆచరిస్తూ ఇంకా ముందుకు మమ్మల్ని జ్ఞాన యోగులుగా,

కర్మయోగులుగా, బ్రహ్మ యోగులుగా నడిపించాలని, పరమాత్మ శక్తి ఏదేతై భూమీద అవతరించియున్నదో, ఆ గురురాయుని కోరుకుంటూ ఆయన దివ్యదృష్టి, ఆయన చూపు మామీద ఎల్లవేళలా అన్ని జన్మలకూ ఉండాలని ఆయనలో ఐక్యమయ్యేవరకు కొనసాగాలని విశ్వసిస్తూ మీ భక్త పరమాణువులు...

ఇట్లు
జి. శేఖర్‌రావు, జి. లక్ష్మిబాయి

చివరగా చిన్న విన్నపము :-

నిజమైన సాకారమును ఒక్కసారి దర్శించి వారి పాదపద్మములకు నమస్కరించి ఒక్క ఫోటో దిగి భద్రంగా ఉంచుకోవాలని, ఈ.. మీ... భక్త పరమాణువుల ఆశను మన్నిస్తారని తలుస్తూ పిలిపించుకుంటారని ఖచ్చితంగా నమ్ముతూ మనఃపూర్వకంగా నమస్కరించుకుంటున్నాము.

ఓం ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరాయనమః



# చివరి మాట

మేము ధర్మశాస్త్రమును గురించి దేవుడు చెప్పినదే ధర్మశాస్త్రమనినా నమ్మకుండా కొందరు మోషే వ్రాసినదే ధర్మశాస్త్రము, దానిని గురించే ఏసు ప్రస్తావించాడు తప్ప మీరు చెప్పినట్లు ఏసు చెప్పలేదు అనువారు కలరు. మరికొందరు "ధర్మశాస్త్రమును గురించి మీరు ప్రక్కదారి పట్టించుచున్నారు. వాస్తవముగా ఈసా చెప్పిన ఇంజీల్ గ్రంథమే ధర్మశాస్త్రమని" అంటున్నారు. మరికొందరు మూసా చెప్పిన తౌరాత్ గ్రంథమే ధర్మశాస్త్రమని కొందరంటున్నారు. ఎవరేమి చెప్పినా దేనినీ నేను గ్రుడ్డిగా

ఖండించను. నేను ప్రతి దానికీ ఒక శాస్త్రబద్ధత, సూత్రబద్ధత ఉండాలి అని చెప్పుచున్నాను. సూత్రము ప్రకారము ధర్మములు గల గ్రంథమేదైనా ధర్మశాస్త్రమే యగును. దేవుని ధర్మములుగల గ్రంథమేదైనా అది దైవ గ్రంథమే అయినట్లు, ధర్మములు గల గ్రంథమేదైనా ధర్మశాస్త్రమే యగును. అయితే పైన చెప్పిన ఇంజీల్ గ్రంథమూ, తౌరాత్ గ్రంథమును గురించి నా ఉద్దేశ్యమును తెలుపుచున్నాను చూడండి.

ఈ గ్రంథముల పేర్లు ఖుర్ఆన్‌లో మూడవ సూరాలో మూడవ ఆయత్‌నందు కలవు. 3వ సూరా, 3వ ఆయత్‌నందు ఇలా కలదు. "ఆయన సత్యమైన ఈ దివ్య గ్రంథాన్ని (ఖుర్ఆన్‌ను) ఓ ప్రవక్తా! నీపై అవతరింప జేశాడు. ఇది పూర్వము అవతరింపజేసిన గ్రంథాలలోని వాక్యాలను ధృవపరుస్తోంది. దేవుడు పూర్వము తౌరాత్ మరియు ఇంజీలు గ్రంథములను అవతరింపజేశాడు." అని ఖుర్ఆన్ గ్రంథమునందు చెప్పియున్నది కదా! ఖుర్ఆన్‌లో జిబ్రయేల్ ముహమ్మద్ ప్రవక్తగారికి చెప్పినప్పుడు ప్రవక్తగారు రెండు గ్రంథముల పేర్లను విన్నాడు. జిబ్రయేల్ గ్రహము చెప్పినప్పుడు రెండు గ్రంథములు పూర్వము దేవుడు అవతరింప జేసిన గ్రంథములని తెలిసిపోవుచున్నది. అయితే ఆ రెండు గ్రంథములలో ఇది ఇంజీల్ గ్రంథమనీ, ఇది తౌరాత్ గ్రంథమనీ చెప్పుటకు ఎవరికీ అవకాశము లేదు. ఎందుకనగా జిబ్రయేల్ చెప్పిన తర్వాత ఆ రెండు గ్రంథములను ఫలానాయని గుర్తించినవారుగానీ, చూచినవారుగానీ లేరు. అవి ఉన్నాయో లేవో కూడా తెలియదు. ఈ రెండు గ్రంథాలు ఖుర్ఆన్ కంటే ముందు గల గ్రంథములు. ఈ రెండు గ్రంథములు దేవునిచే వచ్చినవి కావున అవి రెండూ దైవ గ్రంథములే. అయితే నేటి ప్రజలకు వాటి ఉనికి తెలియకుండా పోయినది. అయితే కొందరు మాకు ఆ గ్రంథములు

తెలుసునని చెప్పుకోవడము కూడా జరుగుచున్నది. కొందరు ఇంజీల్ గ్రంథమే బైబిలు అంటున్నారు. ఈసాకు దేవుడు ఇచ్చిన గ్రంథము ఇంజీల్ అంటున్నారు. ఈసా అంటే మరియమ్మ కుమారుడు ఏసు అంటున్నారు. అయితే ఏసు ఏనాడూ ఇంజీల్ గ్రంథమును గురించి చెప్పలేదు. ఆయన ఎప్పుడుగానీ ఇంజీల్ గ్రంథము యొక్క ప్రస్తావన తేలేదు. అందువలన ఆ మాటను సత్యమనుటకు వీలులేదు.

ఇంజీలు గ్రంథముకంటే ముందు తౌరాత్ గ్రంథము పేరును జిబ్రయేల్ చెప్పడము జరిగినది. దీనినిబట్టి ఇంజీలు గ్రంథముకంటే ముందుది తౌరాత్ గ్రంథమని తెలియుచున్నది. తౌరాత్ మరియు ఇంజీల్ రెండు గ్రంథములను దేవుడు అవతరింపజేశాడు అని ఖుర్ఆన్ మూడవ సూరా, మూడవ ఆయత్‌లో కలదు. దేవుడు అవతరింపజేయడము అని జిబ్రయేల్ చెప్పాడు అంటే అది నూటికి నూరుపాళ్ళు నిజమే. అయితే దేవుడు గ్రంథములను అవతరింపజేయునది కూడా 42వ సూరా 51వ ఆయత్‌లో చెప్పినట్లు మూడు విధానముల ద్వారానే జరుగవలెను. అయితే మొదటి విధానము ఆకాశమునుండి చెప్పడము ఒకమారే జరుగును. కనుక మిగత రెండు విధానముల ద్వారానే, ఏదో ఒక రకముగా రెండు గ్రంథములు వచ్చియుండును. ఇంకనూ ఆలోచిస్తే రెండు గ్రంథములు కనిపించని గ్రహము ద్వారా కాకుండా కనిపించే మనిషి ద్వారానే చెప్పబడినవని కూడా అర్థమగుచున్నది. ఎందుకనగా! తెరచాటునుండి కనిపించక చెప్పబడిన గ్రంథము ఖుర్ఆన్. ఖుర్ఆన్‌లోనే ఖుర్ఆన్ కంటే ముందు వచ్చిన గ్రంథములని చెప్పబడుట వలన అలా చెప్పవలసి వచ్చినది.

తౌరాత్ గ్రంథము మూసా ప్రవక్త చేత చెప్పబడినదని కొందరు అంటున్నారు. అయితే మూసా అంటే ఎవరో పూర్తిగా ఎవరికీ తెలియదు.

మూసా అంటే మోషే ప్రవక్త అనువారు కూడా కలరు. మోషే వ్రాసిన ధర్మశాస్త్రము యొక్క పేరే తౌరాత్ గ్రంథమని అంటున్నారు. మోషే వ్రాసిన ధర్మశాస్త్రమును ఎవరైనా చూచారా అని ప్రశ్నిస్తే చూచినవారు ఎవరూ లేరు. కొందరు యెషయా నే మోషే అని చెప్పడము కూడా జరుగుచున్నది. యెషయా వ్రాసిన దానినే ధర్మశాస్త్రమని కొందరు చెప్పుచున్నారు. ధర్మ శాస్త్రములోని లేఖనములే ఏసు జీవితములో నెరవేరినవనీ ధర్మశాస్త్రమును నెరవేర్చుటకే నేను వచ్చానని ఏసు చెప్పాడని కూడా చెప్పుచున్నారు. యెషయా వ్రాసిన ధర్మశాస్త్రము యొక్క వాక్యములే ఏసు జీవితములో అనేకచోట్ల జరిగినట్లు నాలుగు సువార్తలలో చూచాము. యోహాను సువార్త 15వ అధ్యాయములో 25వ వాక్యమునందు "నన్ను నిర్హేతుకముగా ద్వేషించిరి" అని ధర్మశాస్త్రములో వ్రాయబడిన వాక్యము నెరవేరునట్లు ఇలాగు జరిగెను అని కలదు. మిగతా అనేకచోట్ల యెషయా వ్రాసిన లేఖనములు నెరవేరెను అని కూడా వ్రాయడము జరిగినది. ఇదంతయు చూస్తే మోషే, యెషయా ఇద్దరు ఒకటేనా అని అనుమానము రాగలదు. ఇద్దరూ ఒకటే అనుటకు ఏమాత్రము ఆధారము కూడా లేదు.

అంతేకాక ఏసు జీవితములో నెరవేరిన వాక్యములను ధర్మశాస్త్ర మనుటయే పొరపాటని, అవి జ్యోతిష్యశాస్త్రమగునుగానీ ధర్మశాస్త్రము కాదని ముందే మనము చెప్పుకొన్నాము. అందువలన ఖుర్ఆన్‌లో మూడవ సూరా, మూడవ ఆయత్‌నందు చెప్పిన తౌరాత్, ఇంజీల్ గ్రంథముల విషయములు పూర్తిగా ఎవరికీ తెలియవనియే చెప్పవచ్చును. మాకు తెలుసును అని ఎవరు ఎట్లు మాట్లాడినా దానికి తగిన రీతిగా ఆధారములు లేవు. అందువలన ఖుర్ఆన్ కంటే ముందుగల రెండు గ్రంథములు ఏవి అని యోచించి చూస్తే, కొంత సమాచారము తెలియుచున్నది. అది ఏమనగా!

ఖుర్ఆన్ కంటే ముందు వచ్చిన రెండు గ్రంథములు ఒకటి ప్రథమ దైవ గ్రంథము, రెండు ద్వితీయ దైవ గ్రంథమని మనము ఈ గ్రంథములో ముందే చెప్పుకొన్నాము. ఈ రెండు గ్రంథములు తప్ప దేవునిచేత ఇవ్వబడిన గ్రంథములు ప్రపంచములో మరెక్కడాలేవు. అందువలన తౌరాత్ అనబడునది ప్రథమ దైవ గ్రంథమనీ, ఇంజీల్ అనునది ద్వితీయ దైవ గ్రంథమనీ చెప్పవచ్చును. ఖుర్ఆన్ గ్రంథము పూర్వపు గ్రంథములైన రెండు గ్రంథములను ధృవపరుస్తోంది అని మూడవ సూరా, మూడవ ఆయత్ నందు గల వాక్యములోనే చెప్పారు. కావున ఈ వాక్యము రెండు గ్రంథములు ఫలానాయని చెప్పుటకు శాస్త్రాధారముగాయున్నది. ఇంజీల్ గ్రంథమంటే బైబిలు గ్రంథమని కొంత సూచనప్రాయముగా ఖుర్ఆన్‌లో సూరా 57లో 27వ వాక్యమునందు కొంత సమాచారము గలదు. అయితే తౌరాత్ గ్రంథమును గురించి ఎవరికీ ఎక్కడా ఆధారములేదు.

ఖుర్ఆన్ గ్రంథముకంటే ముందు దేవుడిచ్చిన గ్రంథములు మనకు తెలిసినంతవరకు బైబిలు, భగవద్గీత. అయితే బైబిలు, ఖుర్ఆన్ రెండు గ్రంథములు భగవద్గీతనే సమర్థించుచూ ధృవీకరిస్తున్నవి. ఇది ధర్మశాస్త్ర మని భగవద్గీతను గూర్చి రెండు గ్రంథములూ సాక్ష్యముగా ధృఢపరుస్తున్నవి. అందువలన ధర్మశాస్త్రము అంటే యెషయా ప్రవక్త వ్రాసినదికాదు. అట్లే యిర్మీయా ప్రవక్త వ్రాసినదికాదు. యెషయా వ్రాసినది భవిష్యత్తును చెప్పు శాస్త్రమేగానీ, ధర్మశాస్త్రముకాదని తెలియవలెను. అసలైన ధర్మశాస్త్రమును భగవద్గీతయని భారతదేశములో అనగా, ఇశ్రాయేల్ దేశములో వారి భాషలో తౌరాత్ గ్రంథమని చెప్పారని అనుకోవచ్చును. భగవద్గీతను తౌరాత్‌ను ఏకము చేసి చూడకపోతే ప్రపంచములో తౌరాత్ గ్రంథము యొక్క ఆనవాళ్ళే కనిపించవు. అందువలన భగవద్గీతయే తౌరాత్ గ్రంథమని అందరూ గ్రహించవలెను.

భగవద్గీతలోని వచనములను తర్వాత వచ్చిన దూతగానీ, గ్రంథము గానీ చెప్పితే అప్పుడు ఆ వాక్యములను తిరిగి నెరవేర్చినట్లగును. నెరవేర్చుడము అంటే ఆ వాక్యములను తిరిగి చెప్పడమని అర్థము. ఖండించడము అంటే ఆ వాక్యములను చెప్పకుండా వదలివేయడమని అర్థము. ఖుర్ఆన్‌లోగానీ, బైబిలులోగానీ పూర్తి భగవద్గీత యొక్క సారాంశము కలదు. కావున గీతలోని వాక్యములను బైబిలు, ఖుర్ఆన్ రెండు గ్రంథములు నెరవేర్చినట్లే యగుచున్నది. మాయ భగవద్గీత పేరును చెప్పకుండా చేసి, దాని స్థానములో తౌరాత్ అని చెప్పడము వలన గీతనుండి చూపును ప్రక్కకు త్రిప్పినట్లయినది. తర్వాత అది ఏ గ్రంథమో అర్థము కాకుండాపోయినది. మాయను తీసివేసి చూస్తే అసలైన ధర్మశాస్త్ర గ్రంథమేదో తెలియగలదు.

తౌరాత్, ఇంజీల్ అను పూర్వ గ్రంథములను గురించి ఖుర్ఆన్ గ్రంథములో ముస్లీమ్ పెద్దలు తమ ఉద్దేశ్యమును ఈ విధముగా దివ్య ఖుర్ఆన్ సందేశము అను గ్రంథములో వ్రాశారు చూడండి. "ఇక్కడ ఖుర్ఆన్‌లో పేర్కొనబడిన ఇంజీల్ మరియు తౌరాత్ గ్రంథాలు అంటే ఈసా మరియు మూసాలపై అవతరింపజేసిన దివ్య గ్రంథాలని అర్థము. ఆ అసలు దివ్య గ్రంథాలు ఇప్పుడు ప్రపంచములో లేవు. మూసా మరియు ఈసాలపై అవతరింపజేసిన తౌరాత్ మరియు ఇంజీల్ గ్రంథాల భాష గ్రీకు కాదు. అవి ఏ భాషలోనివో తెలియదు" అన్నారు. ఇంకా కొందరు ముస్లీమ్‌లు వేరువేరు అభిప్రాయములను ఈ రెండు గ్రంథములను గురించి వెలిబుచ్చారు. ఎవరు ఏమి చెప్పినా వీటిని గురించి ఖచ్చితముగా తేల్చి చెప్పలేదు. అటువంటప్పుడు అవి ఏవి అని కనుగొనుటకు ఒక ఆధారము (క్లూ) కలదు. అదేమనగా! ఖుర్ఆన్ మూడవ సూరా, మూడవ ఆయత్‌లో

తౌరాత్, ఇంజీల్ అను గ్రంథముల పేర్లు చెప్పినప్పుడు ఖుర్ఆన్ గ్రంథము ఆ గ్రంథములను ధృవపరుస్తోంది అని చెప్పడము గలదు. దీని ఆధారముతో ఖుర్ఆన్ ఏ గ్రంథములను ధృవపరుస్తోందో అవియే తౌరాత్, ఇంజీల్ గ్రంథములని గ్రహించగలము. ఇక్కడ కొందరికి ఒక సంశయము వచ్చి ధృవపరచడము అంటే ఏమిటి? ఎలా అర్థము చేసుకోవాలని అడుగవచ్చును. దానికి సమాధానము ఇలా కలదు.

ఈ విషయము అర్థమగుటకు చిన్న ఉదాహరణను చెప్పుచున్నాను గమనించండి. దేశములో ముఖ్యముగా మూడు రాజకీయ పార్టీలున్నాయను కొనుము. అందులో ఏదో ఒక పార్టీ మిగతా రెండు పార్టీలకంటే, నీతి, నిజాయితీగ ఉన్నదని తెలిసినప్పుడు ఆ పార్టీనే నీవు ఒప్పుకొంటావు, దానికే నీ ఓటు వేస్తావు. అంతేకాకుండా నీవు ఏ పార్టీని ఒప్పుకొని ఓటు వేయదలచుకున్నావో అది ఫలానా పార్టీ అని మిగతా వారికి కూడా తెలియునట్లు ఆ పార్టీ జెండాను ఇంటికిగానీ, వాహనమునకుగానీ పెట్టుకోవడము జరుగుచున్నది. అంతేకాక ఆ పార్టీ టోపీనీ తలమీద పెట్టుకొని నాకు నచ్చినపార్టీ ఇదియని తెలియజేతుము. దానిని చూచిన మిగతావారందరూ ఇతను మెచ్చిన పార్టీ ఇదియని తెలుసుకొందురు. అంతేకాక జెండాను, టోపీని ధరించిన పార్టీని ఇతను బలపరుస్తున్నాడని అనుకొందురు. బలపరచడమును ధృడపరచడము అనిగానీ, ధృవీకరించడము అనిగానీ చెప్పవచ్చును. అదే విధముగా మూడు మత గ్రంథములలో ఏ మతమును ఇష్టపడువాడు ఆ మతములోవుండి, ఆ మతమును గురించే ధృఢముగా చెప్పుచుండును. అందువలన హిందువు శ్లోకములు చెప్పితే, క్రైస్తవుడు వాక్యాలు చెప్పుచుండును.

ఇక్కడ అదే విధముగా తౌరాత్ గ్రంథమునుగానీ, ఇంజీలు గ్రంథమును గానీ ఖుర్ఆన్ ధృవీకరణ చేయుచున్నది అని అంటే, ఆ గ్రంథములలోని వాక్యములుగానీ లేక సమాచారముగానీ ఖుర్ఆన్ గ్రంథములో ఉండితీరును. ఒక పార్టీని ధృవీకరించినప్పుడు ఆ పార్టీ రంగును, ఆ పార్టీ జెండాను, టోపీని మనవద్ద చూపినట్లు లేక ఉంచుకొన్నట్లు ఒక గ్రంథమును మరొక గ్రంథము ధృవీకరిస్తుంది అని అంటే మొదటి గ్రంథములోని విషయములు రెండవ గ్రంథములో ఉండితీరును. అట్లు ఉన్నప్పుడే ఫలానా దానిని ధృవీకరణ చేయుచున్నదని చెప్పుటకు అవకాశముండును. ఇప్పుడు తౌరాత్ మరియు ఇంజీలు గ్రంథములు ఏవో తెలియనప్పుడు ఖుర్ఆన్ గ్రంథములో ఏ విషయములుగలవో ఆ విషయములను ఆధారము చేసుకొని ఆ రెండు గ్రంథములను కనుగొనవచ్చును.

ఖుర్ఆన్ గ్రంథము పూర్వము దేవుడిచ్చిన తౌరాత్, ఇంజీలు గ్రంథములను ధృవీకరిస్తున్నదని ఖుర్ఆన్ గ్రంథములోని మూడవ సూరా, మూడవ ఆయత్‌గా ఉన్నందున ఖుర్ఆన్‌లోని విషయములు ఎక్కడున్నవో ఆ విషయములున్న గ్రంథములు తౌరాత్, ఇంజీలు గ్రంథములని చెప్పవచ్చును. సైకిలు గుర్తును, పసుపు టోపీని ఆధారము చేసుకొని అవి ఎక్కడున్నవో అక్కడ తెలుగుదేశము పార్టీ ఉన్నదని గుర్తించినట్లు, ఖుర్ఆన్‌లోని విషయములనుబట్టి అవివున్న తౌరాత్, ఇంజీలు గ్రంథములను సులభముగా గుర్తించవచ్చును. ఆ విధముగా ఖుర్ఆన్ జ్ఞానమును ఆధారము చేసుకొని అన్వేషణ చేస్తే, ఏసు చెప్పిన బైబిలు ఇంజీలు గ్రంథమనీ, కృష్ణుడు చెప్పిన భగవద్గీత తౌరాత్ గ్రంథమని తెలియుచున్నది. బైబిలు గ్రంథము కూడా చివరకు తనకంటే ముందువచ్చిన ధర్మశాస్త్రమైన గీతను

సమర్థించుచున్నది. కావున బైబిలు అను ఇంజీలు గ్రంథమూ మరియు ఖుర్ఆన్ గ్రంథమూ రెండూ కలిసి తౌరాత్ అనబడు భగవద్గీతను సమర్థించు చున్నవని తెలియుచున్నది. భగవద్గీతలోనున్న విషయములనే ఇటు బైబిలు, అటు ఖుర్ఆన్ గ్రంథములు రెండూ తమయందు కల్గియున్నందున, చివరకు రెండు గ్రంథములు భగవద్గీతను ధృవీకరిస్తున్నవని చెప్పడమేకాక, తౌరాత్ గ్రంథమనునది అగమ్యగోచరముగాయున్నా చివరకు భగవద్గీతయని తేలి పోయినది. అది కాదని ఖండించుటకు వీలులేకుండా మిగతా రెండు గ్రంథములలోని జ్ఞాన విషయములే సాక్ష్యముగా ఉన్నవి.

కొన్ని ఆధారముల ప్రకారము తౌరాత్, ఇంజీలు అను గ్రంథాలను గుర్తించగలిగాము. దేవుడిచ్చిన రెండు గ్రంథములు మనకు దగ్గరగానే ఉన్నట్లు తెలిసిపోయినది. ఖుర్ఆన్ చెప్పి 1400 సంవత్సరములైనది. అప్పుడే జిబ్రయేల్ దేవుడిచ్చిన రెండు పూర్వ గ్రంథములను గురించి చెప్పాడు అంటే, ఉన్న వాటినే చెప్పియుంటాడు అను నమ్మకముతో చూస్తే, ఖుర్ఆన్‌లో గల వాక్యములున్న రెండు గ్రంథములను గుర్తించగలిగాము. ఆ రెండింటిలో తౌరాత్ అనబడు గ్రంథమే ముఖ్యమైనదని కూడా అర్థమైనది. ఖుర్ఆన్ మరియు ఇంజీల్ (బైబిలు) రెండు గ్రంథములు చివరకు తౌరాత్ (భగవద్గీత) గ్రంథమునే బలపరుస్తున్నవని తెలిసిపోయినది. దీనినిబట్టి ఖుర్ఆన్ బలపరుచుచున్న, ఖుర్ఆన్‌కంటే ముందు వచ్చి ఎవరూ గుర్తించలేని విధముగా యున్న, రెండు గ్రంథములలో ఇంజీల్ గ్రంథము కూడా తౌరాత్ గ్రంథమునే బలపరుస్తున్నట్లు మత్తయి సువార్త ఐదవ అధ్యాయములోని 17వ వచనమునుబట్టి తెలియుచున్నది. ఖుర్ఆన్‌లో మూడవ సూరా, మూడవ ఆయత్‌నందు మరియు ఆరవ సూరా, 92వ ఆయత్‌నందు ఖుర్ఆన్ నేను అవతరింపజేసిన గ్రంథమే. ఇది ఎంతో శుభప్రధమైనది. దీనికంటే

ముందు అవతరింపజేసిన గ్రంథములను ధృవీకరిస్తుందని చెప్పడము జరిగినది. ముందు వచ్చిన రెండు గ్రంథములలో బైబిలు (ఇంజీల్) గ్రంథమునందు దానికంటే ముందు వచ్చిన భగవద్గీత (తౌరాత్) గ్రంథమును బలపరుస్తూ "ధర్మశాస్త్రమునైననూ, ప్రవక్తల వచనములనైననూ, కొట్టివేయుటకు రాలేదు, నేను నెరవేర్చుటకే వచ్చాను" అని ఏసు చెప్పినట్లు కలదు. దీనినిబట్టి బైబిలు గ్రంథము కూడా భగవద్గీతనే బలపరుస్తున్నది.

మూడు కాలములలో, రెండు దేశములలో దేవుడు ఇచ్చిన మూడు గ్రంథములు వచ్చాయి. మూడింటిలో దేవుని ధర్మములే ఉన్నాయి. మూడు గ్రంథములలో దేవుని జ్ఞానమే ఉన్నప్పుడు, మూడూ దేవుని గ్రంథములే అయినప్పుడు ప్రజలు తెలుసుకొను నిమిత్తము రెండు దేశములలో, మూడు కాలములందు చెప్పియున్నప్పుడు, వాటి ద్వారా ప్రజలు దేవుని జ్ఞానమునే తెలియగలిగినప్పుడు మూడింటిలో రెండు గ్రంథములు ఒక గ్రంథమును ఎందుకు ధృవీకరించవలసి వచ్చినది? దేవుడి ఖుర్ఆన్ గ్రంథము దానికంటే ముందు గల దైవ గ్రంథములను ఎందుకు ధృవీకరిస్తున్నది? అదే విధముగా బైబిలు గ్రంథము దానికంటే ముందు వచ్చిన భగవద్గీతను ఎందుకు సమర్థించుచున్నది? మూడింటియందు ఒకే దేవుని జ్ఞానము ఉన్నప్పుడు రెండు గ్రంథములు వాటికంటే ముందు వచ్చిన గ్రంథమును ధర్మశాస్త్రమని చెప్పుచూ, ఎందుకు ధృవీకరించవలసి వచ్చినదను ప్రశ్న చాలామందికి రాగలదు. నాకు కూడా అదే ప్రశ్న వచ్చినది. అయితే జవాబు ఏమి వస్తుందో చూస్తాము.

ఖుర్ఆన్, బైబిలు, భగవద్గీత మూడు గ్రంథములు దైవ గ్రంథములేనని ముందునుండి చెప్పుచునే వచ్చుచున్నాము. మూడింటియందు దేవుని జ్ఞానము, దేవుని ధర్మములే గలవని కూడా చెప్పాము. అందువలన చివరిలో

వచ్చిన ఖుర్‌ఆన్‌ను అంతిమ దైవ గ్రంథమని, మధ్యలో వచ్చిన బైబిలును ద్వితీయ దైవ గ్రంథమనీ, ముందు వచ్చిన భగవద్గీతను ప్రథమ దైవ గ్రంథమనీ చెప్పుకొన్నాము. వచ్చిన ముందు వెనుక కాలములనుబట్టి ప్రథమ, అంతిమ అని చెప్పుకొన్నాముగానీ, ఇందులో ఎక్కువ అందులో తక్కువ ఉందను భావముతో చెప్పలేదు. మనము చెప్పుకొన్నంత వరకు ఫలానా గ్రంథమును ఎక్కువ అనిగానీ, ఫలానా గ్రంథమును తక్కువ అనిగానీ చెప్పుకోలేదు. మన దృష్ఠిలో దేవుడిచ్చిన మూడు గ్రంథములు సమానమే. ఏ గ్రంథమును అనుసరించినా దైవమార్గమునే అనుసరించినట్లగును. ఒకవేళ ఎవరైనా ఈ గ్రంథము ఆ గ్రంథముకంటే గొప్పదని అంటే, అతడు గ్రంథములను గురించి పూర్తిగా తెలియనివాడై వుండును. మూడు గ్రంథములను పూర్తిగా చూచినవాడు ఎవడైనా ఇది గొప్ప, ఇది తక్కువ అని చెప్పుటకు వీలులేనట్లు మూడు గ్రంథములు గలవని చెప్పవచ్చును. కొందరు మూడింటిలో ఒక గ్రంథమును గురించి గొప్పగా చెప్పుచూ, మిగతా రెండు గ్రంథములను గొప్పగా చెప్పలేదనిన అతడు స్వమతాభి మానియై, పరమత ద్వేషియై ఉండును. అటువంటి వారే మా మతము గొప్పది, మా మత గ్రంథము గొప్పది, మా మతమునే అనుసరించండి, మా మతములో తప్ప మీకు స్వర్గము రాదు అనుచుందురు.

అటువంటి వారు ఎంత గొప్పవారైనా, ఎంతో పెద్ద బోధకులుగా యున్నా, వారికి మతస్వార్థము తప్ప దైవజ్ఞానము ఏమాత్రము లేదనియే చెప్పవచ్చును. ఎంతపెద్ద బోధకులైనా వారికి కొద్దిగా కూడా దైవ జ్ఞానము లేదని చెప్పుటకు ఆధారము వారి మాటలలోనే కలదు. ఎప్పుడైతే మా మతములోనే స్వర్గము వస్తుంది, మిగతా మతములలో నరకము వస్తుంది అనుచుందురో అప్పుడే వీరికి దేవుని జ్ఞానము తెలియదని చెప్పవచ్చును.

మూడు దైవ గ్రంథములు దేవున్ని చేరుకొనే మార్గమును బోధించుచున్నవి తప్ప, స్వర్గమునకు పోయే మార్గమును చూపడము లేదు. స్వర్గనరకములు మనుషులు చేసుకొనే పుణ్యపాపములనుబట్టి వస్తాయిగానీ, దేవుడు చెప్పిన జ్ఞానమును బట్టి రావు. దేవుని జ్ఞానమునుబట్టి మోక్షము లభించగలదు. మోక్షమునే ముక్తి అంటారు. ముక్తినే జన్మరాహిత్యము అని గ్రంథములలో చెప్పబడడమైనది. పుణ్యము వలన సుఖములు వస్తే ఆ సుఖములు అనుభవించు స్థలము, సుఖాల నిలయము స్వర్గము. సుఖాలలోనున్న వానికి దేవుని విలువ తెలియదు, దేవుని జ్ఞానము తెలియదు. దేవుడంటే భయము ఉండదు. అటువంటి వారికి జ్ఞానముండుననినా, వారు దేవుని జ్ఞానమును అనుసరించారనినా పూర్తి తప్పగును. దేవుని జ్ఞానమువలన స్వర్గము వస్తుందని అంటే అంతకంటే అజ్ఞాని ఉండడు. అందువలన వారి మాటలనుబట్టి వారిలోని జ్ఞానము తెలిసిపోవును. అటువంటి అజ్ఞానులు మతములను గురించియే చెప్పి, వారి మతమును అభివృద్ధి చేసుకోవాలని చూస్తుందురు. అటువంటి వారి దృష్టిలో ఏదో ఒక గ్రంథము గొప్పగావుంటే మిగతా రెండు గ్రంథములు తక్కువగా ఉండును. అదియు తన మతమునకు సంబంధములేనివనుకొని తక్కువగా చెప్పుచుండును. మానవులైన వారు మూడు దైవ గ్రంథములలో ఏ ఒక్క దానినీ తక్కువగా చెప్పుటకు గానీ, ఎక్కువగా చెప్పుటకుగానీ అర్హుడు కాదు.

ఇప్పుడు కొందరు అతి తెలివిగా నన్ను ఒక ప్రశ్న అడుగవచ్చును. అది ఏమనగా! మూడు గ్రంథములు సమానమేనని ఒక ప్రక్క చెప్పుచూ నీ మత స్వార్థముతో, నీ మతమునకు సంబంధించిన భగవద్గీతను నీవు ఎక్కువగా చెప్పుచున్నావు కదా! అని ప్రశ్నించవచ్చును. దానికి నా జవాబు ఏమనగా! నేను హిందూ మతములో పుట్టిన మాట వాస్తవమే అయినా,

హిందూ మతగ్రంథము భగవద్గిత అని నేను ఎప్పుడూ అనుకోలేదు. మిగతావారు మూడు గ్రంథములను మూడు మతములకు సంబంధమేర్పరచి మాట్లాడినా, మూడు గ్రంథములు సర్వ మానవులకు కావలసినవేననీ, ఏ ఒక్క గ్రంథమూ ఏ మతమును గురించీ చెప్పలేదనీ, ప్రతి గ్రంథము సర్వ మానవులకు సంబంధించినదని, దేవుడు ఆ మూడు గ్రంథములలో బోధించాడు. అటువంటప్పుడు భగవద్గీత హిందూ మతమునకు సంబంధించినదని అనుకోవడము పూర్తి అజ్ఞానమగును. నేను మిగత రెండు గ్రంథములకంటే భగవద్గీత గొప్పదని ఎప్పుడూ చెప్పలేదు. మూడూ దైవ గ్రంథములే అని చెప్పానని మరువకూడదు. భగవద్గీత, బైబిలు, ఖుర్‌ఆన్ మూడు గ్రంథములలో భగవద్గీతను మిగతా రెండు గ్రంథములు ధృవీకరిస్తున్నవని దేవుడు గ్రంథములలో చెప్పిన వాక్యములను చూపించుచూ చెప్పాను. అంతేగానీ నేను స్వయముగా చెప్పలేదు కదా! ఖుర్‌ఆన్‌లో మూడవ సూరా, మూడవ ఆయత్‌లోనూ, ఆరవ సూరా, 92వ ఆయత్‌లోనూ చెప్పిన వాక్యములనూ, అలాగే బైబిలు గ్రంథమందు మత్తయి సువార్త ఐదవ అధ్యాయములో 17వ వాక్యమును చూపించి చెప్పాను గానీ, నేను స్వతహాగా చెప్పలేదు కదా! దేవుడు తన గ్రంథములలో భగవద్గీతను సమర్థించాడని చూపించి చెప్పాను. దేవుడైనా అలా ఎందుకు చెప్పాడని ప్రశ్న వస్తే దానికి నేనుగానీ, దేవుడుగానీ ఒకే జవాబు చెప్పుటకు అవకాశముగలదు.

ఒకే జాతిగా, ఒకే దేవుని సంతతిగా పుట్టిన మనుషులు ఒకే జ్ఞానమును ఆశ్రయించి, ఒకే దేవున్ని ఆరాధించుటకు ఆ విధముగా చెప్పవలసి వచ్చినదని చెప్పవచ్చును. మూడు గ్రంథములున్నా ముందు పుట్టిన గ్రంథమునే అనుసరించుట వలన, అందరూ ఒకే సమాజముగా ఉండగలరను ఉద్దేశ్యముతో దేవుడు ఆ విధముగా చెప్పాడు. మూడు

గ్రంథములలోని జ్ఞానము ఒక్కటే అయినందున, ప్రథమ దైవ గ్రంథమును అనుసరించడము వలన, అందరూ ఒకే గుంపుగా ఒకే ఉద్దేశ్యముతో ఉందురనీ, అట్లుకాకపోతే ఒక్కొక్కరు ఒక్కొక్క గ్రంథమును గొప్పగ పెట్టుకొంటే, వాటి వలన మతములు ఏర్పడి ఒకే జాతిగాయున్న మానవులు మేము ఎద్దులము మీరు ఎనుములన్నట్లు, మేము వేరు మీరు వేరని పోట్లాడుదురని, ఆ విధముగా మూడింటిలో ముందువచ్చిన తన గ్రంథమునే సమర్థించి, రెండు గ్రంథములు ముందు గ్రంథమును ధృఢపరుస్తున్నవని చెప్పాడు. అలా చెప్పడము మతములు, మతద్వేషములు లేకుండుటకేనని తెలియవలెను. అయినా దేవుని మాటను లెక్కించనివారు, ఆయన చెప్పినట్లు ప్రథమ దైవ గ్రంథమును గుర్తించక, ఒక్కొక్కరు ఒక్కొక్క గ్రంథమును ఆధారము చేసుకొని, మతములను సృష్ఠించుకొని, వినాశనమువైపు ప్రయాణిస్తున్నారు. నేడు మతముల సమాజములో ఇప్పటికైనా దేవుడు చెప్పిన వాక్యముల ప్రకారము ప్రథమ దైవ గ్రంథమును ఆశ్రయించితే మతములూ ఉండవు, మతద్వేషములూ ఉండవు. నిజమైన దైవజ్ఞానము కల్గి దేవున్ని చేరగలరు, స్వర్గమును కాదు దేవున్ని చేరగలరని చెప్పుచూ ముగిస్తున్నాము.



**ఒక విషయమును సమర్థించుటకు శాస్త్రము ఎంత అవసరమో, అట్లే ఒక విషయమును ఖండించుటకు శాస్త్రము అంతే అవసరమగును.**



**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**



# ప్రథమ దైవ గ్రంథము భగవద్గీత

ప్రముఖుల లేఖ

సాక్షి న్యూస్ పేపరు 21-01-2014



## ఇందు దేశమే ఇండియా!

**హి**మాలయాలకు, వింధ్యపర్వతాలకు మధ్యగా అప్పటి ఆర్యావర్తనం (ఆర్యుల భూభాగం) ఎక్కడ ఉండేదో మన దేశ పటంలో నువ్వు చూశావు. అది బాల చంద్రాకారంగా ఉన్నట్లు కనిపిస్తుంది. అందుకే ఆర్యావర్తానికి ఇందుదేశమని పేరు వచ్చింది. ఇందు దేశమే హిందూదేశమయింది.

రామాయణం పుట్టిన చాలాకాలానికి మహాభారతం పుట్టింది. అది రామాయణం కంటే పెద్ద గ్రంథం. దానిలో చెప్పింది ఆర్యద్రావిడ యుద్ధం కాదు. ఆర్యుల మధ్య ఏర్పడిన కుటుంబకలహమే భారతకథ. భారతంలో చెప్పిన కథలు, ధర్మాలు ఇన్నీ అన్నీ కావు. అవి చాలా అందంగా, గంభీరంగా ఉంటాయి. వీటి అన్నిటికంటే గొప్పదైన భగవద్గీత అనే మహా గ్రంథం మహాభారతంలో ఉన్న కారణాన అది మనకందరికీ ప్రియతమమైనది అయింది. వేల సంవత్సరాల క్రితమే మన దేశంలో ఇలాంటి గొప్ప గ్రంథాలు పుట్టాయి. మహానుభావులే వీటిని రాసి ఉంటారు. ఈ గ్రంథాలు పుట్టి ఇంతకాలం గడిచినా వాటి గురించి తెలుసుకోని పిల్లలు, ప్రయోజనం పొందని పెద్దలు అంటూ ఉండరు.

* నెహ్రూ ఇందిరకు రాసిన లేఖలోనుంచి

అన్ని మతములకు సంబంధించినది